# సారంగపాణి పదసాహిత్యం





డా. ఎస్. గంగప్ప

సారంగపాణి పదసాహిత్యం
(విమర్శక గ్రంథం)

రచయిత :
డా. ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.,
ఆంధ్రోపన్యాసకులు,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్ – 522510, గుంటూరు జిల్లా





ప్రథమ ముద్రణ : నవంబర్ 1980
ప్రతులు : 1000

వెల : రూ. 8/-

ముఖపత్రరచన : శ్రీ నాగుల్, మంగళగిరి

ప్రతులకు :
శశీ ప్రచురణలు
C-73, శ్రీనివాస నగర్, గుంటూరు-522006.

నవోదయా పబ్లిషర్స్
ఏలూరురోడ్, విజయవాడ-2,
అరండల్ పేట, గుంటూరు-2

ముద్రణ :
వైష్ణవి ప్రింటర్స్, గుంటూరు-1.

# ఉపయుక్త గ్రంథాలు


ఆంధ్రవాగ్గేయకార చరిత్ర. 1975 – బాలాంత్రపు రజనీకాంతరావు

ఆంధ్రసంస్థానములు – సాహిత్యపోషణము. 1969 – ఆచార్య తూమాటి దోణప్ప

కావ్యాలంకార సంగ్రహము, 1959 – సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి

క్షేత్రయ్య పదములు, 1950 – వావిళ్ళప్రతి (సం.)

క్షేత్రయ్య పదసాహిత్యం: 1974 – డా॥ ఎస్. గంగప్ప

తెలుగు హరికథా సర్వస్వం, 1978 – ఆచార్య తూమాటి దోణప్ప

విజ్ఞాన సర్వస్వం – సంపుటం 3 – 1959

శివానంద లహరి, 1958 – శంకరాచార్యులు

సంకీర్తన లక్షణము, 1935 – తాళ్ళపాక చినతిరుమలయ్య

సంగీత సంప్రదాయప్రదర్శిని, 1973 – (సం.) మంచాళ జగన్నాధరావు

సంస్థానముల సాహిత్యసేవ, 1975 – కేశవపంతుల నరసింహశాస్త్రి

సారంగపాణి పదములు, 1963 (సం.) పురిపండా అప్పలస్వామి

సాహిత్యోపన్యాసములు – 3 – ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ – 1963


## పత్రికలు


ఆంధ్ర పత్రిక – 1940 – 65, 76

భారతి – 1971, 72

స్రవంతి – 1975


## ప్రత్యేక సంచికలు


కృష్ణాస్రవంతి – 1.7.1959, అవనిగడ్డ

చిత్తూరుజిల్లా రచయితల మహాసభల ప్రత్యేకసంచిక, అక్టోబర్ 1968

## సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 5 | 4 | వాయికా | నాయికా |
| 10 | 2 | బందురులో | బందరులో |
| 20 | 7 | స్పష్ణం | స్పష్టం |
| 27 | 10 | న రు | నబురు |
| 30 | 14 | జాగారూకతతో | జాగరూకతతో |
| 37 | 12 | మడుగులొత్తై నే | మడుగులొత్తేనే |
| 48 | 22 | జవాలు | జవాబులు |
| 51 | 6 | నారిజాక్షుల | వారిజాక్షుల |
| 53 | 4 | జీరితే | జేరితే |
| 77 | 17 | పంత | సంత |
| 81 | 5 | రెణ్ణెల్లు | రెణ్ణెల్లు |
| 81 | 15 | వాళ్కో | వాళ్కో |
| 102 | 16 | సనవిస | విసవిస |
| 110 | 12 | గసడదవావేశసంధి | గసడదవాదేశసంధి |
| 120 | 2 | భావస్ఫోకరమై | భావస్ఫోరకమై |
| 120 | 14 | యెన్నెంతలే | యెన్నెన్నింతలే |
| 140 | 19 | త్రివుట | త్రిపుట |

# అపరలం

పల్లవి : గోపాలా - వేణు
గోపాలా

అను : కోపాలా నాపై - అను
తాపాలా పరచితినని ॥గో॥

గాజుముక్క రత్నంగాదని
నాజూకు మిణుగురు రవిగాదని
ఓజ ఇత్తడి పైడి గాదని
నైజరీతి నేడు తెలిసితిని ॥గో॥

సారామృత రసపూరం
సారంగపాణి పదహారం,
సారస్యయుత విహారం
నారదన ఆనందాకరం ॥గో॥

చిందులు దొక్కెటి శ్రీహరీ !
అందాల బృందా విహారీ !
మందరగిరిధరా ! మురహరా !
అందుకోకృతిని ఆర్తిహరా ! ॥గో॥

# విషయ సూచిక

అంకితం

ఆశాసనం

అభినందన

ఉపోద్ఘాతం

ఆముఖం

1. జీవిత విశేషాలు 1-15

1. 1 ఆశ్రయించిన రాజులు 2

1. 2 కాలం 6

1. 3 నివాసం 8

1. 4 వైదుష్యం 10

1 5 విశేషాలు 11

2. పదకవితా శిల్పం 16-96

2. 1 తెలుగులో పదరచన 16

2. 2 మనోజ్ఞ పదరచన 18

2. 3 పదప్రయోగ దక్షత 28

2. 4 సున్నిత భావప్రకటన 29

2. 5 శ్లేషాదులు 30

2. 6 వర్ణనలు 36

2. 7 భావ చిత్రాలు 42

2. 8 అలంకారాలు 51

2. 9 లోకజ్ఞత 65

2. 10 హాస్యం 80

2. 11 పోలికలు 84

3. భాషా వైభవం 97-121

3. 1 పలుకుబళ్లు 98

3. 2 సామెతలు 102

3. 3 ధ్వనుల మార్పులు 105

3. 4 సంధులు 109

3. 5 సమాసాలు 112

3. 6 క్రియలు 113

3. 7 వింత ప్రయోగాలు 115

3. 8 అన్య దేశ్యాలు 115

3. 9 వ్యావహారిక భాష 116

4. శృంగారం—భక్తి 122-137

4. 1 శృంగారరసం 122

4. 2 భక్తి రసం 130

4. 3 మధురభక్తి 134

4. 4 నీతిబోధ 136

5. సంగీతం - అభినయం 138-146

5. 1 సంగీతం 138

5. 2 అభినయం 142

5, 3 అశ్లీలతా నిరాసం 144

ఉపయుక్త గ్రంథాలు 147

సవరణలు 148

# ఆశాసనం

ఆచార్య తూమాటి దొణప్ప, ఎం. ఏ., పిఎచ్. డి.
తెలుగు శాఖాధ్యక్షులు,
నాగార్జున విశ్వవిద్యాలయం
నాగార్జున నగర్ - 522510

తెలుగునాటి ఉత్తమ విద్యాబోధకులలో, ఉదాత్త సాహితీ పరిశోధకులలో డా. గంగప్ప ఒకరు. రచనమూ, ప్రవచనమూ రెండూ ఆయనకు అభిమాన విషయాలు. పదసాహిత్య పరిశీలనంలోనూ, జానపద కళానుశీలనంలోనూ పేర్కొనదగ్గ కృషి చేసిన కళారాధకు డాయన.

డా. గంగప్ప నిరంతరకృషికి మరోనిదర్శనం ప్రకృత కృతి 'సారంగపాణి పదసాహిత్యం'. సామగ్రీ సంకలనంలోనూ, శాస్త్రీయ విశ్లేషణంలోనూ, సిద్ధాంత స్థాపనంలోనూ నిర్దిష్టమూ, నిర్దుష్టమూ అయిన పద్ధతి యీ కూర్పులో అడుగడునా కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

ఈ సాధకుడు ఇంకా యెత్తుకు ఎదగాలనీ, ఇతోఽధిక కృషి చేయాలనీ మనసారా ఆసిస్తున్నాను; ఆశీర్వచిస్తున్నాను.

నాగార్జుననగర్ (సం) తూమాటి దొణప్ప.
19. 11. 1980.

# అ భి నం ద న

ఆచార్య జి. ఎన్. రెడ్డి, ఎం. ఏ, ఎం.లిట్., పిహెచ్. డి,

తెలుగు శాఖాధ్యక్షులు,

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,

**తిరుపతి.**

తెలుగు సంగీత సాహిత్యరంగంలో జగమెరిగిన వాగ్గేయకారులు ముగ్గురు. అన్నమయ్య (1424—1503); క్షేత్రయ్య (1600-1660); త్యాగయ్య (1767-1847). జగమెరుగని వాగ్గేయకారులు మరికొందరున్నారు. వారిలో ప్రముఖుడు సారంగపాణి (1680—1750); ప్రసిద్ధులైన క్షేత్రయ్య త్యాగయ్యల మధ్యకాలం వాడు. ఉద్ధతుల మధ్య మరుగు పడినవాడు. క్షేత్రయ్య మరణం సారంగపాణి జననం, సారంగపాణి మరణం త్యాగయ్య జననం ఇరవై సంవత్సరాల వ్యవధిలో జరగడం ఒక విచిత్రమైన సంఘటన. వాస్తవానికి సారంగపాణి ఒక విలక్షణమైన వాగ్గేయకారుడు. అయినా అటు సంప్రదాయ సంగీతప్రియులు, ఇటు సాహిత్య చరిత్రకారులు సారంగపాణికి సముచితమైన ప్రాధాన్యం ఇవ్వలేదు. సారంగపాణి మహనీయుడైనా విస్మృతుడైన వాగ్గేయ కారుడయ్యాడు. అందుకు కారణాలు చెప్ప వచ్చు కాని చెప్పినందువల్ల కలిగే ప్రయోజనం కన్న, సారంగపాణిని గురించి లోకా నికి పునఃపరిచయం చేయడం, అతని సంగీత సాహిత్యకృషిని లోకానికి సవిమర్శకంగా సమగ్రంగా తెలపడం ప్రయోజనకరం. అట్టి అపూర్వమైన ప్రయత్న ఫలమే మన డా॥ గంగప్ప రచించిన ఈ గ్రంథము. తెలుగు సాహిత్యక్షేత్రంలో ముక్కారుపంటను పండించాలని ఉబలాటపడే రాయలసీమ హాలికుడు డా॥ గంగప్ప. క్షేత్రయ్య జీవిత చరిత్రను రచించి సముచిత గౌరవప్రతిష్ఠల్ని అందుకొన్న గంగప్పగారు అంతటితో ఆగకుండ "సారంగపాణి పదసాహిత్యం" పేరుతో మరొక గ్రంథాన్ని అందజేస్తు న్నందుకు మిక్కిలి అభినందనీయులు. ఈవిధంగా అన్నమయ్య మొదలుకొని తెలుగు వాగ్గేయకారులందరి జీవితరచనా విశేషాల్ని గురించిన సప్రమాణ విమర్శ గ్రంథాలను గంగప్పగారు ఆంధ్రలోకానికి అందజేయాలని ఆశిస్తున్నాను.

సారంగపాణి వాగ్గేయకారుడు. (శబ్దరత్నాకరంలోగాని, సూర్యరాయాంధ్ర నిఘంటువులోగాని వాగ్గేయకారుడు అనే ఆరోపంలేదు) వాగ్గేయకారుడు అంటే (వాక్+గేయం) వాక్కును గేయాన్నిచేసే నేర్పు గలవాడు. అంటే వాక్కారుడు, గేయకారుడు అయినవాడు — వాగ్గేయకారుడు అని తెలుసుకోవాలి. గేయమంటే పాట, పాటలనిర్మాణంలో రెండు అంశాలు ముఖ్యం : (1) (భాషాపరంగా) పాట లోని మాటలు; ఆమాటల కూర్పు. ఇదే వాక్కు. (2) (సంగీతపరంగా) పాటకు రాగలక్షణ నిర్ణయం అంటే సంగీతపు కూర్పు; ఇదే గేయం. సంగీతపు పరిభాషలో వాక్కును — అంటే పాటల్లోని మాటల కూర్పును-మాతువుఅనీ, గేయాన్ని - అంటే సంగీతపుకూర్పును - ధాతువు అనీ వ్యవహరిస్తారు. 'వాగ్గేయకారుడు' అన్నపుడు వాక్కారుడు, (వాక్కును/మాతువును కూర్చగలవాడు) గేయకారుడు [సంగీతాన్ని/ధాతువును కూర్చగలవాడు] అయిన వాడని గ్రహించాలి ఇంకా వివరించి చెప్పాలంటే మన సినిమాల్లోలాగ పాటవ్రాసినవాడు ఒకడు, దానికి సంగీతం కూర్చినవాడు ఒకడు, పాడి రంజింపజేసేవాడు మరొకడులాగ కాకుండ వాక్కారుడు, గేయకారుడు, గాయకుడూ అయినవాడే వాగ్గేయకారుడు. తెలుగు వాగ్గేయకారులందరూ ఇట్టివారే.

సారంగపాణి కూడా వాక్కారుడు, గేయకారుడు, గాయకుడు. తాను రచించిన పదాల్ని రాజాస్థానాల్లో, సభల్లో వినిపించిన ఆస్థానగాయకుడు; రాజపోషితుడు. సారంగపాణి వ్రాసిపాడిన పదాలు మొత్తమెన్ని అన్నది పరిశోధకులకు ఒక పెద్ద సమస్య. ఎన్నో వుంటాయి అనడం అతణ్ణి గొప్పజేయడానికి చెప్పేమాట మాత్రం కాదు. వాగ్గేయమే తన జీవితం. తన జీవితమే వాగ్గేయం అనుకొని జీవించినట్టి సారంగపాణి రచించిన పదాలు చాలవరకు కాలగర్భంలో కలిసి పోవడానికి కారణాలున్నాయి. అన్నమయ్య కీర్తనల్ని ఆయన సంతతివారు రాగిరేకుల మీద కెక్కించినందువల్లనే మనకు దశాంశమైన దక్కింది. క్షేత్రయ్య నాలుగు వేలకు పైగా చెప్పిన పదాల్లో నాలుగువందలుకూడా మనకు సంక్రమించలేదే! త్యాగయ్య కృతుల్ని అతని శిష్యులు ఎప్పటికప్పుడు వ్రాసి నిలబెట్టి నందువల్లనే అవి దక్కినాయి. అవీకూడా అన్నీదక్క లేదుకదా! మరి సారంగపాణి పదాలకు రాగిరేకుల యోగం లేదు; పైగా శిష్య పరివారమూ ఉన్నట్లులేదు. ఆకారణంగా సారంగపాణి పదాలు అనేకం అదృశ్యమైపోగా లభించినవి కొన్నే. అవైనా

లభించినందుకు 'ధన్యోస్మి' అనుకోవడం మంచిది. లభించిన సారంగపాణి పదాలు మాత్రం ముఖ్యంగా భాషా సాహిత్య ప్రియులకు అమూల్యమైన మణులు.

మన ఆలంకారికులు కవులకు వుండవలసిన లక్షణాలను చెప్పినట్లే భారతీయ సంగీత లాక్షణికులు వాగ్గేయకారులకు ఉండవలసిన లక్షణాల్ని ఉటంకించివున్నారు. వాగ్గేయకార శబ్దాన్ని, వాగ్గేయకారునికి ఉండవలసిన లక్షణాల్ని మొట్టమొదట పేర్కొన్న లాక్షణికుడు శార్ఙ్గదేవుడు. సంగీత రత్నాకరంలో శార్ఙ్గదేవుడు వాగ్గేయకారునికి చెప్పిన లక్షణాల్లో భాషాపరమైనవి ఐదువున్నాయి.

అవి :

1) శబ్దానుశాసన జ్ఞానం (భాషావ్యాకరణ పరిజ్ఞానం)

2) అభిదాన ప్రవీణత (నిఘంటువుల పరిచయం)

3) ఛన్దః ప్రభేద విదిత్వం (మార్గదేశి ఛందో జ్ఞానం)

4) అలంకార కౌశలం (శబ్దాలంకార, అర్థాలంకార ప్రయోగ నైపుణ ం)

5) అశేష భాషా విజ్ఞానం (భాషాపరమైన సంపూర్ణపాండిత్యం)

వాగ్గేయకారుడైన సారంగపాణికి ఈ లక్షణాలన్నీ ఉన్నాయని లభించిన అతని పదాలనుబట్టి నిరూపించడం కష్టంకాదు. సారంగపాణి సంస్కృతాంధ్ర భాషాకోవిదుడనడానికి అతడు చెప్పిన కేవలం సంస్కృత సమాస భూయిష్ఠమైన పదాలుకొన్ని, కేవలం దేశ్య పద ప్రధానమైన పదాలు కొన్ని ఉదాహరించవచ్చు. భాషా విషయంగా అన్నమయ్యాది ఇతర వాగ్గేయకారుల్ని మించిన స్వాతంత్ర్యాన్ని ప్రదర్శించినవాడు సారంగపాణి. ఈ శతాబ్దంలో తెలుగుభావ కవుల్లో నండూరి సుబ్బారావు రాసిన ఎంకిపాటలు భాషా పరంగా విలక్షణంగా సహృదయాల్ని ఆకట్టుకొన్నట్లే, పండితులు గ్రామ్యమనే భాషాశైలిలో సారంగపాణి రాసిన కొన్ని పాటలు ఆనాటి రాయలసీమ సామాన్య జన భాషా వ్యవహార స్వరూపావగాహనకు అమూల్యాధారాలుగాను ఆకర్షణీయంగాను ఉన్నాయి. ఉదాహరణకు—

పల్లవి : నచ్చత్రం బొయ్యొత్తామె - చంద్రుమాశి
నచ్చత్రం సూశొత్తామె

అనుపల్లవి: లచ్చుముశన్నారు ద్రరవునేమా గొల్లెంగు

పచ్చిబీమిశిరిపుడే - పయిణా మంటుండారు ॥నచ్చ॥

.... .... .... ....

ఈ పాట నండూరివారి నాయుడుబావ ఎంకితో 'తిరుపతెళ్లొద్దామె యెంకి' అన్నపాటకు మాతృకగా కనిపిస్తుంది. పండిత భాషనే కాకుండ ప్రజల భాషను గూడా ఆపోశనం పట్టిన వాగ్గేయకారుడు సారంగపాణి. భాషను,పదాలను, పదప్రయోగాలను వివరించే గ్రంథం కూడా రాయదగిందే. అతని పాటల్లో ఎన్నో సాంఘిక విశేషాలు, నుడికారాల్లో జాతీయాల్లో ఎన్నో చమత్కారాలు ఉన్నాయి.

సారంగపాణి జీవిత సాహిత్యాల్లోని అన్ని అంశాల్ని వివిధమైన శీర్షికల క్రింద వింగడించుకొని విమర్శ నాత్మకంగా, సప్రమాణంగా డా॥ గంగప్పగారు ఈ గ్రంథంలో ప్రదర్శించారు రచనాప్రణాళిక, రచన రెండూ చక్కగా మెప్పుగా ఉన్న గ్రంథమిది. సహృదయులు, పరిశోధన ప్రియులు అందరూ చదివి ఆనందించదగిన పుస్తకమిది. గ్రంథరచనా వ్యాసంగంలో ఈ మరొక్క గ్రంథాన్ని మనకందించిన డా॥ గంగప్పగారిని మరొక్కమారు అభినందిస్తూ ఆంధ్ర పాఠక లోకం కూడా వారిని మరొకసారి అభినందిస్తుందని ఆశిస్తున్నాను.

తిరుపతి,

17 11-1980

(సం) జి ఎన్. రెడ్డి

# ఉపోద్ఘాతం

ఆచార్య పి. వి అరుణాచలం
కార్వేటి నగరం

## I

కార్వేటి నగరం ప్రాచీనాంధ్ర సంస్థానాలలో ఒకటి. లలిత కళలకు కాణాచిగా విలసిల్లిన రాజాస్థానం. తఱచి చూడగలిగిన వారికి వెయ్యేళ్ళ చరిత్రని అందించే మహామండలేశ్వరుల ముఖ్యపట్టణం కార్వేటి నగరం. సంస్కృతాంధ్ర సాహిత్యాలకు మల్లెపందిళ్ళు కట్టిన మాన్యభూమి.

శ్రీదేవి మంజీర శింజితము రంజిల్ల
రాచనగరున రత్నరాశి గురిసిననాడు
కటారి సాళ్వవిభుల కటారు లెదురులేక
కార్వేటినగర భూఖండ మేలిననాడు
కవితాలతాంగి కాల్ గజ్జలల ఝణఝణలు
రవళింప నగరమ్ము రసరాజ్యమగునాడు (స్వకీయం)

(డా॥ సి. నా. రె. నాగార్జున పర్వతచరిత్రను తలచి హృదయమును పెంచినట్లుగా) మనమూ ఆ రోజుల్లో మని ఉంటే ఎంతబాగుండునో అనిపించే స్మృతి సంపదను ప్రసాదిస్తాయి అక్కడి కొండలు, కోనలు, లొక్కెలు, లోయలు, గుళ్ళు, గోపురాలు, పాడుబడిన భవంతులు, పల్లేరు కాయలు, జిల్లేడు పొదలతో నిండిన బయళ్ళు, కోనేళ్ళు, కోయిలకూతలూ – తోటలూ బాటలూ—

"నాటి మహోజ్జ్వల స్థితివినన్ హృదయమ్ములు పొంగి నీవు ము
మ్మాటికి స్వప్నసీమకు సమానమటంట నిజమ్ము – కాని – ఈ
నేటి దరిద్రదేవియొడి నీ పరితాపముగాంచలేక కా
ర్వేటి పురీ! శిలావళి ద్రవించు వచింపగలేని బాధతో—

ఇనవంశ కలశాబ్ధి జనియించిన దొరలు
పాలించు బంగారు కాలమద్ది,
ధనలక్ష్మి ఘల్లు ఘల్లని ఖజానాలోన
నాట్యమ్ములాడు దినమ్ములవ్వి,
భారతీ కంకణ క్వాణమ్ము కర్ణప
ర్వమ్ముగా వినిపించు వర్షములవి -
జీవకళ లెగజిమ్ము శిల్పమ్ము నల్పమై
విరియబూచిన శుభవేళలవ్వి -

నాడు - కార్వేటి నగరాన వాడవాడ
భాగ్యముల గాదులకు వోసి ప్రతిదినమ్ము
పండువుగ - మహానంద సంపత్సమేతు
లై - ప్రజలు మనిరి సుఖములనుభవించి.

వేణుగోపాల పవిత్ర మందిరమున
వైభవమ్ములు జాలు వారునాడు,
ఈశ్వరాలయము అష్టైశ్వర్యముల తేలి
నిత్యపర్వమ్ములన్ నెరపునాడు,
విశ్వనాథుని గూడి వివిధ పూజావిధుల్
సక్రమముగ కొనసాగునాడు,
రామభజనలతో గ్రామ ప్రజలలోన
భక్తిప్రపత్తులు వరలునాడు,

నెలకు ముమ్మారు వానలు నిండగురియ
సర్వసౌభాగ్యరాశులు సంక్రమింప
ఎంత హర్షించెనో ప్రజ! — ఎన్నడింక
నగరమున కట్టి ఉజ్జ్వల ప్రగతి గల్గు ?

ధాతువత్సరమున దారుణమ్ముగ వచ్చె
కార్వేటి నగరాన కాటకమ్ము-
కూలినాలిగనమి కూటికి కరువుగాన్
ప్రజలెల్ల ఇక్కట్ల పాలబడిరి
పరికించి వేంకట పెరుమాళ్ళ రాజు - ప్ర
జాహిత దృష్టితో జనులకెల్ల
గ్రాసంబు కల్పించి స్కంధపుష్కరిణిని
కట్టించి ఆర్జించె ఘనయశమ్ము

స్వయముగా ధనరాశితో వచ్చి ప్రభువు
క్రొత్తకోనేటి రచ్చపై కూరుచుండి
పట్టి పిడికెళ్ళతో కూలి పంచెనంట ।
ఎంత కరుణార్ద్ర హృదయమ్ము ! ఎంత జాలి!

ఎవ్వాని కోపాగ్ని కింధనమ్మైపోయి
కోపూరి రామయ్య కూలినాడు ?
ఎవ్వాని వాక్కు సాహిత్య నభోవీధి
మేఘగర్జనలను మించి తనరె ?
ఎవ్వాని భుజశక్తి కెదురు నిల్వగలేక
శాత్రవనిచయమ్ము సమసిపోయె?
ఎవ్వాని స్వార్థ విహీన సేవకతన
బొక్కసాన ధనము పొంగుచుండె ?

అట్టి—శ్రీపోలిపెద్ది వంశాబ్ధి సోమ
సుకవి వేంకటరాయు, ఆశుకవిరాజు
శ్రీ జగన్నాథు-ప్రఖ్యాత సిద్ధిరాజ
వంశమాన్య గోపన్నను—వరమనీషి

చంద్రశేఖరుల ఘనుల చరితములను
తనివితీరగ తలపోసి ధన్యుడగుదు—

పదముల సారంగపాణి సంగీతమా
పాత మధురమని ఖ్యాతి కెక్క
వీణచేబూని గోవిందసామి రమణీ
యమ్ముగా పెద్ద వర్ణమ్ము బాడ—" (స్వకీయం)

ఇది ఆనాటి కార్వేటి నగర ప్రజాజీవితానికి దర్పణప్రాయమైన భావ చిత్రము —

ఆ రాజుల వైభవాన్ని వర్ణించే జగన్నాథ కవికృతమైన సీసమాలికలోని కొన్ని పంక్తులివిగో :

"శ్రీరుక్మిణీ వరస్థిర కృపామృత సాంద్ర
వీక్షణాంచిత మహావిభవశాలి—
సకలమహీనాథ సప్తాంగ హరణైక
జయ రమాశ్లేష దోస్తంభపాళి—
భాసురకార్వేటి పట్టణాధిపమౌళి
కాశ్యప గోత్రౌఘ కమలహేళి—
మాకరాద్వంశైక మౌక్తికమణి, బొమ్మ
భూపాల గర్భాబ్ధి పూర్ణ చంద్రు
డురు కటారీ సాళ్వ ధరణీ వరాహాంక
బిరుదావళీ సముద్భాసురుండు,
ఘనతర నవరత్న ఖచిత సింహాసన
మన్నాడుకై వడి నధివసించి,
హితులు మాన్యులు పురోహితులు శశ్వద్దయా
సింధువులగు రాజబంధువులును—

హృద్యంబులగు గద్యపద్యావళిచే మహా
కవులు సామంత భూధవులు పొగడ—
బంధుర ప్రతిభా యుగంధర శ్రీమించు
సరస ప్రధాని శేఖరులు కొలువ—
వెలయు డెబ్బది రెండు వినియోగములవారు
బలసిచుట్టును భయభక్తి కొలువ—

సకల సామ్రాజ్య వైభవ సాంద్రుడనుచు
రాజ్యపరిపాలన కళాభిరతిఁ జెలంగి
విక్రమస్ఫూర్తి రాజన్య చక్రవర్తి
మదనసమమూర్తి త్రిభువన మహితకీర్తి
వెలసెబొమ్మ క్షమాపాలు విబుధమణీ, కు
మార వేంకట పెరుమాళ్ళ మనుజ విభుడు"—

ఈ కుమార వేంకట పెరుమాళ్రాజు కాలంలో వారి ఆస్థానాన్ని అలంకరించిన కళాకారుల్లో సారంగపాణి ఒక్కడు —

పదకవితల ప్రస్తావన వచ్చినపుడు మొట్టమొదట పేర్కొనవలసిన వారు తాళ్ళపాక కవులు—

"చిన్నన్న ద్విపద కెఱుగును
పన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱుగున్
మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిన్"—
"పావనములు హరిభక్తి వి
భావనములు సర్వమంత్ర పరమ రహస్యో
ద్భావనములు గాయక నిక
రావనములు తాళ్ళపాక యన్నయ పదముల్"—

తాళ్ళపాక వారికి పూర్వం తెలుగుభాషలో పదకవిత లుండినవి. పాల్కురికి సోమనాధుడు వీటిని గురించి తన పండితారాధ్య చరిత్రలో వివరంగా చెప్పి యున్నాడు. ఇంకా పూర్వీకుడైన కవిరాజశిఖామణి నన్నెచోడుడు పదములను బోలిన కవితలను గురించి ప్రస్తావించియున్నాడు. జనాదరణలో బహుళ ప్రచారం పొంది పండితులు పామరులు పాడుకొనేందుకు అనువైన పదకవితను ఇంకా ఎందరో ఆదరించి ఉంటారు కానీ మనకు సరియైన దాఖలా దొరకడం లేదు. ఎందుకంటే పదాలను సాహిత్య స్థాయిలో ఉంచడానికి సాహిత్యాచార్యులు అంగీకరించలేదు చాల రోజులవరకు — ఇది తెలుగుభాషకు సంక్రమించిన దురదృష్టం-పదకవితను ఏహ్యాభావంతో చూచేవారు ప్రాచీన లాక్షణికులు, మహాకవులున్నా—

"ముదివిటులు విధవలంజలు
పదకవితలు మారుబాస బాపనవారల్
చదువని పండిత వర్యులు
కదనాస్థిర వీరవరులు కడిదిపురమునన్"-

అనే చాటుపద్యం ఊరకే ఊడిపడలేదు—

ఇట్లా ఆదరహీనమైన పదకవితకు పెడిపందిరి వేసి దండిగుండెతో వేనకు వేలు పదములువ్రాసి ప్రత్యగాత్మను దర్శించడంతోబాటు ప్రత్యర్థుల నోరుమూయిం చిన సాహితీవీరుడు శ్రీ తాళ్ళపాక అన్నమయ్య. తాళ్ళపాక కవుల తరువాత మొవ్వ వేణుగోపాల నామాంకితంగా వందలకొలది పదాలు వ్రాసి తరించిన పరమభక్తుడు, క్షేత్రజ్ఞుడు అయిన మహాకవి క్షేత్రయ్య. వీరిరువురి తరువాత లెక్కించవలసినవాడు సారంగపాణి.

పదకర్తలందరూ సజీవమైనప్రజాభాషను ఉపయోగించినారు. ఆబాలగోపాలం హాయిగా పాడుకొనే జాతిగీతాలు ఈ పదకవితలు నూటికి నూరుపాళ్ళు దేశీయమైన సాహితీభాండాగారము పదకవితల్లో నిక్షిప్తము. పదాలు సంగీతనిధానాలుగా సాహిత్య సాధనాలుగా, ప్రజల ఆరాధనకు పాత్రమయ్యాయి. తాళ్ళపాక కవుల రచనలను చూస్తే మనకు పదాలన్నా, సంకీర్తనలన్నా, కృతులన్నా, పాటలన్నా సమానార్థ కాలుగా వారు వాడుకొన్నారని తెలుస్తుంది. ఏలపాటలు, యక్షగానాలు; దంపుడు

పాటలు, చందమామ పాటలు, గొబ్బిపాటలు, మేలుకొలుపులు, పవ్వళింపులు ఇవన్నీ పదకవితకు రూపాంతరములే.

• "లక్షణభేదాన్నిబట్టి ఈ పదాలు 1. నృత్తపదం 2. నిబంధపదం 3, అనిబంధపదం అని మూడు విధాలుగా విభజింపబడినవి. వృత్త పదాలు షడ్వింశ చ్ఛందో భేదాలకు సంబంధించినవి ఇవి మూడు విధాలు (i) విషమము (ii) సమము (iii) అర్ధసమము. తాళ్ళపాకవారి రచనల్లో నిబంధపదాలే అధికం. వీనిలో యతి, ప్రాసం, మాత్రృగణాలు, మార్గదేశితాళాలు, ముద్ర అనే ఐదు అంగాలున్నాయి. వీనికే మరి అయిదు అవయవాలున్నాయ్.

1. ఉద్గ్రాహము 2. మేళాపము 3. ధ్రువము 4. అంతరి 5 ఆభోగం. నిబంధపదంలో నాలుగు పాదాలచరణం ఒకటిగాని, అంతకుమించిగాని ఉండవచ్చు; ఆ చరణాలకు ఏకవాక్యత కుదర్చడానికి పల్లవి ఉంటుంది. పల్లవి రెండు విధాలు. 1. పల్లవి 2. శిఖాపదం. రెండు పదాలుంటే అది పల్లవి. శిఖాపదంలో ఏకపదమే. నిబంధపదాలలో వీనిలో ఏదోఒకటి ఉంటుంది. ప్రయోగ పద్ధతి ననుసరించి ఈనిబంధపదం నాలుగు విధాలు.

1) చతుర్ధాతుకములు

2) త్రిధాతుకములు

3) ద్విధాతుకములు

4) ఏతధాతుకములు

వీనితర్వాత పేర్కొనతగింది అనిబంధపదం. దీనికి అనిర్యుక్త పదం అనికూడాపేరు" ఇట్లా పదకవితను గురించి ఎంతో విశ్లేషణ చేయవలసిన అవసరం ఉంది. ఈదృక్కోణంలో అన్నమయ్య, క్షేత్రయ్య, సారంగపాణి పదాలను చర్చిస్తూ మరొక సిద్ధాంతగ్రంధం త్వరలో డా॥ గంగప్పగారు వెలువరిస్తారని ఆశిద్దాం.

---

• "తెలుగులో పదకవిత" — వ్యాసము

శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి – తెలుగు అకాడమీ పత్రిక. (3)—1976

# II

కార్వేటినగర వైభవం కాలగర్భంలో కలిసిపోయింది. అక్కడ ప్రవహించిన సంగీత సాహిత్య నదీనదాలు ఎండిపోయాయి. సారంగపాణితో బాటు కార్వేటి నగరంలో పుట్టిన సారంగపాణి పాటలు వందలు మైళ్ళుదాటి బొబ్బిలి వేణుగోపాల స్వామి సన్నిధానానికి వెళ్ళిన వైనంకూడా చాలమందికి తెలియదు. కార్వేటి నగర వేణుగోపాల ముద్రాంకితమై దొరికిన కొన్ని పదాలను ఏరి ప్రాచీన గ్రంథావళి శీర్షికలో పదవపుస్తకంగా రాజమహేంద్రవరం సరస్వతీ పవర్ ప్రెస్ వారు ముద్రించి రన్న సంగతి ప్రచురణ అయిన చాల రోజులవరకు ఈ ప్రాంతీయులకు తెలియ లేదు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి తొలి అధ్యక్షులుగా ఉండి అటు రాజకీయంగానూ, కళాత్మకంగాను అగ్రశేణిలో ఉంటూ సవ్యసాచి అనిపించుకొన్న కీ. శే. రాజాబొప్పరాజు రామకృష్ణరాజుగారుకూడ సారంగపాణిని ఎందుకు విస్మరించి నారో తెలియడంలేదు. వారు సంకల్పించి ఉంటే కార్వేటినగరంలో ఎనాడో సారంగ పాణి కళాపీఠస్థాపన జరిగి ఉండేది. అన్నమయ్య క్షేత్రయ్యలు - ఈ ఉభయుల లోని వైశిష్ట్యాన్ని తన రచనలలో ప్రయోగించి చూపిన సారంగపాణికి రావలసిన యశస్సు, ప్రచారం లభించియుండేది కొంతవరకైనా.

సుమారు ఎనిమిదేళ్ళక్రితం జరిగినసంగతి. సుమనస్వి, సాహితీమూర్తి సంఘసేవాపరాయణులు అయిన శ్రీ. పి. రాజుగోపాల్ నాయుడు (శ్రీరాజన్నగారు) ప్రస్తుతం చిత్తూరు నియోజకవర్గం పార్లమెంటు సభ్యులు — వీరితో మాండలిక సాహిత్యవిషయాలు చర్చిస్తూ ఉండిన సందర్భంలో సారంగపాణిప్రస్తావన వచ్చింది. అజ్ఞాతవాగ్గేయకారుడై పోయిన సారంగపాణి స్మృత్యర్థం ఒక ఉద్యమాన్ని తల పెట్టవలె. కార్వేటినగరంలో ఉండి వందలకొలది పదాలు వ్రాసి పాడి, ఆడి, పాడించి; ఆడించి, అందరినీ ఆనందపారవశ్యంలో భక్తిరసతన్మయతలో ముంచెత్తిన సారంగపాణికి మనం ఈ విధంగా కృతజ్ఞతలు తెలుపుకొన్నట్లవుతుందని ఆదేశ మిచ్చినారు శ్రీరాజన్నగారు.

ఆదేశాన్ని అందుకొని కార్వేటినగరంలో మిత్ర సాహితీసంస్థ ఆధ్వర్యంలో సారంగపాణి సంస్మృతి సభను ఏర్పాటు చేశాము. శ్రీ రాజన్నగారి అధ్యక్షతలో అది విజయవంతంగా జరిగింది. తర్వాత సారంగపాణిని గురించి కొన్ని వ్యాసాలు,

రేడియో ప్రసంగాలు వెలువడినాయి. అక్కడక్కడ ప్రసిద్ధులైన సంగీతవిద్వాంసులను సారంగపాణి పాటలు ప్రచారంచేయండని ప్రార్థించడమైనది. ఒకరోజు యాదృచ్ఛికంగా మిత్రులు డా॥ గంగప్పగారిని కలుసుకోవడం జరిగింది, క్షేత్రయ్య పదసాహిత్యంమీద వారు వ్రాసిన సిద్ధాంతగ్రంథం అప్పుడే వెలువడింది. ఆ గ్రంథానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమానం లభించింది. "క్షేత్రయ్య పదసాహిత్యంలాగా సారంగపాణిని గురించి మీకలంనుంచి ఒకమంచి గ్రంథంరావాల"ని నేను కోరినాను — తక్షణం మాటనిచ్చారు డా॥ గంగప్పగారు. తత్ఫలితమే ఈ గ్రంథము.

ఇటీవల ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు సారంగపాణి దినోత్సవాన్ని కార్వేటి నగరంలో నిర్వహించినారు శ్రీ K. V. గోపాలస్వామిగారు, శ్రీ K. V. సుబ్బారావుగారు, డా॥ P. S. R అప్పారావుగారు, శ్రీ B. కృష్ణంరాజు గారు, శ్రీ S. R. జానకిరామన్ బృందంవారు ఈ ఉత్సవాన్ని ఏర్పాటు చేయడంలో నిర్వహించడంలో ఎంతో సహకరించినారు. శ్రీ రాజన్నగారి అధ్వర్యంలోనే ఈ సభ కూడా జరిగింది

మరపునబడ్డ సారంగపాణి సంగీత సాహిత్యాలను గురించి. "భక్త సంత్రాణ శీలుడు, మునిజన హృదయలోలుడు" అయిన శ్రీ కార్వేటినగర వేణుగోపాలస్వామి మాహాత్మ్యములను గురించి మళ్ళీ మాట్లాడుకొన్నారు తెలుగువారు.

డా॥ గంగప్పగారు రచించిన—"సారంగపాణి పద సాహిత్యం" గ్రంథ ప్రచురణతో సారంగపాణి సంగీత సాహిత్య ప్రచార ఉద్యమంలో రెండవ దశ ప్రారంభమైనదనవచ్చు. అయిదు అధ్యాయాలతో అందంగా వెలువడిన గ్రంథంలో సారంగపాణి జీవిత విశేషాలు (ప్రస్తుతం తెలిసినంతవరకూ), పదకవితా శిల్పం, భాషావైభవం, శృంగారం–భక్తి, సంగీతం–అభినయం అన్న ప్రధాన శీర్షికలున్నాయి. తెలుగు దేశంలోని సంగీత సాహిత్యకారులేకాక వాగ్గేయకారుల చరిత్రలలో ఆసక్తి కలిగిన ఇతర ప్రాంతీయ కళాకారులు,. సంగీత సాహిత్య విమర్శకులు ఈ గ్రంథంలోని విశేషాలను తెలుసుకొని తెలుగు పద సాహిత్య సమగ్రతను సమీక్షించడంలో ఒక మెట్టుపైకి ఎక్కుతారని ఆశిస్తున్నాను.

ఈ రచనలో సారంగపాణి కవితాప్రస్తావన చక్కగా సాగింది. ఇంతకంటే ఉపోద్ఘాతంలో ఉటంకించవలసిన అవసరంలేదు. అయితే ఒక్క విషయం మాత్రం చెప్పడం అవసరం. వ్యావహారిక భాషా ఉద్యమం పుట్టడానికి రెండువందల ఏళ్ళకు ముందే వ్యావహారికం భవిష్యత్తును ఊహించి, తన రచనలో ప్రయోగించి, దాని పదునును చూపించిన భాషాశాస్త్రజ్ఞుడు కూడా సారంగపాణి—

సారంగపాణి సాహిత్య ప్రచారంలో ఒక సంస్కృతిని ప్రసాదించి, నా ఉద్యమానికి శాశ్వతంగా నిలువదగ్గ పెద్ద సాయం చేసిన డా॥ గంగప్పగారికి హార్దిక అభినందనలు.

ఇట్లు,

కార్వేటినగరం

నవంబరు 9, 1980.

(సం) విశ్వనాథ అరుణాచలం.

# ౦.౦ ఆముఖం

0.1 చక్కటి సలహాలతోపాటు అవ్యాజానురాగంతో 'ఆశాసనం' చేసిన పూజ్యులు ఆచార్య తూమాటి దొణప్పగారికీ,

రచనకు ప్రోత్సహించి, అత్యంతాభిమానంతో 'అభినందన'లు తెలిపిన పూజ్యులు ఆచార్య జి. ఎన్. రెడ్డిగారికీ,

గ్రంథ రచనకు ప్రేరేపించి, ఉచితరీతిని 'ఉపోద్ఘాతం' రచించిన మాన్యులు ఆచార్య పి. వి. అరుణాచలంగారికీ,

ముద్రణకు ఆర్థిక సాహాయ్యం గావించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారులు శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, I.A.S., శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి (పౌర సంబంధాల అధికారి), శ్రీ కె. సుబ్బారావు (సంపాదకులు) గార్లకు — నా కృతజ్ఞతలు.

ముద్రణలో అన్నివిధాలా సహకరించిన మిత్రుడు శ్రీ వడ్లాసుబ్రహ్మణ్యం (పరిశోధక విద్యార్థి), ప్రూఫులు దిద్దడంలో నాతోపాటు శ్రమించిన శ్రీ పోసా కృష్ణమూర్తి (పరిశోధక విద్యార్థి), బ్లాకుల తయారీలో తోడ్పడిన శ్రీ అబ్దుల్ రజాహుసేన్ (పరిశోధక విద్యార్థి), శుద్ధప్రతి సిద్ధంచేసిన శ్రీ టి. శంకర నారాయణరావు (పరిశోధక విద్యార్థి), 'కృష్ణాస్రవంతి' నుంచి సారంగపాణిని గూర్చిన విషయం రాసి పంపిన చి. మండలి బుద్ధప్రసాద్ (పూర్వ విద్యార్థి)— వీరందరికీ,

చక్కటి ముఖపత్ర రచన చేసిన శ్రీ నాగుల్ (మంగళగిరి) గారికీ, ముచ్చటగా ముద్రించిన వైష్ణవీ ప్రింటర్స్ (గుంటూరు) అధిపతి శ్రీ భవిరిశెట్టి రాజేంద్రప్రసాద్ గారికీ, కూర్పు నేర్పరి శ్రీ అశ్వదాటి నరసింహమూర్తి, వారి సహచరులకూ — నా అభినందనలు.

0.2 ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి నందిన నా గ్రంథం 'క్షేత్రయ్య పదసాహిత్యం' పఠించి, ఆనందించిన సహృదయులు, మాన్యమిత్రులు

ఆచార్య పి. వి. అరుణాచలంగారు 'సారంగపాణి పద సాహిత్యం' గ్రంథ రచన చేయవలసిందని నన్ను ప్రోత్సహించారు. వారి ప్రోత్సాహం లేకపోతే ఈరచన కొనసాగి ఉండేదికాదు. పైగా సారంగపాణి పదాల గూర్చిన చక్కటి విమర్శక గ్రంథం లేదన్న విషయం నాకు మరింత బలాన్నిచ్చింది. ఆ లోటు తీర్చడానికే ఈ గ్రంథ రచన చేయడం జరిగింది.

0.3 సారంగపాణి పద సాహిత్యం గ్రంథంలో ఐదు ప్రకరణాలున్నాయి. సారంగపాణి జీవిత విశేషాల వివరణ మొదటి ప్రకరణం; పదకవితా శిల్ప విపుల చిత్రణ రెండో ప్రకరణం; భాషావైభవ పరిశీలన మూడో ప్రకరణం; శృంగార, భక్తి, నీతి, వైరాగ్యరీతుల ప్రస్తావన నాల్గో ప్రకరణం; సంగీతాభినయాల సూచన ఐదో ప్రకరణం.

0.4 నా యీ ప్రయత్నం సహృదయ హృదయాల్ని అలరించగలదనీ, పద సాహిత్యంలో పరిశోధన చేయదలచిన భావిపరిశోధకులకు ఉపకరించగలదనీ ఆకాంక్షిస్తున్నాను

గుంటూరు,
30-11 1980.

రచయిత

# సారంగపాణి జీవిత విశేషాలు

ఆంధ్రవాగ్గేయకార త్రయమని ప్రసిద్ధిగాంచిన అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్యలలాగా ప్రఖ్యాతి వహించిన వాడు సారంగపాణి. తెలుగు పదకర్తల్లో క్షేత్రయ్య వెనువెంటనే పేర్కొనదగ్గవాడు సారంగపాణి. తెలుగుపద వాఙ్మయంలో "సారంగపాణి పదముల"కు మిక్కిలి వన్నెవాసి, ఉన్న సంగతి సర్వజన సువిదితమే.

ఈ సారంగపాణి పదాలు ప్రప్రథమంగా కార్వేటి నగరం భారతీ లీలాసదన ముద్రాక్షరశాలలో 19 శ. ఆరంభంలో ముద్రితం; రెండోసారి 1867 లో చెన్నపురి విద్యావిలాస ముద్రాక్షరశాలలోను, మూడోసారి మద్రాసులో 1878 లో భువనగిరి రంగయ్యశెట్టిగారి జ్ఞానసూర్యోదయ ముద్రాక్షరశాలలోను, తదుపరి నాలుగో పర్యాయం 1963 లో రాజమహేంద్రవరం సరస్వతి పవర్ ప్రెస్‌లోను ముద్రితం. ముద్రితమైన పదాలు 201. కానీ "Though Sarangapani wrote nearly 400 Padams, only 200 are available in print"[1] "కార్వేటినగర వేణు గోపాల విభునిపేర అంకితమైన మధురాతి మధురములైన 200 పదాలు ఈనాడు మనకు గ్రంథరూపంగా లభించినాయి. లోకుల రసనలె ఆకులుగా విరచితములైన మరి రెండు వందల పదాలను పరిశోధకులు సేకరించవలె."[2] అన్నది ఆచార్య పి. వి. అరుణాచలంగారి ఆకాంక్ష. ముద్రితమైన 201 పదాల్లోను ఆరు క్షేత్రయ్య పదాల్ని సారంగపాణి పదాలుగా ఇవ్వడం జరిగింది. అవి పోగా మిగిలినవి 195 సారంగ పాణి పదాలు.

---

1. Prof. P. V. Arunachalam ; A Composer of Karvetnagar- May 22, 1977.

2. ఆచార్య పి. వి. అరుణాచలం : అజ్ఞాత వాగ్గేయకారుడు-సారంగపాణి ఆంధ్రపత్రిక - డిశం. 5, 1976.

**1. 1 ఆశ్రయించిన రాజులు :**

సారంగపాణి పదాలు నాలుగు విధాలు : శృంగార పదాలు, దేశీయ పదాలు, జాతీయ పదాలు, కీర్తనలు. సారంగపాణి కార్వేటినగర రాజుల ఆస్థానం అలంకరించి నట్లు ప్రసిద్ధమే. కార్వేటి నగరం చిత్తూరుజిల్లా పుత్తూరు తాలూకా కేంద్రానికి ఎనిమిదిమైళ్ళ దూరంలో చిత్తూరు – పుత్తూరు రహదారిపై ఉంది. ఇది అతి ప్రాచీన నగరం. "దీనికి (కార్వేటి నగరానికి) పశ్చిమమున నున్న ప్రాంతశివాలయము నొద్ద 'నగరము' అను పేరుగల ఒక యూరుండెనంట ! ఇప్పుడూరున్నచోట 'కార్వేడు' అనుపల్లె యుండెనంట ! ఇది కార్వీడు కాంబోలు ! అడవిపల్లె అని దీని యర్థము. పల్లెగానున్న కార్వేడు ప్రభువుల ప్రసాదమువలన పట్టణమయినది. ఆ పిమ్మట శివాలయమునొద్ద కాంపురమున్నవారు సయిత మీ పట్టణమునకే వచ్చి చేరినందున జనులీ రెండుపేర్లను గలిపి 'కార్వేడునగర' మని పిలువనారంభించిరంట! అదియే కాలక్రమమున "కార్వేటి నగరము"గా మాఱినదని కొందఱ యభి ప్రాయము. ఇది పుత్తూరునకు పడమరగా మూడుకోసుల దూరమున నున్నది. ఈ సంస్థానములోని నగరి, నారాయణవనము మున్నగు నదులు చాల చిన్నవి. వానల తఱిలో పొంగిపొరలి తతిమ్మా కాలములో ఎండిపోవు చుండును. కొంత ఉత్తరార్కాడు మండలములోను, కొంత చిత్తూరు మండలములోను నీ సంస్థానము వ్యాపించియుండినది. పుత్తూరు తాలూకాలో 542 చ. మై. ను, తిరుత్తణి తాలూకాలో 401 చ. మై. ను, మొత్తము 943 చ. మై. వైశాల్యము కలది యీ సంస్థానము. ఋణబాధల పాలయిన ఈ సంస్థానము నందలి 120 గ్రామములు విడదీసి 'చెట్టినాడు' అను జమీందారీ నొకదాని నేర్పఱచిరి. కార్వేటినగర సంస్థానములోని కొంత భాగము తిరుమల తిరుపతివారు విక్రయము నందుకొనిరి దీనియందలి మొత్తము గ్రామములు 792. తిరుత్తణి, పల్లిపట్టు, నారాయణవనము అని మూడు రెవిన్యూ విభాగములు, 1882 లో పేష్కషు 187 వేలు. సాలీనా ఆదాయము 1885 లో నించుమించుగా ఏడెనిమిది లక్షలు"[3] ఈ కార్వేటి సంస్థాన సంబంధి రాజులు అనేకులున్నారు. "కార్వేటినగరము సంస్థానాధిపతులలో క్రీ. శ. 1700 ప్రాంతముల పరిపాలించిన వెల్లంటి కసవరాజు సంగీత సాహిత్య విద్యాపోషకుడు. ఋగ్వేది

3. ఆచార్య తూమాటి దొణప్ప : ఆంధ్ర సంస్థానములు – సాహిత్య పోషణము—పు. 83, 84

వెంకటాచలకవి చంపూరామాయణము నాంధ్రీకరించి కసవరాజునకు కృతి యొసగెను. ఋగ్వేది వెంకట నారాయణకవి సంగీత సాహితీవేత్త. జయదేవకవి కృతమగు గీత గోవింద కావ్యము నాంధ్రీకరించిన మహాకవి, ప్రసిద్ధ పదరచయిత సారంగపాణి యీ కాలముననే విలసిల్లెను"[4] "సారంగపాణి (క్రీ. శ. 1800 ప్రాంతము): కార్వేటినగర పాలకుఁడగు వెంకట పెరుమాళ్లురాజు ఆస్థానములో నుండిన కవీశ్వరు లలో నితఁడుకూడ నొకఁడని ప్రసిద్ధి."[5] కానీ సారంగపాణి తన పదాల్లో పేర్కొన్న రాజు మాకరాజు కార్వేటిరాజు. సారంగపాణి పదాలు చాలావరకు కార్వేటి నగరంలో వెలసిన వేణుగోపాలస్వామి ముద్రతో రచించాడు. అయినా రాజముద్రతో మూడు పదాలు కనిపిస్తున్నాయి.

"ప : తేనెలూర మాటలాడకు తెలిసె నీ నెనరు

అ. ప : మానినీ మనోహర శ్రీసాళువ
మాకరాజ కార్వేటి రాజేంద్రా ! ॥తేనె॥" [పదం. 60]

"ప : దానికెవ్వరుసాటి ఆ వెలది నీకే
తగురా రాజ కిరీటీ

అ. ప : మానిత వరగుణపేటి నీపై
మరలుకొన్నదిరా మాబోటీ యిక నిను
మానదురా భానుసమతేజా
మాకరాట్కార్వేటి రాజా ! ॥దాని॥" [ప-61]

"ప : వలదు ఈ మాట లేలరా మదిహితవైన
వనిత యిల్లిది గాదురా

అ. ప : వెలయ శ్రీమాకరాజ వీర కార్వేట్రాజేంద్ర
చెలులు దెలుపగ దెలిసె నీ వగలు చాలు పదివేలు ॥వలదు॥"
[ప-62]

---

4. విజ్ఞాన సర్వస్వము — సంపుటం 3, పు. 1173.

5. డా. తిమ్మావఝ్ఝల కోదండరామయ్య : చిత్తూరు మండల ప్రాచీన చరిత్ర : చిత్తూరు జిల్లా రచయితల మహాసభల ప్రత్యేక సంచిక : అక్టోబరు 1968.

—అని మాకరాజు కార్వేటిరాజు ముద్రతో రచించాడు. కాబట్టి ఈ మాకరాజు కార్వేటిరాజు సారంగపాణి పోషకుడు అవడం సముచితం. కానీ మాకరాజు పెరుమాళ్రాజు ఆస్థానంలో సారంగపాణి ఉండేవాడని "తంజావూరును పాలించిన శాహభూపాలునికి సమకాలికుడై కార్వేటి నగరాన్ని మాకరాజు వేంకట పెరుమాళ్రాజు అనే సాళ్వవంశీయుడు ఏలుతూండినట్లు, సాహిత్యకళాభిమాని అయిన ఆతడు గోవిందసామిని గౌరవించినట్లు పైని చెప్పిఉన్నాము. సారంగపాణికూడ మొదట చాలకాలము ఈ ప్రభువు ఆస్థానంలో విద్యాధికారిగా ఉండినవాడు."[6] – అని రజనీ కాంతారావుగారు పేర్కొన్నారు. "వీరు (సారంగపాణిగారు) కార్వేటినగర ప్రభువులైన శ్రీమన్మహామండలేశ్వర కఠారి సాళ్వరాజ వెంకటపెరుమాళ్ల రాజావారి యాస్థానమున వైణిక పండితులుగా నుండిరి."[7] – అని దీవి నరసింహాచార్యులు తెలిపారు. కానీ కార్వేటినగర పాలకుల్లో ముగ్గురు మాకరాజులున్నట్లు స్పష్టమవుతుంది నిశ్శంక దుర్గశిలాశాసనంవల్ల.[8] ఒకడు మాకమహారాజు. ఇతడే నిశ్శంకపురి నిర్మాత. ఈతని అల్లుడు మాకరాజు నిశ్శంకదుర్గ శిలాశాసనం వేయించాడు. ఈ మాకరాజుల్లో సారంగపాణి పోషకుడెవరో తెలియరాదు. కార్వేటినగర రాజులలో ఒకడైన వెంకట పెరుమాళ్రాజు క్రీ. శ. 1717–1732 ప్రాంతంలో కార్వేటినగర నిర్మాతగా విశ్వసించబడ్డాడు. కానీ అంతకుముందే క్రీ. శ. 1000 ప్రాంతంలోనే కార్వేటినగర నిర్మాణం జరిగినట్లు అరికట్ల సుబ్రహ్మణ్యంగారు ఊహిస్తున్నారు.[9] ఏది ఏమైనప్పటికి వెంకట పెరుమాళ్రాజు క్రీ. శ. 18 శ. పూర్వార్ధంలోని వాడని తేలింది. బహుశా మాకరాజు వేంకట పెరుమాళ్రాజే సారంగపాణి పోషకు డనడానికి అవకాశ మెక్కువ. ఈ విషయాన్ని ఆచార్య తూమాటి దొణప్పగారి మాటలు స్థాపిస్తున్నాయి. "సంస్థానపాలకుఁడగు మాకరాజు వెంకటపెరుమాళ్ల రాజుకాలమున అష్టదిగ్గజ కవులు వెలసియుండిరఁట ! ఋగ్వేది వేంకటనారాయణకవి, పోలిపెద్ది వెంకట రాయఁడు,

---

6. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర : పు. 317
7. కృష్ణాస్రవంతి : పు. 119.
8. అరికట్ల సుబ్రహ్మణ్యం : నిశ్శంకదుర్గ శిలాశాసనం – భారతి – మార్చి, 1971 : పు. 31
9. అరికట్ల సుబ్రహ్మణ్యం : కార్వేటినగర రాజవంశ చరిత్ర – భారతి, జనవరి 1972 – పు. 68

పాలమంగలము అప్పయకవి, సారంగపాణి, శ్రీశైలకవి, ముసుంబ అప్పయాచార్యులు, రాయభట్టు వీరరాఘవకవి, అనంతరాజు సుబ్బరాయకవి — అను ఎనమండుగురును అనాటి అష్టదిగ్గజకవులట."[10] వీరే మరోచోట "ప్రసిద్ధ పదరచయితయగు సారంగపాణికిని కార్వేటినగర సంస్థానమే పట్టుగొమ్మయని ప్రతీతి. నాయికా నాయకుల సంభృత ప్రేమమున కాలవాలము సారంగపాణి పదములు. వేణుగోపాలశతకకర్త ఈ సారంగపాణియే యని కొందఱి విశ్వాసము. ఇతఁడు మాకరాజు కార్వేటిరాజు ఆస్థానకవి యఁట."[11] అని తెలిపారు. అంటే ఆరంభంలో మాకరాజు వెంకట పెరుమాళ్ళరాజు ఆస్థాని అయి ఉండి, ఆ వెనుక రాజ్యానికి వచ్చిన మాకరాజు కార్వేటిరాజు ఆస్థానంలోనూ సారంగపాణి ఉండేవాడని స్పష్టమవుతుంది. దీనికి వివరణ ఆచార్య దొణప్పగారి గ్రంథంలోనే ఉంది. "పిమ్మట కార్వేటినగర సంస్థాన పాలకుఁడగు మొదటి వెంకటపెరుమాళ్ల రాజు పాలనకాలము (క్రీ. శ. 1719-1732) లో కార్వేటినగర నిర్మాణము మొదలయి యతని సోదరపుత్రుడైన కావేటిరాజు కాలమున ముగిసినది. నాటినుండి కార్వేటినగరము రాజధాని అయినది."[12] కాబట్టి మాకరాజు వెంకటపెరుమాళ్ళరాజు, ఆ వెనుక మాకరాజు కార్వేటిరాజు సారంగపాణి పోషకరాజులన్న విషయం స్పష్టం. అయితే "సాళ్వ" మాకరాజు అన్నది బిరుదమై ఉంటుందా ? అన్నది ప్రశ్న. దీనికి "సాళ్వ వంశీయులను మాకరాజు వారి సంస్థాన పాలకులు".[13] అన్నది సమాధానంగా తోస్తుంది. వీటి వివరణ ఇలాఉంది. "సాళ్వ అనేది ఈ రాజన్యుల బిరుదనామం. 'మాకరాజు' అనేది వీరి వంశకర్త పేరు. తరువాతి కాలంలో అది వీరి ఇంటిపేరయింది."[14] పోతే కె. జి. కృష్ణమూర్తిగారిలా పేర్కొన్నారు. "ఈ వాగ్గేయకారుడు (సారంగపాణి) 18వ శతాబ్ది ఉత్తరార్థం (1752-1807) లో నగరాన్ని పాలించిన మాకరాజు బొమ్మరాజు - III కు లేబ్రాయపు సమకాలికుడై (Younger Contemporary)

10. ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణము - పు. 86.
11. పైదే — పు. 89.
12. ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణము - పు. 83.
13. తెలుగు విజ్ఞాన సర్వస్వము - సంపుటం - 3, పు. 1173.
14. కె. జి. కృష్ణమూర్తి : సారంగపాణి పదాలు — ప్రవంతి - డిశం. 1975 అధసూచిక - పు. 10.

యుండినట్లు కొన్ని యాధారములను బట్టి నిశ్చయింప వీలవుతూ వున్నది. ఈతడు రచించిన శృంగార పదాల్లో ఒక మూడుపదాలు ఈ బొమ్మరాజు కుమారుడైన కావేటి (కార్వేటి) రాజును ఉద్దేశించినవిగా తెలుస్తున్నవి. సారంగపాణిని ఆదరించిన ఈ కావేటి రాజు చాలాకాలం యువరాజుగానే వుండి మరణించాడు. కనుక బొమ్మరాజు అనంతరం ఆతని రెండవ కుమారుడు వెంకట పెరుమాళ్ళరాజు కొలువులోనూ కొంతకాలం ఉన్నాడు."[15] పై మాటల్లోని రాజులపేర్లు సంవదిస్తూన్నా కాలంలోను విషయంలోను తేడా కనిపిస్తూంది.

## 1.2 కాలం :

సరస్వతీ పవర్ ప్రెస్‌వారు 1963 లో ప్రకటించిన సారంగపాణి పదాలకు భూమికగా స్వీకరించి ప్రకటించిన మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారి సమీక్షలో సారంగపాణి కాలాన్నిగూర్చి ఇలారాశారు. "చెన్నపురిలో 1867 వ క్రీస్తుశక సం. లో (సారంగపాణి పదములు గ్రంథం) అచ్చుపడ్డది. కార్వేటినగరాధీశ్వరుల ఆజ్ఞచే గ్రంథకర్తయగు సారంగపాణిగారి దౌహిత్రుడు గరిమెళ్ల వెంకటసుబ్బయ్యగారిచే నేలటూరి సుబ్రహ్మణ్యముగారి విద్యావిలాస ముద్రాక్షరశాల యందు ముద్రింపబడినది. కార్వేటినగరాధిష్ఠిత శ్రీమద్వేణుగోపాల నామాంకితమైనది. కాబట్టి గ్రంథకర్త 1830 సం. పు ప్రాంతములలోని వాడై చిన్నయసూరిగారికి సమకాలికుడై యున్నాడు."[16] ఇది సముచితంకాదు. సారంగపాణి అంతకంటే పూర్వుడనడమే చారిత్రక సత్యం. తెలుగు విజ్ఞాన సర్వస్వంలో సారంగపాణి క్రీ. శ. 1700 ప్రాంతంవాడనీ, ఆనాటి రాజు వెల్లంకి కసవరాజనీ పేర్కొనబడింది.[17] సారంగపాణి పోషకుడీరాజు కాకపోయినా కాలం మాత్రం సరిపోతూంది. బాలాంత్రపు రజనీకాంతరావుగారు సారంగపాణి కాలం 1680—1710 అని పేర్కొన్నారన్న విషయం పూర్వోక్తం.[18] సారంగపాణి పోషకుడైన కార్వేటినగర రాజు శాహజీ సమకాలికుడు. శాహజీ రాజ్యకాలం 1684—1712 కావడంవల్ల

---

15. పైదే - పు - 10, 11.

16. సారంగపాణి పదములు - సమీక్ష - పు. 10.

17. తెలుగు విజ్ఞాన సర్వస్వం - సంపుటం - 3, పు. 1173.

18. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర - పు 317.

రజనిగారు సారంగపాణి కాలాన్ని పై విధంగా పేర్కొన్నారు. 1680 ప్రాంతం సారంగపాణి జననకాలం అనడం సబబుగా ఉంది. కానీ 1710 తరువాత సైతం ఉంటాడనడానికి అవకాశాలున్నాయి. ఇందుకు నిదర్శనం శ్రీ దీవి నరసింహాచార్యులుగారి మాటలు. "వీరు (సారంగపాణిగారు) క్రీ. శ. 1695 సంవత్సరమున జన్మించిరి. శ్రీ వేణుగోపాలస్వామి భక్తులు. వీరు కార్వేటినగర ప్రభువులైన శ్రీ మన్మహామండలేశ్వరకతారి సాళ్వరాజ వెంకటపెరుమాళ్ళు రాజావారి యాస్థానమున వైణికపండితులుగా నుండిరి.... శకవత్సరములు 1731 వ సం.కు సరియైన శుక్ల సంవత్సరమున సంస్థానములో 'దుర్గరాజపుర' మను శ్రోత్రియ గ్రామమును వీరికి దానమిచ్చిరి."[19] అంటే 1731 లో శ్రోత్రియగ్రామ బహూకృతి నందిన సారంగపాణి మరింత కాలం జీవించి ఉంటాడనడానికి వీలుంది. మొట్టమొదటి వాగ్గేయకార చరిత్రకర్త అయిన సుబ్బరామదీక్షితులు సారంగపాణిని గూర్చి "ఇప్పుడు 200 సంవత్సరములకు లోబడు ఉత్తరదేశీయుడైన తెలుగు బ్రాహ్మణుడు."[20] — అని పేర్కొన్నారు. దీనివల్ల సారంగపాణి కాలం తెలుసుకోడానికి ప్రయత్నిద్దాం. సుబ్బరామదీక్షితుల పోషకుడైన ఎట్టప్ప మహారాజు ఆజ్ఞానుసారం సుబ్బరామదీక్షితులు 'సంగీత సాంప్రదాయ ప్రదర్శిని' రచన 1901 డిశంబర్ 21న ఆరంభించి, పూర్వవాగ్గేయకారుల చరిత్ర 1903 డిశంబరు 17 లోపల పూర్తిచేసి, అప్పటినుంచి సంగీతలక్షణ సంగ్రహం రచించ నారంభించినట్లు వివరించారు. [21] అంటే వాగ్గేయకార చరిత్ర 1903 డిశంబరు నాటికి పూర్తి అయినట్లు స్పష్టం. ఆ వాగ్గేయకార చరిత్రలోనే సారంగపాణిని గూర్చి "ఇతడు 200 సం. లోబడు" వాడని తెలిపినట్లు పూర్వోక్తం. దీన్నిబట్టి 1903—200 = 1703 ప్రాంతం సారంగపాణి కాలమని తెలుస్తుంది. అంటే 1703 ప్రాంతంలోనే కార్వేటినగర సంస్థానంలో వాగ్గేయకారుడై ప్రసిద్ధుడై ఉంటాడనడానికి ఏవిధమైన విప్రతిపత్తి లేదు. దీనికితోడు మనమింతకుముందే – అంటే సారంగపాణి పోషకరాజుల గురించి-తెలుసుకొన్నట్లు మాకరాజు వెంకట పెరుమాళ్లరాజు కాలం 1719 – 1732 అనీ, అతని వెనుక అతని సోదర పుత్రుడు మాకరాజు కార్వేటిరాజు పాలన 1733

19. కృష్ణాస్రవంతి – పు. 119.

20. సంగీత సంప్రదాయ ప్రదర్శిని – పు. 34

21. పై దే – పు. 43

నుంచి ఆరంభమైందనీ మనకు స్పష్టం. కాబట్టి ఈ ఇద్దరి రాజ్యకాలంలోనే సారంగపాణి కార్వేటినగరం ఆస్థానం అలంకరించిన విషయం పూర్వోక్తం. అందు చేతనే వెంకట పెరుమాళ్లరాజు చేత 1731 సత్కృతుడై ఆ వెనుక మాకరాజు కార్వేటిరాజు ఆస్థానంలోను సారంగపాణి ఉంటాడని మనకు విశదమవుతుంది. పై పరిశీలనవల్ల సారంగపాణి కాలం 1680 — 1750 అని నిర్ణయించడం నిర్బాధకం. ఇప్పటికి నాకు లభించిన ఆధారాల ప్రకారం ఇది సముచితమని భావిస్తున్నాను. ఇతర సాక్ష్యాధారాలు లభించేంతవరకు దీన్ని గ్రహించవచ్చు. దీవి నరసింహాచార్యులుగారు "ఒకప్పుడు వాలాజపేటలోనున్న వెంకటరమణ భాగవతుల వారను త్యాగరాజస్వామి ముఖ్యశిష్యులు, వీరిని దర్శించుటకు రప్పించి, వీణకచ్చేరీని చేయించి సభలో, ఇదివరకు క్షేత్రయ్య పదములలోను, త్యాగరాజస్వామి కృతులలో గొప్పవారని తలచియుంటిమి. కాని యిపుడు సారంగపాణిగారు ప దములలోను, కృతులలోను కూడ నద్వితీయులని మెచ్చుకొనిరట. ఈ విషయమానాటి సభలో నున్న వెంకట రమణ భాగవతులవారి శిష్యుడు 'కంజర అరుణాచలం నాయుడు' గారు ప్రకటించిరి."[22] — అనిపేర్కొవడంలో చారిత్రక సత్యం కనిపించదు. త్యాగరాజ స్వామి శిష్యుల్లో ముఖ్యుడైన వాలాజపేట వేంకటరమణ భాగవతుల్ని సారంగపాణి సమకాలికుడనడం కుదరదు. త్యాగరాజు కాలం 1767 — 1847. కాగా వెంకట రమణ భాగవతులు 1874లో దివంగతుడైనట్లు బాలాంత్రపు రజనీ కాంతరావుగారు పేర్కొన్నారు.[23] త్యాగయ్య 1847 లో సిద్ధినొందాక మాత్రమే అతని ముఖ్య శిష్యుడైన వాలాజపేట వేంకట రమణ భాగవతులు ప్రసిద్ధికెక్కి ఉంటారు. ఆ వెనుక 1874లో దివంగతుడయ్యాడు. కాబట్టి అతడు సుమారు వంద సంవత్సరాలు జీవించి ఉంటాడని తలంచినా, అతని జననం 1774 ప్రాంతం కావచ్చు. కానీ పై నిర్ణయం ప్రకారం సారంగపాణి కాలం 1680 — 1750 కావడంవల్ల వెంకటరమణ భాగవతులు జన్మించక ముందే సారంగపాణి దివంగతుడైనట్లు స్పష్టం. కాబట్టి పై దీవి నరసింహాచార్యులు గారి కథనం విశ్వసనీయంగా లేదు.

## 1.3 నివాసం :

ప్రప్రథమంగా వాగ్గేయకార చరిత్ర రచించిన సుబ్బరామ దీక్షితులు

---

22. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర – పు. 415.

23. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర – పు, 415.

సారంగపాణిని గురించి "ఉత్తరదేశీయుడైన తెనుగు బ్రాహ్మణుడు" — అని మాత్రం పేర్కొన్నారన్నది పూర్వోక్తం. కానీ గోవిందసామయ్య, కూవన సామయ్య అనే పదకర్తలు సోదరులనీ, వారు కార్వేటి నగర వాస్తవ్యులనీ తెలిపారు.[24] "గోవింద సామయ్య, కూవన సామయ్యలకు సమకాలికుడూ, సహచరుడూ అయిన సారంగపాణి పేరు ప్రసిద్ధ పదకర్తగా క్షేత్రయ్య పేరుతో పాటు వినిపిస్తూ ఉంటుంది" – అని చెప్పి వీళ్లందరి కాలాన్ని 1680 — 1710 అని పేర్కొన్నారు రజనీకాంతరావుగారు.[25] "సారంగపాణి కార్వేటినగర సంస్థానంలో వరలిన పదకవుల్లో ప్రసిద్ధిగన్నవాడు. చెన్నపురికి దరిదాపుల్లోని పొన్నేరి ప్రాంతానికి చెందిన ఈతడు పిన్నప్రాయంలోనే కార్వేటి నగరం చేరుకొని, భక్తసంత్రాణశీలుడగు అచటి వేణుగోపాలునిపై పదాలల్లుతూ జీవయాత్ర సాగించాడు."[26] "మదరాసుకు సమీపంలోని పొన్నేరిగ్రామమునుండి, కార్వేటినగర సంస్థానానికి వచ్చినట్టు పెద్దలు చెప్పగా విన్నమాట."[27] ఇలాగా పొన్నేరిలో జన్మించిన సారంగపాణి కార్వేటినగర వాస్తవ్యుడయ్యాడు. కానీ దీవి నరసింహాచార్యులుగారు మాత్రం "అలూరు సారంగపాణి : ఈ కవిది దీవి తాలూకా ఘంటసాల కాపురము. వీరు కాణ్వశాఖ వైదిక బ్రాహ్మణులు. ఋగ్వేదులు."[28] అని వివరించారు. కళలకు కాణాచి అయిన కృష్ణా మండలంలో పుట్టిపెరిగి కార్వేటి నగరానికి వలసపోయి కార్వేటినగర రాజుల పోషణలో స్థిరపడి ఉండవచ్చు. అందుకు క్షేత్రయ్యనే నిదర్శనంగా తీసుకోవచ్చు. అయినా దీవి నరసింహాచార్యులు గారు ఏ ఆధారాన్నిబట్టి సారంగపాణి దీవి తాలూకా ఘంటసాల వాస్తవ్యుడని చెప్పారో తెలియదు.

సారంగపాణి పదాల్లో ఒకటి రెండుచోట్ల మాత్రమే బందరు ప్రస్తావనఉంది. రవల బందరు కమ్మలు, బందరు పావడ – అని పేర్కొనడంవల్ల ఇతడు కృష్ణా

---

24. సంగీత సంప్రదాయ ప్రదర్శిని – ప్రథమ సంపుటం – పు. 25, 34.
25. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర – పు. 316.
26. కె. జె. కృష్ణమూర్తి : సారంగపాణి పదాలు : స్రవంతి – డిశం. 1975 పు. 10.
27. ఆచార్య పి. వి. అరుణాచలం : అజ్ఞాత వాగ్గేయకారుడు – సారంగపాణి ఆంధ్ర పత్రిక – డిశం. 5, 1976.
28. కృష్ణాస్రవంతి – పు. 119.

మండలం వాడనడానికి కుదరదు. కారణం ఇలాగే గుజరాతి ముత్యపుసరులు, నారాయణ వనముచీర, మునిమడుగు రవికెలు - అన్నట్లే బందురులో ప్రసిద్ధమైన పావడా, కమ్మలు పేర్కొని ఉంటాడని తలంచవచ్చు. ఇక ఊళ్ల పేళ్లు పేర్కొన్న పదం ఉంది :

"ప : కడపదాటి రానీయకే

.... .... .... ....

పేరు జెప్పిన ముందర ఆ - పెనుకొండను భూషించెను" [పదం - 6] ఇందులో సైతం కృష్ణా మండలంలోని ఊళ్ల పేళ్లు కనిపించడం లేదు. కాబట్టి సారంగపాణి కృష్ణా మండలం వాడనడానికి హేతువులు చాలడం లేదు.

## 1.4 వైదుష్యం :

సారంగపాణి విద్యాభ్యాసం, గురు పరంపర, వైదుష్యాదుల గూర్చి మనకేమీ తెలియదు. కానీ సంస్కృతాంధ్ర భాషా సాహిత్య నిపుణుడనీ, సంగీతాభినయాల్లో దిట్ట అనీ స్పష్టమవుతుంది అతని పదాల్ని పరిశీలిస్తే. ముద్రితమైన 201 పదాల్లోను 195 మాత్రమే సారంగపాణి పదాలన్న విషయం పూర్వోక్తం. సారంగపాణి గీతగోవింద కావ్యానువాదకుడని గూడా తెలుస్తుంది. "జయదేవకవి కృతమగు గీతగోవింద కావ్యము నాంధ్రీకరించిన మహాకవి, ప్రసిద్ధ పదరచయిత సారంగపాణి యీ కాలము (క్రీ. శ. 1700 ప్రాంతము) ననే విలసిల్లెను."[29] "గీత గోవింద కావ్యము నాంధ్రీకరించిన సారంగపాణి ఈ రాజుల (కార్వేటినగర రాజుల) చేతనే పోషింపబడెను."[30] ఇవి తప్ప మరెక్కడా సారంగపాణి గీత గోవింద కావ్యాంధ్రీకర్తగా చెప్పబడలేదు. ఈ మాటలు ప్రామాదికం. గీత గోవింద గేయకావ్యాన్ని అనువదించినకవి ఋగ్వేది వేంకట నారాయణకవి. ఇంక "వేణుగోపాల శతకకర్త యీ సారంగపాణియే యని కొందఱ విశ్వాసము."[31] - అని ఆచార్య తూమాటి దొణప్ప గారు రావికంటి కళావతి [కల్పలత పత్రిక - విశాఖ

---

29. నిడదవోలు వేంకటరావు గారు : తెలుగు విజ్ఞాన సర్వస్వం - సం. 3; పు 1173
30. కేశవపంతుల నరసింహశాస్త్రి గారు : సంస్థానముల సాహిత్య సేవ, పు. 50.
31. ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణము; పు. 89.

పట్టణము, 1921, ఏప్రిల్; పు. 11] గారు పేర్కొన్న విషయాన్ని తెలిపారు. కాని వేణుగోపాల శతకకర్త పోలిపెద్ది వెంకటరాయకవి. "పోలిపెద్ది వెంకటరాయకవి (క్రీ. శ. 1850) : ఇతడు కార్వేటి నగర సంస్థానమునకు జెందిన కవీశ్వరుడు. ఇతడు వేణుగోపాల శతకము, లావణ్య సీమశతకము, తిట్టుదండకము అను గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది."[32] సారంగపాణి వైదుష్యాన్ని గూర్చి దీవి నరసింహాచార్యులు ఇలా పేర్కొన్నారు. "వీరు (సారంగపాణి గారు) కాణ్వశాఖ వైదిక బ్రాహ్మణులు. ఋగ్వేదులు .... శ్రీ వేణుగోపాలస్వామి భక్తులు. వీరు కార్వేటి నగర ప్రభువులైన శ్రీ మన్మహమండలేశ్వర కఠారి సాళ్వరాజ పెరుమాళ్లు రాజా వారి యాస్థానమున వైణిక పండితులుగా నుండిరి. వీరు సంగీత విద్యా ధురంధరులు. వీరొనర్చిన కృతులు, పదములు నీతి ప్రాధాన్యముగలవై శృంగార, హాస్యరసముల తొణకించుచు లలితశబ్ద ప్రయోగంబులు కలిగి యలరారుచున్నవి. క్షేత్రయ్య తరువాత పదకవులలో వీరే ప్రసిద్ధులు. శైలిసులభము; భావము గంభీరము."[33] సంస్కృతాంధ్ర భాషాపాండిత్యప్రకర్షా, కవిత్వపటుత్వమూ, ప్రతిభా ప్రాభవమూ, వివిధ శాస్త్రవైశారద్యమూ, సంగీతాభినయాది కళానైపుణ్యమూ కలిగి ఉత్తమ వాగ్గేయకారుడై, అసమాననాట్యాచార్యుడై విలసిల్లినవాడు సారంగపాణి.

## 1 5 విశేషాలు :

సారంగపాణి పదాలు నాలుగు విధాలుగా ఉన్నాయి. ప్రథమ భాగం – శృంగార పదాలు; ద్వితీయ భాగం – దేశీయ పదాలు. వీటిలో వేశ్యావిలాస, దూషణలు వివరించబడ్డాయి; తృతీయ భాగం – జాతీయ పదాలు; వీటిలో జానపద భాషారీతి స్పష్టం; చతుర్థ భాగం–కీర్తనలు–ఇవి వైరాగ్య నీతిప్రబోధాలై ఉన్నాయి. ఇవి చాలా వరకు కార్వేటి నగరంలో వెలసిన వేణుగోపాల ముద్రతో రచించ బడ్డాయి. కొన్ని ఇతర ముద్రలు గలవి సైతం ఉన్నాయి. మూడు పదాలు మాకరాజు కార్వేటిరాజు నామాంకితా లన్నవిషయం పూర్వోక్తం. మూడు పదాలు చొప్పున పళ్లిపట్టు వరదనారాయణస్వామి మీదా, అన్నృణ సరోవరతీరంలోని

---

32. డా. తిమ్మావజ్ఝల కోదండరామయ్య : చిత్తూరు మండల ప్రాచీన సాహిత్య చరిత్ర; చిత్తూరు జిల్లా రచయితల మహాసభల ప్రత్యేక సంచిక, అక్టోబరు 1968.

33. కృష్ణా స్రవంతి – పు. 119.

ప్రసన్న వేంకట శౌరిమీదనూ; ఒక్కొక్కటి వంతున చెంగల్వ రాయడు (తిరుత్తణి సుబ్రహ్మణ్యస్వామి), నాగలాపురం కల్యాణ వేంకటేశ్వరుడు-అనే దైవనామాంకితాలు గాను రచించబడ్డాయి. ఈ పదకొండు పదాలు గాక తక్కిన 184 పదాలు వేణు గోపాలాంకితం.

కార్వేటి నగరసంస్థానంలో పండితుడై, పదరచనచేసి వాగ్గేయ కారుడయ్యాడు సారంగపాణి. వైణిక విద్వాంసుడై సన్మానాలకు పాత్రుడయ్యాడు. అభినయాచార్యుడై ప్రఖ్యాతి గడించాడు. ఆరంభదశలో తన పోషకుడైన రాజాజ్ఞతో శృంగార పదరచన చేశాడు. మొదటి భాగంలోని శృంగార పదాల్లో స్వీయా, పరకీయా, సామాన్యాదినాయికా పరమైన శృంగారాన్ని వర్ణించాడు సారంగపాణి. ద్వితీయ భాగంలో కేవలం సామాన్యా శృంగారం వర్ణితం. సంగీత సాహిత్యాలతో పాటు - క్షేత్రయ్య పదాల్లో లాగానే - సారంగపాణి తన పదాల్లో అభినయాన్ని జోడించాడు. తాను అభినయం నేర్చిన, నేర్పిన ఆచార్యుడు. ఒకానొక సందర్భంలో తాను సైతం స్త్రీ వేషంలో ప్రత్యక్షమై, పదాభినయంపట్టి, రాజును సభాసదుల్ని ఆశ్చర్యచకితుల్ని చేసిన అభినయ దక్షుడు.[34] ఇంతటి అవకాశం కల్పించిన ఆ రాజు రాసిక్యాన్ని మనం మెచ్చుకోవలసిందే. సారంగపాణినే గాక గోవిందసామయ్య, కూవన సామయ్య సోదర వాగ్గేయ కారుల్ని పోషించిన రసికుడు ఆ రాజు. అలాంటి రాజుల పోషణలో ప్రసిద్ధి కెక్కిన వాడు సారంగపాణి.

రెడ్డిరాజుల కొలువులో శ్రీనాథుడు విద్యాధికారిగా ఉండినట్లే, కార్వేటినగర పాలకుడైన మాకరాజు వేంకట పెరుమాళ్రాజు ఆస్థానంలో సారంగపాణి విద్యాధి కారిగా ఉండేవాడనీ, విద్యాధికారికి అవసరమైన సర్వలక్షణసంపన్నుడై ఉండేవాడనీ రజనీకాంతరావుగారు వివరించారు.[35] ఆవెనుక మాకరాజు కార్వేటిరాజు ఆస్థానం అధివహించి, ఆ రాజుముద్రతోను, వేణుగోపాలస్వామిపై అధికంగాను తదితర దేవతలపై కొన్ని పదాలు రచించి ఉత్తమ వాగ్గేయకారుడై ప్రసిద్ధికెక్కాడు సారంగ పాణి. ఇంతేగాక మాకరాజు వేంకట పెరుమాళ్రాజు మెచ్చి "శకసంవత్సరములు 1731 వ సంవత్సరమునకు సరియైన శుక్లసంవత్సరమున సంస్థానములో 'దుర్గరాజ

34. బాలాంత్రపు రజనీకాంతరావు : ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర - పు. 327.

35, ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర - పు. 217

పురోమను శ్రోత్రియగ్రామమును వీరికి (సారంగపాణికి) దానమిచ్చినట్లు"[36] తెలుస్తూన్న విషయం పూర్వోక్తం.

చివరిదశలో రాజాశ్రయరహితుడై నిరుపేదతనంతో శ్రీనాథునిలాగా సారంగపాణి అష్టకష్టాలు అనుభవించాడని భావించారు రజనీకాంతరావుగారు. "రాజాశ్రయం లేని రోజులలో ఇతడు అత్యంత దారిద్ర్యం అనుభవించి, ఉంఛవృత్తితో వియ్యమడుగుకొని జీవించినట్లు తెలియజేసే పదాలు కొన్ని ఉన్నవి. శ్రీనాథుడుకూడ అటువంటి దారిద్ర్యం అనుభవించిన చరమదశలో పామరజనుల నడుమ గడిపి, వారి ఆనందానికి పల్నాటి వీరచరిత్ర, కాటమరాజుకథ వంటి వీరపదాలను (బాలప్ప) రచించినట్లే, సారంగపాణి తనచేత కాసులేనిరోజుల్లో జానపదులతో కలిసి కాలక్షేపం చేస్తూ వారి ఆనందంకోసం 'అగ్గితిరునాళ్ళంట', 'నాన్నారం సంతలోన' వంటి పల్లె పదాలనుకూడ రచించాడు."[37] సారంగపాణి, శ్రీనాథుల పోలిక, ఊహ చాలా బాగున్నాయి. కానీ దీన్నే మనం మరోలా ఊహించడానికి వీలుంది. యౌవనంలో శృంగారలోలుపుడైన సారంగపాణి శృంగారపదరచన చేశాడు తన పోషకుడైన రాజు కోరినట్లు. క్రమంగా అతని మనస్సు ఆధ్యాత్మికప్రవణమైంది. కాబట్టి ద్వితీయభాగంలోని దేశీయపదాలు వేశ్యావిలాసదూషణతో కూడిఉన్నాయి. తృతీయ భాగంలోని జాతీయపదాలు జానపదులతో సారంగపాణికిగల సన్నిహితత్వాన్ని ప్రకటిస్తున్నాయి. వాస్తవానికి ఈ పదాలు సారంగపాణి చరమదశలో, చేత కాసులేనప్పుడే రచించాడనడానికి వీలులేదు. శ్రీనాథుని చరమదశా వివరణమ తెలిపే అతని చాటువులు, ఇతరాధారాలున్నట్లు సారంగపాణి విషయంలో మనకే ఆధారాలు లభించలేదు. కాబట్టి సారంగపాణి ఆస్థానవిద్వాంసుడై ఉన్నకాలంలోనే ఆయా సందర్భాల్లో- అంటే పండగపబ్బాల్లోను, జాతరల సమయంలోను - రచించాడనడమే సముచితం. "అగ్గితిరునాళ్ళ కార్వేటినగరప్రాంతంలో అతి ప్రసిద్ధాలు. నిప్పుతిరునాళ్ళని, ధర్మరాజుల తిరునాళ్ళని, భారతాలనీ వీటికే అనేక పేర్లు."[38] తిరుణాల సందర్భంలో "అగ్గితిరుణాలంట - అజ్జునీకతలంట" (ప-153) ; సంతల సందర్భంలో "నాన్నారం చంత్లో - నానాదించుందెంట" (ప. 154) మొదలైన పదాలు రచించాడనడమే సముం

36. కృష్ణాస్రవంతి - పు. 119

37. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర - పు. 318

38 కె. జె. కృష్ణమూర్తి : సారంగపాణి పదాలు - స్రవంతి ; డిశం. 1975, పు. 12

జనం. పైగా వీటన్నింటిలోను ఆ సంస్థానరాజుల ప్రమేయం లేకుండా జరిగిఉండవు. అందుచేత ఆస్థానపండితుడు, వైణికుడు, వాగ్గేయకారుడూ అయిన సారంగపాణి ఆ కార్యకలాపాల్లో పాల్గొని ప్రముఖపాత్ర వహించి, ఇటు రాజుకు, అటు ప్రజకు సన్నిహితుడై ఈ పదరచన చేశాడనడం చక్కగా కుదురుతుంది. చేత కాసువీసం లేని చివరిదశలో తాననుభవించిన దారిద్ర్యంతో బాధపడుతూ—

"అక్షయపాత్రకు పోతే కలదని పొక
భిక్ష వేయరయ్యా !............" (ప. 194) - అనీ,

"ఉంఛవృత్తితో బ్రతికేవారికి
వుగ్రము కారాదు............" (ప. 195) - అనీ

చెప్పిన పదాలు సారంగపాణి ఆత్మాంశాలుగా (Personal elements) గా తీసుకో పనిలేదు. ఆనాటి నిరుపేదల బాధల గాంచిన సమగ్రమైన అవగాహన, లోకజ్ఞత గలిగిన కవి అయిన సారంగపాణి మానవతాదృక్పథంతో, ఆధ్యాత్మికచింతన ప్రవణ మైన మనఃప్రవృత్తితో చెప్పిన పదాలనే మనం భావించాలి. సారంగపాణి ఉత్తమ భక్తుడుగా జీవితాన్ని గడిపినట్లు చతుర్థభాగంలోని కీర్తనలే నిదర్శనం. ఆతని భక్తి తత్వానికి, వేదాంత వైరాగ్య, నీతిప్రబోధాత్మకదృష్టికి, ఆధ్యాత్మికచింతనకీ ఆ కీర్తనలు చక్కటి సాక్ష్యాలు. సారంగపాణి జీవితం పోతన జీవితంలాగా చివరిదశలో సాగిందని మనం విశ్వసించడమే సమంజసం.

సారంగపాణికి పుత్రసంతానం ఉన్నట్లు కనిపించదు. పుత్రీసంతానమున్నట్లు స్పష్టం. ఇతని దౌహిత్రుడు గరిమెళ్ళ వెంకటసుబ్బయ్య అని తెలుస్తుంది. "చెన్న పురిలో 1867వ క్రీస్తుశకసంవత్సరము (సారంగపాణి పదాలు గ్రంథం) అచ్చు పడ్డది. కార్వేటినగరాధీశ్వరుల ఆజ్ఞచే గ్రంథకర్తయగు సారంగపాణిగారి దౌహిత్రుడు గరిమెళ్ళ వెంకటసుబ్బయ్యగారిచే నేలటూరి సుబ్రహ్మణ్యంగారి విద్యావిలాస ముద్రా క్షరశాలయందు ముద్రింపబడినది."[39]—ఇది పూర్వోక్తం. కానీ దీవి నరసింహా చార్యులుగారు సారంగపాణి దౌహిత్రుడు సారంగపాణి అని స్పష్టం చేశారు. "వీరికి (సారంగపాణికి) పుత్రసంతతి లేకపోవుటవలన దౌహిత్రుడగు గరిమెళ్ళ సారంగ

39. సారంగపాణి పదములు : సమీక్ష - పు. 10

పాణిగారు వీరి పదములను ప్రచారములోనికి తెచ్చిరి.[40] సారంగపాణి దౌహిత్రుడు సారంగపాణి అని తలంచడమే సమంజసంగా తోస్తుంది. సారంగపాణి పుత్రిక తన తండ్రి పేరుని తన పుత్రునకు పెట్టుకొన్నదని మనం ఊహించవచ్చు. ఇది ప్రపంచంలో సహజవిషయం. నాకు లభించిన సాధనసామగ్రివిబట్టి సారంగపాణి జీవిత విశేషాల్ని మనం ఇంతమాత్రం తెలుసుకోగలిగాము. భావి పరిశోధకులు మరిన్ని విశేషాల్ని కనుగొంటారనీ, సారంగపాణి జీవితానికి పరిపూర్ణత్వం కలిగిస్తారనీ ఆశిస్తున్నాను.

"కార్వేటినగరంలో మిత్రసాహితి అనే సాహిత్యసంస్థ తరపున సారంగపాణి స్మృతిసభను ఏర్పాటుచేసినాము. ఈ దీపావళి పర్వసమయంలో ఏర్పాటయిన సభలో ప్రసిద్ధులు పాల్గొంటున్నారు. ఇకమీదనైనా సారంగపాణి పదాలను గురించిన సమగ్ర పరిశోధన, కార్వేటినగర కవులను, చరిత్రను గురించిన పరిశోధన జరుగుతుందని ఆశిద్దాము.[41] – అని ఆశించిన ఆచార్య పి. వి. అరుణాచలంగారికి తగినరీతిని నేను యత్నించాను. తత్ఫలితమే ఈ గ్రంథరచన. సారంగపాణి జీవిత విశేషాలతోపాటు ఆతని పదరచనాశిల్పవైభవంతో సమగ్రమైన విషయపరిశీలన తరువాతి ప్రకరణాల్లో చేయడం జరిగింది. దానికీ మొదటి ప్రకరణం పూర్వరంగం మాత్రమే. ఆయా విషయ వివరణ కీప్రకరణం చక్కగా ఉపకరించగలదు.



40. కృష్ణాస్రవంతి – పు. 119

41. అజ్ఞాత వాగ్గేయకారుడు – సారంగపాణి : ఆంధ్రపత్రిక – డిశం. 5, 1976

## 2. పద కవితా శిల్పం :

ఆంధ్ర పదకవితా పితామహుడు అన్నమయ్య; పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య; అదేరీతిని తెలుగులో చక్కటి పదకర్త సారంగపాణి. అలాంటి సారంగపాణి పదకవితా శిల్పవైభవ ప్రకటనమే ఈ ప్రకరణ పరమార్థం.

### 2.1 తెలుగులో పదరచన :

సారంగపాణి పదకవితా శిల్పవైభవాన్ని తిలకించేముందు తెలుగు పదరచన ఆరంభ వికాసాల్ని గూర్చి స్థూలంగా తెలుసుకోవడం అవసరం. పదపద్య కవితల్లో పదకవిత్వమే మొదట పుట్టిందనడం విద్వాంసులు అంగీకరించిన విషయమే. ప్రాక్తనమానవుడు తనకు కలిగిన సుఖదుఃఖాది అనుభూతులకు అనుగుణంగా ఆడిపాడుకోవడంలోనే ఈ పదకవిత పుట్టింది. అదే కాలాంతరంలో సంస్కరించబడి, దానినుంచి విడివడి పద్యకవితగా, ప్రౌఢకవితగా పండితులచే అంగీకరించబడి నిబద్ధం చేయబడి గౌరవపాత్రమైంది. పదకవితకు ఇంతగౌరవాదరాలు లేకపోయినా తనదారి నదినడుస్తూనే ఉంది. వికాసంచెందుతూనే ఉంది; సామాన్య ప్రజల మన్నలకు పాత్రమవుతూనే ఉంది; చివరికి పండితులచే సమాదరించబడి, రాజగౌరవపురస్కారమైంది. తెలుగులో నన్నయ రచన మార్గ పద్ధతిలోనిది. నిసర్గమనోజ్ఞమైన దేశీ ఫణితిలో రచితమైన కవితసైతం ఉండితీరాలి. అందుకు నిదర్శనం నన్నయకు పూర్వం శాసనాల్లో కనిపించే తరువోజ మధ్యాక్కర, సీసం మొదలైన ఛందస్సులే. అనుశ్రుతంగా వస్తూన్న జానపద రీతులు ఉంటూనే ఉన్నాయి. దేశీఫణితిలోని కవిత అనిబద్ధం కావడంవల్ల కేవలం ప్రజల వాడుకలో ఉండి నశించిపోయి ఉంటుంది. ద్విపదని సమాదరించిన పాల్కురికి సోమన అనేక విధాలైన పదాల్ని పేర్కొన్నాడు :

"మదినుబ్బ సంసారమాయా స్తవంబు
పదములు, పర్వత పదము లానంద
పదములు, శంకర పదముల్ నివాళి
పదములు, వాలేశు పదములు, గొబ్బి
పదములు, వెన్నెల పదములు......" [పండితారాధ్యచరిత్ర]

కాబట్టి అతిప్రాచీన కాలం నుంచి తెలుగులో రకరకాల పదాలుండేవని స్పష్టమవుతుంది. ఏమైనా తెలుగులో సంకీర్తన వాఙ్మయం కృష్ణమాచార్యులనే వైష్ణవ భక్తునితో ఆరంభమైంది. సింహాచలంలో వెలసిన వరాహ నరసింహస్వామికి అంకితంగా 'సింహగిరి వచనములు' - అనే పేరుతో రచించి, సంకీర్తనంచేసి తరించాడు. ఇతని కాలం పన్నెండో శతాబ్ది. తెలుగులో ప్రప్రథమ వాగ్గేయకారుడితడే. తరవాత పేర్కొనదగ్గవారు యాగంటివారు. పదాలు, వచనాలు, తత్వాలు యాగంటి లక్ష్మప్ప మొదలైన వారివిగా ప్రచారంలో ఉన్నాయి. ఆ వెంటనే చెప్పదగ్గవాడు సుప్రసిద్ధవాగ్గేయకారుడు, సంకీర్తనాచార్యుడు, ఆంధ్ర పదకవితాపితామహుడు - అని కీర్తిగాంచిన తాళ్ళపాక అన్నమాచార్యుడు (1424-1503). వారి కుటుంబమంతా పండితకుటుంబం. అన్నమయ్య వేలకువేలు సంకీర్తనలు వేంకటేశ్వరునిపై రచించి, ఆడిపాడి తరించాడు. ఇతని సంకీర్తనలు-ఆధ్యాత్మసంకీర్తనలు, శృంగార సంకీర్తనలు - అని రెండు విధాలు. ప్రసిద్ధకన్నడ వాగ్గేయకారుడు, కర్ణాటక సంగీత పితామహుడు పురందరదాసు అన్నమయ్య సమకాలికుడు. అన్నమయ్య సతీమణి తిమ్మక్క 'సుభద్రాకల్యాణ' మనే గేయకావ్య రచయిత్రి. వీరి ద్వితీయ పుత్రుడు పెదతిరుమలాచార్యుడు, ఇతని పెద్దకుమారుడు చినతిరుమలాచార్యుడు పదకవితలు అనేకం రచించారు. పెదతిరుమలాచార్యుని రెండో కుమారుడూ, చినతిరుమలయ్య తమ్ముడూ అయిన చినతిరువెంగళనాథుడనే చిన్నన్న సంకీర్తనలు లభించక పోయినా, ఇతని ఇతర రచనలైన అన్నమాచార్య చరిత్ర, అష్టమహిషీ కళ్యాణమూ, పరమయోగి విలాసము, ఉషాపరిణయము - అనే ద్విపద కావ్యాలు లభ్యమవుతున్నాయి. ఇలాగా తాళ్లపాకవారి కుటుంబం తెలుగు సంకీర్తన వాఙ్మయానికీ, సంగీతానికీ ఎనలేనిసేవ చేసిందనడం సమంజసం. శ్రీనాథయుగంలోనే యక్షగాన ముండినట్లు, దానిపై అభిమానముండేదనడానికి :

"కీర్తింతు రేద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి" (క్రీడాభిరామము ఆశ్వా 3; పు 65)

అని పేర్కొనడమే చక్కటి నిదర్శనం. పైగా మంజరీద్విపదల్లో పాడి, ఆడుకోడానికి తగిన పల్నాటివీరుల చరిత్రని పదంగా రచించిన ఘనత సంపాదించినవాడు శ్రీనాథుడు. తరువాత అనేక మధురకవితలు వెలిశాయి. మధుర కవితల్లో యక్షగానం ఒకటి. ఈ యక్షగానంలో పదాలు, దరువులు, కీర్తనలు, ఏలలు మొదలైనవి ఉంటాయి. రగడలు ప్రబంధాల్లో వెలిశాయి. అన్నమయ్య తరువాత పేర్కొనదగ్గ వాగ్గేయకారులు నారాయణతీర్థులు, సిద్ధేంద్రయోగి. ఈకాలంలో వెలసినవాడే ప్రసిద్ధ పదకర్త క్షేత్రయ్య. ఇతని తరువాత రామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి చెప్పుకోదగ్గవారు. ఈ సమయంలోనే కార్వేటినగరంలో పదకర్తగా, కీర్తనకారుడుగా వెలసినవాడు సారంగపాణి. మధుర, తంజావూరు రాజ్యాలలో ఈ పదకవితకు పట్టాభిషేకం జరిగింది. ఆ వెనుక రాజ్యానికి వచ్చిన మహారాష్ట్ర ప్రభువులు సైతం కవిపోషకులేగాక స్వతఃగా కవులు ; ముఖ్యంగా వాగ్గేయకారులు. ఇంకా గిరిరాజకవి, ఘనం శీనయ్య, కాశీనాథయ్య, వీరభద్రయ్య, శ్రీనివాసయ్య, ఆదిఅప్పయ్య, మాతృభూతయ్య మొదలైన వారెందరో పదకారులు వెలిశారు. పదాలేగాక జావళీలు, శబ్దాలు, సల్లాములు మొదలైన రచనలెన్నో వచ్చాయి. సంగీతానికి పట్టాభిషేకం జరిగింది త్యాగయ్య నాదోపాసనలో. అన్నమయ్యపదాల్లో సాహిత్యంప్రధానం, సంగీతం గౌణం. క్షేత్రయ్య పదాల్లో సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యమే గాక అభినయం జోడించబడింది. త్యాగయ్య కృతులలో సంగీతం ప్రధానం, సాహిత్యం గౌణం. క్షేత్రయ్య ప్రక్కనే నిలువగల పదకారుడు సారంగపాణి. సారంగపాణి క్షేత్రయ్యలాగే తన పదాల్లో సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్య మొసగి, అభినయం సైతం జోడించినవాడు.[3] సారంగపాణి పదసాహిత్య విశిష్టతను పరిశీలిద్దాం.

## 2.2 మనోజ్ఞ పదరచన :

పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య. సంగీత సాహిత్యాభినయాలకు సముచిత స్థాన మిచ్చి పదరచన చేసినవాడు క్షేత్రయ్య. అదేరీతిని సారంగపాణి సైతం

---

3. పదకవిత – పుట్టుపూర్వోత్తరాలు – వివరాల కోసం నా గ్రంథం "క్షేత్రయ్య పద సాహిత్యం" ప్రకరణం రెండు పు. 47-70 చూడవచ్చు.

ఉత్తమ పదకర్త. భావరాగతాళాల, గీత వాద్య నృత్యాల సమ్మేళనం పదం. అలాంటి పదరచన చేసి తన ప్రతిభావ్యుత్పత్తుల్ని ప్రకటించినవాడు క్షేత్రయ్య. అలాగే, సారంగపాణి పదాల్లోను మన మా సర్వలక్షణాలు చూడవచ్చు. సాహిత్యజిజ్ఞాసువులకు సంగీతాభిమానులకు, అభినయాభినివేశపరులకు సమంగా ఆనందాన్నివ్వగలవి సారంగపాణి పదాలు. సారంగపాణి శృంగారపదాలతోపాటు దేశీయ, జాతీయపదాలతో పాటు భక్తి వైరాగ్య ఆధ్యాత్మిక నీతిప్రబోధాత్మకాలైన కీర్తనలు సైతం రచించి ఉండడం విశేషం. ఆయా రచనల్లోని శిల్ప వైభవం అడుగడునా స్పష్టం.

"నా దృష్టిలో త్యాగయ్య నారదుని వంటి దేవఋషి వలెనూ, క్షేత్రయ్య వాల్మీకి వంటి మనుష్య ఋషివలెనూ కనబడుతూ ఉంటారు.

సారంగపాణిగారి పాటలలో, త్యాగయ్యగారి నారదత్వముగాని క్షేత్రయ్యగారి వాల్మీకత్వముగాని కనబడకపోయినా పల్లవి, అనుపల్లవి చరణములు పరస్పరాను బంధము కలిగి, ఆయన సహజ కవితాసామర్థ్యమును వెల్లడిచేస్తూ ఉంటాయి".[4] ఇక్కడ మనకు వలసిన అంశాలు—సారంగపాణి పదాల్లో పల్లవి అనుపల్లవి చరణాలు పరస్పరానుబంధం కలిగిఉంటాయన్నదీ; అందులో అతని సహజ కవితా సామర్థ్యం ప్రకటితమవుతూ వుంటుందన్నదీను. అంటే పదరచనలో ప్రధానమైన పల్లవి, అను పల్లవి తరువాతి చరణాలు క్రమంగా ప్రాధాన్యం కలిగి పూర్వ పూర్వభావాలు, ఉత్తరోత్తరం విశిష్టతను చేకూర్చుకొన్నప్పుడే ఆ పదం మనోజ్ఞమై సహృదయ హృదయరంజకమై ఉంటుందన్న విషయం దీనివల్ల స్పష్టమవుతుంది. అలాంటి మనోజ్ఞ పదరచనకు సారంగపాణి పదాలన్నీ చక్కటి ఉదాహరణాలే అవుతాయి. మచ్చుకు:

"పల్లవి : పిలుచుక రావమ్మ - సామినీవేళ

అను - నెలతా ఈ పండు వెన్నెల తాళజాలనిక ॥పిలుచుక॥

మానవతి చెలులగా నీకు స - మానమెవ్వరు వట్టి యీ అను
మానమెందుకు చిన్ననాటభి - మానమిపుడైన మదినెంచి ॥పిలుచుక॥

---

4. మంథపాక పార్వతీశ్వర శాస్త్రి :- సారంగపాణి పదములు - సమీక్ష - పు 12

పాలుమాలుచు కమ్మవిల్తునీ - పాలుసేయక మేని సొమ్మొక
పాలునీకిచ్చేను గూట దీ - పాలు బెట్టే వేళకైన ॥పిలుచుక॥

మారు మాటాడ వలదని ము - మ్మారు మ్రొక్కితి రతులనన్నును,
మారుగా పెనగిన మహాసుకు - మారుండౌ వేణుగోపాలుని
॥పిలుచుక॥ (ప. 12)

ఈ పదంలో నాయిక నాయకుని పిలుచుక రమ్మని చెలిని వేడుకొంటుంది. ఇందులోని పల్లవి "పిలుచుక రావమ్మ - సామి నీవేళ" వల్ల, నాయకునిపై నాయిక వ్యామోహితయై ఉందన్న విషయం స్పష్టం. ఈ భావాన్ని అను పల్లవిలో "నెలతా ఈ పండువెన్నెల తాళజాలనిక" అని చెప్పడంతో కారణం- అంటే పండువెన్నెలలో విరహవ్యథాశరిత అయిన తాను తాళజాలనన్న విషయం పూర్తిగా వ్యక్తమయింది. తరువాత చరణాల్లో చెలిని పొగడి, ఆమె గొప్పదనాన్ని ప్రశంసించి గూట దీపాలుపెట్టక ముందే తీసుకొస్తే తన మేనినగల్లో సగం దాని కిస్తానని ఆశపెట్టి "మారుమాటాడవలదనీ" "ముమ్మారు మ్రొక్కితి" ననీ "రతుల నన్నును మారుగా పెనగిన మహాసుకుమారుండౌ వేణుగోపాలుని" పిలుచుకొని రమ్మని కోరుకోవడం స్పష్టం. ఇందులో పల్లవి, అనుపల్లవి, చరణాలు పరస్పరాను బంధాలై, భావస్ఫోరకాలై, రసపరిపుష్టిని పొందడం మనం గమనించవచ్చు. మరో ఉదాహరణ :

" పల్లవి : ఏమిటికే నీపే - రేమని యడిగితివి
అను : కోమలి నను వేణు - గోపాలుడని దెలిసి
॥ఏమిటికే॥

పడతీ నీ మోము ము-
ద్దిడు కొన్నప్పటి నుంచి
పద్మాక్షుడని నను -
బలుకుదురే

జడియక నీదు కీల్
జడ యల్లినదే మొదలు
తొడరి శేషశయను-
డనుచు బిలుతురే ॥ఏమిటికే॥

అలివేణి నీమోవి-
యానిన నెపమున
తలకొని మధుసూ-
దను డందురె
బలిమి నీ గుబ్బలు-
బట్టి జూచుట జేసి
తలిరుబోణి మందర
ధరుడని తలతురే ॥ఏమిటికే॥

మరుకేళి నిన్గూడి-
మరిగినదే గురిఁజేసి
మదన జనకుడని -
ప్రేమను గొలుతురే
పరిమళవతి - నీమై
పసుపు దుప్పైనది
అరసి పీతాంబర-
ధరు డనుకొందురే" ॥ఏమిటికే (ప-9)

నాయకుడు నాయికకు కలిగిన సందేహాన్ని నివృత్తి చేస్తున్నాడీ పదంలో. పల్లవిలో "ఏమిటికే నీ పేరేమని యడిగితివి? అని ప్రశ్నించి నట్లే ప్రశ్నించి "కోమలి నను వేణుగోపాలుడని దెలిసి" అనే అనుపల్లవిలో నాయికకు తెలిసిన తనపేరు ఉచ్చరించి, అలా తెలసి ఉండి ఎందుకు అడిగావని ప్రశ్నిస్తూ మూడు చరణాల్లోనూ ముచ్చట గొలిపేట్టు కార్యకారణ సంబంధాన్ని ప్రకటిస్తూ వివరించాడు నాయకుడు. ఇది మనోజ్ఞ

పదరచన. ఇందులో కవి భావుకత, భావుకతకు తోడైన భాష, చక్కటి కల్పన, సహజ సుందరమైన పదబంధాలు, సొగసైన భావాలు వ్యక్తీకరించి ప్రౌఢకవులకు ఏ మాత్రం తీసిపోడనీ, పై పెచ్చు పదకవితలో సైతం సహృదయ హృదయరంజక మైన కవిత చెప్పిన ఘనుడు సారంగపాణి అన్న విషయం గమనించవచ్చు. ఇలాగే "వరకన్యా తిలకమీ వనితపేరు దీని" - (పదం 7) అన్న పదంలోను ఈ విశిష్టత గోచరిస్తుంది. ఇవన్నీ శృంగార పదాలు.

ఇలాగే దేశీయ పదాల్లోనూ ఈ రచనా శిల్పం మనం చూడగలం.

"పల్లవి : నీపొందు సేయక విడిచేనా వేరే
నెలత కొప్పున విరులు ముడిచేనా అరే

అను. : బాపురే నేసేయు ప్రతిన చెల్లక పోతే
నాపేరు ఇక వేణుగోపాలుడనవలెనా ॥నీపొందు॥

మరుని గూర్చి తపము సేయనా యీడా
మనసు లేదంటేనే ఆయెనా
మరులు నిలుపలేక మరిమరి వేడితే
కరుణమాలియట్టి కంట్లెర్రసేయగానే ॥నీపొందు॥

పాటబాడి మెప్పించనా నీపై
పదము జెప్పి వలపించనా
బూటకాల మారి నీపుణ్యమనేకొద్ది
మోటు బారుకొని మొగము చిట్లించగానె ॥నీపొందు॥

కూనలమ్మకు వేటగొట్టనా నిన్ను
గూడితే పొంగళ్లు బెట్టనా
చానరో బతిమాలి సరసకు రమ్మంటే
కాని లేలెమ్మని కసరి పొమ్మనగానె॥ ॥నీపొందు॥ (ప–76)

ఇందులో నాయకుడు నాయికతో ప్రతినజేసి పలుకుతున్నాడు. పల్లవిలోని భావం అనుపల్లవితో దృఢమై తాను చేయదలచిన భావాల్ని మూడు చరణాల్లో చక్కగా

వర్ణించాడు. ఇలాగే "మనసు నొచ్చుకొని అసురుసురంటే" (ప-123) లోనూ చక్కటి రచన కాననగును.

ఇక కీర్తనల్లో సైతం ఇలాంటి జిగిబిగి ఉన్నట్లు స్పష్టం. పైగా భక్తి పరవశుడై సారంగపాణి రచించడం మూలాన మనోజ్ఞమైన రచన కుదిరినట్లు మనం గమనించవచ్చు. అన్నమయ్య, క్షేత్రయ్యల రచనలు పదాలు, త్యాగరాజు రచనలు కృతులు, రామదాసు రచనలు కీర్తనలు; ఈ కీర్తనల్లో భగవన్నామ సంకీర్తనం ప్రధానం ; భక్త్యావేశం ముఖ్యం. అందులో ఆవేశమూ, ఆర్జవమూ కనిపిస్తాయి. ఇందుకు చక్కటి ఉదాహరణ ఈ కీర్తన –

"పల్లవి : వేణుగోపాలుని విడువము – మరి
వేరే వక్కరి పేరునుడువము

అను.... వీణుగ కాశికి నడువము – ఖలుల
విత్తము కొంగున గట్టము మా ॥వే॥

పాప కర్మల కడప మెట్టము
పతిత పావనుడే మాకు చుట్టము
గోపబాలుని భజనె దిట్టము
యముని గొడవెందుకిది వేరే ఘట్టముమా ॥వే॥

పరుప భక్తుల దండ వీడము నర
పతుల ప్రేమిక కొనియాడము
హరిని వినా వేరే పాడము దుర
హంకారుల మోము జూడము మా ॥వే॥

కర్మపాశములు సళ్లింతుము లోని
కలుషము కడిగి గాలింతుము
ధర్మమార్గ మనుసరింతుము పరం
ధాముని మదిలో బంధింతుము మా ॥వే॥

నారాయణ దివ్యనామము యె
న్నటికీ మరువ మీసీమము
తారకమిది మాకు క్షేమము శ్రీ
ధరుని సేవే పూర్ణ కామము ॥వే॥

రక్షించుమని రవ్వసేతుము యెదుట
రాకుంటె వక చెయ్యి చూతుము
పక్షివాహన యని కూతుము మాకు
బలుకకుంటె సిగ్గు దీతు మా ॥వే॥

(కీర్తన – 158)

ఈ కీర్తన చాలా ప్రచారం పొందిన గేయం. స్వాతంత్ర్యోద్యమ సమయంలో దామరాజు పుండరీకాక్షుడు గారు ఈ బాణీలో గాంధీమీద పాటగట్టి పాడడం చూస్తే ఈ కీర్తనకెంత ప్రచారమొచ్చిందో తెలుస్తుంది.

"శ్రీ గాంధి నామాం – మరువాం మరువాం
సిద్ధము జైలుకు – వెరువాం వెరువాం
మా గాంధినే మేం – నమ్మేం నమ్మేం
మరి ఇతరుల మేము నమ్మాం నమ్మాం"

ఇలా నడుస్తుందీ గేయం.

"కరుణ నీకు నామీద దయకలుగుటకు కారణ మేమయ్యా:" (కీర్తన – 162) అనే కీర్తనలో కుచేలాది పరమ భక్తాగ్రేసరులను పేర్కొని మనల్ని సైతం భక్తిపరవశుల్ని చేయడం సహృదయ హృదయ రంజకం.

భగవన్నామ స్మరణపై మనసు నిలువదంటూ "నీ పాదపద్మముల నిలిపే నంటే మనసు" (కీర్తన – 172) అనే దానిలోను, రకరకాల రోతల్ని గూర్చి "పాపాత్మని ధర్మాధికారిగా" (కీర్తన – 174) లోను, చక్కటి ప్రబోధం "పోరాని వాళ్ళింట పోరాదు........" (కీర్తన – 181) లోను, భక్తి ప్రధానంగాని, పైపై

ఆడంబరాలు పనికి రావంటూ "భక్తిలేని వ్రతములెన్ని జేసిన...."(కీర్తన - 184) లోను వివరించాడు సారంగపాణి.

వీటన్నిటికంటె మన ప్రశంసకు పాత్రమైన సారంగపాణి ఏ పదకర్తా చేయని జాతీయ పదరచన చేయడం విశేషం. క్షేత్రయ్యలో వ్యావహారిక రూపాలున్నమాట వాస్తవం. కానీ కేవలం వ్యావహారిక రచన చేసిన ఘనత సారంగపాణికి లభించింది. పైగా ఇవి జానపదగేయాలకు దగ్గరగా ఉన్నాయి. అంటే ఇందులో జానపదాంశం అధికం. సామాన్య ప్రజలతోడి సారంగపాణికిగల సన్నిహితత్వం స్పష్టమవుతుంది. సారంగపాణి తృతీయభాగంలో 16 (142 - 157) జాతీయ పదాల్ని రచించాడు.

ఓ చక్కటి ఉదాహరణ :

పల్లవి : అగ్గి తిరుణాలంట అజ్జుని కతలంట
అవురా యెంత సొద్దెమే
బారత కత - బౌరా యెన్నెన్నింతలే

అను : సుగ్గిజయము దీని సుట్టుబలాదూరు
అగ్గురోరవు అయ్యోర్నేడిగే నీసొచ్చిగ ॥అ॥

యిగనేసు పయినెక్కి - యీ బీసనూదొచ్చి
బగు పేగ్గె లెన్నెన్నో - బలికె దుశ్శాసుని
మొగముచూడగానె - మొర్చనాయాలట్టె
గుగురు మిగురనకుండ - గుడ్డెల్ల గుక్కెనె ॥అ॥

అనుమం తెనకటోడు - అబిమన్ను డెంటనె
సనియు నోలెబట్ట - సాము శెయుచు అట్టె
యినయెయిూరబద్రు - నిసనకాయలు దొక్కి
కనురెప్పే శేతల్కి - కర్ణునిశించెనె ॥అ॥

యిరన్నెచ్చు దిడ్డకు-డింద్రజిత్తొకరెయ్యి
దురివోదనుని కెయిలో-దూరిముక్కున నెల్లి
అరశిపిసాశోలె-అశ్శద్దామనుమింగి
సురివోదమాయనే-సూడ యేటి గున్నె ॥అ॥

పేరి బూరుగలింట-గారదేవల మొద్ద
యీరపతిమెకు మొక్కి-యిటు తలెత్తే తల్కి
మారు బాసో మెకటు-మొలతిత్తొదిలించుకొని
శారె డైదీశెడిదొ-జనులకిచ్చె నేనిపు ॥అ॥

తేనీగగుములోలె-తెండె తెండెగపంజ
కోనచముద్రం గుంట-కొనను నల్చాడి సూడె
నానాదించెంగల్లె - నానారం చంతోలె
యేను గోపాలుడు - యెటులగాయించెనె ॥అ॥ (ప-153)

ఇందులో విషయం అంతా అవకతవకే కానీ సామాన్యజనుల
భాషలో తమాషాగా రాయడం స్పష్టమవుతుంది. అలాగే:

పల్లవి : నాన్నారము చంత్లో నానాదించుందెంట
సయుషుగిచ్చేరంటనె - సూదే -

అను : ఈన్నె పొద్దెక్కనే - యీదేషుండా - దెంటె
కోణ్ని గొంఢ బోతె - కొందురే వొగు రైన ॥నాన్నా॥

ఇలనేడ సూల్లెదె యీసు ల్లెమగ్గవే
పలుగుశాప లాడ మస్తంటనే
తల యొంటికె తాళ్ల నిలువు పొడు గెయ్యానే
అలసొచ్చె తల్కడ అంబ లొంపుండెరే ॥నాన్నా॥

అమ్మోరంటి తల్లి కమ్మలుంగరాలు
చెమ్మని స్త్రీ శీల్లు తిమ్మ శాతా
కమ్మ రక్క దోట గుమవు అగుమూడెల్మీబో
చొమ్మగ సూడాలే చోద్దెంగుండాలె ॥నా న్నా॥

మోదోల్ల శీన్నెంగు మెట్టెల కంటొచ్చి
ఏడె దోచలు తిన్నోరెంమ కొని
అదనీల్లుదాగి అగ్గెలేసురుకెత్తె
సూడ లేదేవుల్ని సూడ యేడి గున్నె ॥నా న్నా॥

అబి ప్పటి కీదు లెంత చింగారమే
న : రు కొక్క మోలు నాన్నెముగా
పెబుపే గాయించెనె బెమ్మిని మించెనో
నుబిఅమ్మెయుండు యీ సూనిదీయని శాత ॥నా న్నా॥
కాశి పొడుగెతికిన కలదాయీగోపిరం
యెశ శీలుగుల్లో యెగిరే రేమొ
వోశయ్యోర్లు గుమ్మలై వాపొయిరేచిలపెద్ద
పాశపు కూడే గోపాలుని దయశాత (ప-154) ॥నా న్నా॥

అక్కడక్కడ కొన్ని పదాలు అర్థంకావు. సామాన్యుల వాడుక ఇందులో ఉండడం గమనించవచ్చు. వీటిలో జానపదాంశాలెక్కువ. జానపదుల భాషలో వాళ్లు పాడి, ఆడుకోడానికి అనుగుణంగా రాయడమనేది సారంగపాణిలోని విశిష్ట లక్షణం. వాస్తవానికి తెలుగులోని పదవాఙ్మయాన్నంతటినీ ప్రజావాఙ్మయంగా మనం పరిగణించవలసిఉంది. మొత్తం సాహిత్యాన్నంతా, శిష్టసాహిత్యం. ప్రజా సాహిత్యం అని విభజిస్తేనే సమంజసమని నాభావన. దీన్నే పద్యవాఙ్మయము, పద వాఙ్మయమూనని మనంపిలవ్వచ్చు. దీనితో సాహిత్య సమాలోచనం సముచిత రీతిని చేయడం సాధ్యమవుతుంది. తన్మూలంగా మన సాహిత్యపు విలువలు స్పష్ట మవుతాయి.

## 2.3 పదప్రయోగ దక్షత :

పదప్రయోగంలో సమర్థుడు సారంగపాణి. ప్రతిపదసార్థక్యం సారంగపాణి పదాల్లో స్పష్టంగా గోచరిస్తుంది. అంటే తెలుగు భాషపై చక్కటి అధికారం సారంగపాణికి కలదన్న విషయం స్పష్టం ఇది అన్ని పదాల్లోను మనం చూడవచ్చు. ఒక ఉదాహరణ :

"పల్లవి : రమ్మనే సామిని రమ్మనే

అను : కొమ్మనీవే నా మనవి గై
కొమ్మని వేణుగోపాలుని॥ ॥రమ్మనే॥

మచ్చుమీద నేనుండగ-
మచ్చుమీద జల్లి నవాని॥ ॥రమ్మనే॥

ఇందుకాక కోర్వదంటె-
ఇందుకా కసరిందీవేళ॥ ॥రమ్మనే॥

అల సీమాటితో రేయెల్ల
అలసి మాటాడ కున్నాడు॥ ॥రమ్మనే॥

కూడిన సామిని నీతో
కూడిన నాపై దయయుంచి॥ ॥రమ్మనే॥(ప.23)

ఈ పదంలో పదప్రయోగదక్షత స్పష్టమవుతుంది. పదమా చిన్నది. భావమనంతం. పరిమిత పదాలతో ఈ పదరచనచే అల్పాక్షరాలతో అనల్పార్థ రచనని సాధించారు సారంగపాణి. ఇలాగే ప్రతిపద సార్థక్యం పతాకంతటా సాధించడం

"పల్లవి : నేను నీవు కనుగొన్న వేళెమొగ
నేత్తము బాయదుగా మరి మరి
నెమ్మది గలిగెనుగా.

అను : మేను నీ సొమ్మని యానలిచుకొని
మెచ్చితి యీడన వేణుగోపాలుడని॥ ॥నేను॥

చిన్ననాడు పండువెన్నెలలో యిసుక
దిన్నెలపై సురపొన్నల పొన్నున
పన్నీరు జల్లుక పవళించె లాహిరై
యెన్నెన్నో విధముల యెదనెద నదుముక॥ ॥నేను॥

ఊరినుంచి కలలో వచ్చిపై కొన్నట్లు
పులికి దిగ్గునలేచి నే నెదిరించినట్లు
తీరు గాదని డింకి తిరిగి సొలసినట్లు
చేరిలెమ్మన్నట్లు చై చై పట్టినట్లు॥ ॥నేను॥

మగడు వినిన చుట్టము లెడబాసిన
తగదని భూపతి దండన జేసిన
అగడైనా యెంత పాపము వచ్చిన
జిగిబిగి సొగసుగ వగలు పెనగొన ॥నేను॥(ప-67)

- లో మనం గమనించవచ్చు.

## 24 సున్నితభావ ప్రకటన :

సున్నితమైన భావాల్ని ప్రకటించడంలోను సమర్థుడే సారంగపాణి. చెప్ప దలచిన భావాన్ని హృదయానికి హత్తుకొనేట్టు, నిసర్గమనోజ్ఞంగా వ్యక్తం చేయ్యడం ఇతనికి చేతనవుతుంది.

"పల్లవి : ఆవాలు గంటిమాట లతని కతి మధురమాయ
నన్నింత మోడి సేతురా

అను : రావే యీరక పాప - రసమువలె తిరిగేవు
భావము దెలిసి యి - ప్పటి కోర్చుటేవాగు॥ ॥ఆవాలు॥

బాలరో పతిమనను - పాషాణమని దెలిసి
ఏల కులుకు లాడిని - ఎంతలేదంటివి
చాలునే శుద్ధమడ్డి - సాంబ్రాణివేనీవు
ఆలోలాక్షి నెదిరించి - అతివా సాధింతువా

(ప - 4) ॥అవాలు॥

- ఇందులో పల్లవిలోని మాటలు, ఊరక పాదరసమువలె తిరిగేవు, పతిమనను పాషాణమని, శుద్ధ మడ్డి సాంబ్రాణివే నీవు ఇవన్నీ సున్నితభావ ప్రకటన సమర్థమై ఉండడం స్పష్టమవుతుంది. ఇలాగే "నేరుతునని మాటలాడ రాకు మునుపే - నిన్ను నేనెరుగునా॥ (ప - 35) పదంలో" మూసిన ముత్యము వలెనున్న యా చెలిని; అసుగులోనే యరవై మారు గుణములైతే; ఇంటింటి చెంద్రుడవు." - మొదలైన విందు కుదాహరణలు.

ఇంకా "కొయ్యబొమ్మను చేరకోరిక లిచ్చున (ప - 38)" "ఎన్నెన్నో విధముల, ఎదనెదనదుముక (ప - 67);" "అన్నియు బాణములై వినసైచక (ప - 123);" "వీధెల్ల శివరాత్రిగమందె" (ప - 131) - ఇలాంటి వెన్నెన్నైన ఉదాహరించవచ్చు.

## 2 5 శ్లేషాదులు

సారంగపాణి పదాలు మామూలుగా చదివినప్పుడు సాఫీగానే అర్థవంతంగా ఉంటాయి. కానీ జాగారూకతతో పరిశీలిస్తే చక్కటి తేటతెలుగులో శ్లేషవైభవాన్ని, తద్వారా చమత్కారాన్ని, వ్యంగ్యం, ధ్వని, మార్మికత మొదలైన గుణాల్ని తన పదాల్లో పొదిగి ఉండడం స్పష్టమై సహృదయరంజకమై, ఆనంద పరవశుల్ని చేస్తాయి.

## 2 5.1 శ్లేషవైభవం:

ఈ శ్లేషని తనపదాల్లో సారంగపాణి రెండువిధాలుగా సాధించినట్లు తెలుస్తుంది. ఆయాపదాలకు స్వతస్సిద్ధంగా రెండర్థాలుండడం వల్ల శ్లేషను సాధించడం మొదటిది. పదాలవిరుపు వల్ల గలిగే అర్థద్వయస్ఫురణ చేతకలిగే శ్లేషరెండోది. మొదటి రకం శ్లేషకు ఉదాహరణ :

"పల్లవి : వరకన్యాతిలక మీ - వనితపేరు దీని
అను : పరికించ వేణుగోపాలస్వామి ॥వరకన్యా॥

పొలతినెమ్మోము, సం - పూర్ణచంద్రోదయము
అలకాళిరుచి వినో - దాంజనంబు ॥వరకన్యా॥

దాని మృదుమధురో క్తి - ద్రాక్షాది రస మెంచ
మానవతిచూపు మ - న్మథ బాణసమము॥ ॥వరకన్యా॥

చెలియ దాని గుణంబు - చింతామణిస్ఫూర్తి
అలరించుపాట శ్రుతి - కానందరసము ॥వరకన్యా॥

సరసాంగి పొక్కిలి వ - సంతకుసుమాకరము
అరయగా చనులు బి - ల్వాది నిరసించు॥ ॥వరకన్యా॥

తరుణి సర్వాంగసుం - దరరసమురతినేలు
కరుణ రాజమృగాంక - కలయు మికరతిని॥ ॥వరకన్యా॥ (పదం-7)

ఈపదంలో నాయికనభివర్ణిస్తూ ఆమె గుణాలతో ఔషధాలపేర్లని పేర్కొని ఆశబ్దాలకు పదబంధాలకుఉన్న అర్థద్వయంతో శ్లేషనిసాధించాడు పదకర్త. "పొలతి నెమ్మోము సంపూర్ణచంద్రోదయము"లో ఔషధ్యము కుదిరింది; అలకాళిరుచి వినో దాంజనంబు"లో కురులకాటుకవంటి నలుపును తెలుపుతుంది. ఇలాగే తక్కినపదం లోని "ద్రాక్షాదిరసము, చింతామణి, వసంతకుసుమాకరము," శ్లేషసమన్వితాలు. వీటి చేత చమత్కారాన్ని సైతం కవితీసుకురావడం విశేషం. ఇక పదాల విరుపువల్లకలిగే శ్లేష.

"పల్లవి" : పడతినే స్తము వేణుగో - పాలమాను
అను : తడబడక నీవికను - దాని చింతమాను ॥పడతి॥
పంతమున అటుదిక్కు పదినాళ్ళు పోకమాను
యింతికిచ్చేవు సుమీ ఈతమాను

సుంతమనసు ఘట్టిచేసి - సుదతి కెమ్మోవిమాను
చెంతదీయకది మహా - జగడగొండిమానును॥ ॥పదతి॥

సతతము దీనితోనీకు - బైలాయవేగిమాను
మతియింతలేదు శుద్ధ - మడ్డిమాను
హితవుగా నావద్దికీసుద్ది - తేకుమాను
తతిగాదిప్పుడు నీవా - సతినిబిల్వమాను॥ ॥పదతి॥

చెలినిగూడినది మొదలు - చేతికాసు పోడిశమాను
లలివేణి నిన్ను నేను - లడుగుమాను
నలితిండి జెడితివా - నాకుసింగిరేకుమాను
పొలతి కొసగకుచేతి - పూలగుత్తిమాను॥ ॥పదతి॥(పదం-5)

— ఇందులో మానులపేర్లు కవిపొందు పరచాడు. "తడబడక నీవికను - దాని చింతమాను" - ఇందులో చింతమాను - అంటేచింతచెట్టు, దాని చింత+మాను - దానిలలోచన మానుమని రెండర్థాలు పదాలవిరుపువల్ల వ్యక్తమవుతున్నాయి ఇలాగే తక్కిన "పోకమాను, శతమాను, వేగిమాను, మడ్డిమాను, తేకుమాను, బిల్వమాను," మొదలైనవన్నింటా ఈశ్లేష స్పష్టమవుతుంది అలవోకగా ఆయాపదాలువచ్చి సారంగపాణిపదాల్లో చోటుచేసుకున్నాయి. వాటికి అతడుయత్నించినట్లు లేనేలేదు. ఇదినిజమైన సహజమైన నిసర్గమనోజ్ఞకవిత.ఇలాగే పూర్వోక్తమైన "రమ్మనే సామినిరమ్మనే" - (పదం-23)లోను పదచ్ఛేదంవల్ల కలిగేశ్లేషసహజ సుందరమై ఒప్పుతూంది.

## 2 5.2 చమత్కారం :

ఇందులో చమత్కారం సైతంఉంది. చక్కటి చమత్కారానికి ఈక్రింది పదమే ఉదాహరణ-

పల్లవి : ఏమిటికే నీవే - చేసిని యడిగితివి

అను : కోపలి ననువేణు – గోపాలుడని దెలిసి ॥ఏమిటికే॥
పడతీ నీమోము షు – ద్దిపి కొన్నప్పటినుంచి
పద్మాక్షుడని నను – బిలుకుదురే
జడియక నీదు కీల్ జడ యల్లినదే మొదలు
తొడరి శేషశయను – దనుచుబిలుతురే॥ ॥ఏమిటికే॥

అలివేణి నీ మోవి – యానిన నెపమున
తలకొని మధుసూ – దనుడందురె
బలిమినీ గుబ్బలు – బట్టిజూచుటజేసి
తలిరుబోణి మందర – ధరుడని తలతురే॥ ॥ఏమిటికే॥

మరుకేళి నినుగూడి – మరిగినదే గురిజేసి
మదన జనకుడని – ప్రేమను గొలుతురే
పరిమళవతి నీమై – పసుపు దుప్పటైనది
అరసి పీతాంబర – ధరు దనుకొందురే॥ ॥ఏమిటికే॥ (పదం–9)

ఇందులో నాయకుడు నాయికని ప్రశ్నిస్తూనే కార్యకారణ సంబంధంతో కూడిన–తనకు గల వివిధ నామములకు సంబంధించిన–విషయాలు చెప్పి చమత్కరిస్తున్నాడు; వాస్తవానికి ఆయా కార్యాలవల్ల కలిగినవి కావు. కానీ కలిగినట్లు చెబుతున్నాడు. ఇంకా నాయికా నాయకుల సౌందర్య ప్రకటన సైతం కవి సాధించాడు. నిజంగా ప్రౌఢప్రబంధ కవికి సారంగపాణి తీసిపోడని స్పష్టమవుతుంది. ఇలాగే మరొకచక్కటి చమత్కారయుత పదం :

"పల్లవి : సంకటియిది తిరువీసము గాదు ప్రమింగను
చవిజూడ వలమసుమి

అను.... పంకజభవనుత శ్రీ వేణుగోపాల
ఇంక నన్ను మీకండ్ల యెపుడు జూతుమోరాణి॥ ॥సం॥

సారె సారెకు ముద్ద సాధింప నోపక
వీరమువిగి యూళ్ల బిచ్చమెత్తుచు విసికి

శ్రీరామ మంత్రము చిత్తమునందుంచి
ఆరగించడా శివుడు హాలాహలమువట్టి॥ ॥సం॥

నలుపు వర్ణముజూచి నమస్కారాలొనరించి
పలు దెరంగుల బయలు - ప్రాకిదిక్కులు చెదరి
కలగి యంతటి గుములై కాసారా నివాసులై
కలహంసములు తమ్మి కాడలు నమలవ॥ ॥సం॥

ఇది సంభావిత మాయనేమి సేయుదునని
మదిలో మాటికి చింతమగ్నుడై ధృతిమాలి
ఆదికారణముజేసి ఆదిశేషుడీభువిని
పదపడి యనిలము భక్షణ సేయడ॥ ॥సం॥ (ప - 137)

ఇందు అత్యద్భుతమైన కల్పన, మహాకవికి సహజమైన అనల్పభావన, వీటి మూలంగా చమత్కారాన్ని సారంగపాణి సాధించి తనప్రతిభను ప్రకటించాడు. శివుడు హాలాహలం ఆరగించడం; కలహంసలు తమ్మికాడల్ని తినడం, ఆదిశేషుడు వాయుభక్షణచేయడం సహజమైన విషయాలు. అయినా సంకటి తినలేకనే ఇలా చేశాయంటూ కవి చమత్కరించాడు.

## 2 5 3 వ్యంగ్యం, ధ్వని, మార్మికత మొ. వి :

సారంగపాణి పదాల్లో తృతీయ భాగంలోని జాతీయ పదాల్లో తత్వాల్లాంటి పదం ఒకటుంది. అది ఇది.

"పల్లవి : మనుషానమ్మబాకే - యీ ద్రేగాము కళేభారం
మనుషా నమ్మబాకే
అను.... మనుషా యీద్రేగాము - పట్టినట్టెంటిది
పని శేటిలోనుండె- పరమాత్ముడెల్లంటే ॥మ॥

తొమ్మిది సొరంఘాళతోశే నరమాళిగ
బెమ్మగా యించిది - బెష్టకారికట్టె ॥మ॥

ఎన్నెంటా యెంకేలు - యెంక ముంగలెంటికేలు
కన్న యాదులబుట్ట - గడగ కుంజెగబ్బు ॥మ॥

పయియెన్నె లమగున - పరపుశాంఢలము
పయిదు యీస్మృడుశేశి - మబ్బిగప్పిండాడు ॥మ॥

తన దోషాణశెత్తి - ధరమ ధాణంశేశి
యినవలె రామేండెం - కనమోచ్చము ॥మ॥

ఎంటవగీటిరావు - యేనుగోపాలుని
బంగ్రై పాదకవళం - బట్టాలే ఘట్టిగ ॥మ॥ (ప-150)

ఇందు వ్యంగ్యస్ఫూర్తి ఉన్నప్పటికీ, ధ్వని, మార్మికత సువ్యష్టంగా తెలుస్తూన్నాయి.

"పల్లవి : గుత్తలంజలను మరిగిన వారికి
దుత్తే కడపటను వరాల
అను.... తిత్తి పుత్తడైన వెనకబోతే
బెత్తెమె వేణుగోపాల ॥గు॥

కావలసిం దిచ్చే దినముల
కాళ్లు రెండు కనుల నొత్తుకొందురు
యీవు లుడిగి యిలు దూరితె గౌరీ
దేవి వాయనము దవుకొందురు ॥గు॥

బేరసారములుడిగి బికారై
బిక్కికాయ దిన్న కోతివలెబోయి
కారు బారు సేయవచ్చెనా శ్వం
గార కట్టదెమ్మని దిగ తీతురు ॥గు॥

కడకు బోయిన మూడు దినములైనా
యదముగా పవళించక గూడి

విడువలేక పొదిగిళ్ల బారితె
మెడ అర్ధచంద్రుని నియమింతురు ॥గు॥ (ప-191)

-ఇందులో వ్యంగ్యం స్పష్టం.

## 2.6 వర్ణనలు :

వర్ణనలు కవిప్రతిభకు చక్కటి నిదర్శనలు. ప్రబంధ కవుల ప్రతిభ అంతా వాళ్లుచేసే అష్టాదశ వర్ణనలు, అలంకారిక శైలీవిన్యాసం మీదే ఆధారపడి ఉంటుంది. సారంగపాణి పదకవితలోను వర్ణనా వైదగ్ధ్యంతో తన ప్రతిభను చాటుకొన్నాడు. వర్ణనలో దృశ్యసాక్షాత్కారమై మనః ఫలకంపై చెరగని ముద్రవేయ గలిగితే అది ఉత్తమ వర్ణన. అందులో కవిభావన, కల్పనస్పష్టమవుతాయి. ఇలాంటి వర్ణనలకు సారంగపాణి పదాల్లో కొదవలేదు. శృంగార పదాల్లో స్త్రీ పురుష విరహాన్ని చాల చక్కగా చిత్రించాడు సారంగపాణి. విరహవ్యథాభరిత మనస్కుడైన నాయకుడు నాయికని వేడుకొంటున్నా డీక్రింది పదంలో.

"పల్లవి : వలచితినే నీపై ముద్దు చాలా
తలచితే నామది

అను.... తాళదు విరహ మగ్గలమాయె ॥వలచి॥

వంచన మానవే మంచి మాటాడవే
సంచున బాడవె పంచశరుని చిలుకా
యించుబోణుల మేటివంచు సభాస్థలి విన్నానే ॥వలచి॥

నమ్మిన వాడనే కొమ్మల పేడనే
తెమ్మెర డాయనే నెమ్మది నోర్వగలనా
సమ్మతి చిగురాకు కెమ్మోవి తేనెలానగనే ॥వలచి॥

దక్కితి వలలా చిక్కితినే గోలా
మ్రొక్కెద యీ వేళ గ్రక్కున నేలుకోవె
చక్కెర బొమ్మరో నిక్కము వేణుగోపాలుడ॥ ॥వలచి॥

(పదం-49)

ఇలాగే నాయకుడు నాయికని–

"యెందుకు యేచేవు యికనైన దయచూడవే॥" అంటూ ఈ కింది పదంలో వేడుకొంటున్నాడు.

పల్లవి : కుందరదన నాపై కూరిమి మరచితో
కొసరి వేడిన పలుకవేమె ఆజానే
అను.... సుందరీమణి వడిసుళ్ల బెట్టుచు యిట్లా
యెందుకు యేచేవు యికనైన దయజూడవే ॥కుంద॥

కలనైనా మరువజాలనే నిన్ను
గడియ జూడకున్న జాలనే యిట్లా
అలయించిన నాదాయ మెంతౌనే
వలచి వేలునాకి వ్రతము జెరుచుకొంటినే॥ ॥కుంద॥

అడుగులకు మడుగు లొత్తైనే కెమ్మో
వానసీయవే జుంటితేనె యింత
పడచుతనమా బుద్ధి బంగారాయనే
తొడరి దైవానికి ద్రోహము జేసితినె

వేణుగోపాలుడగానా నన్ని
వేళరతుల సుఖానా కీర
వాణి ప్రేమదాచితే వడ్డికిమారున
జాణవైనావే నీసరియవరే చెలులలోన ॥॥కుంద॥ (పదం–50)

ఇంతకంటె స్త్రీవిరహ వర్ణనమనోజ్ఞంగాచేశాడు సారంగపాణి. నాయిక చెలితో తనవిరహాన్ని చెప్పినాయకుని రమ్మనమని వేడుకొంటూంది :

"పల్లవి : రమ్మనే యీమేనువాని సొమ్మనే
కౌగిట జేర్చుకొమ్మనే మోవితేనెలిమ్మనె

అను : జాలనేతమక మణవజాలనే పతిజూడనిసొగ
మేలనే యీ జవ్వన మేలనే

మించెనే మరుడు నన్నెదిరించెనే శుకశారికెలు రవ
ళించెనే నెలరాజు గర్వించెనే॥ ॥రమ్మనే॥

వాదటే యీ మేను నీదే గాదటే వాని నిందు తే
రాదటే నెనరింతైనా లేదటే॥ ॥రమ్మనే॥

మెచ్చెనే దానినడిమీకి దెచ్చెనే మేలైన బిరుదు
లిచ్చెనే యెంతపని వచ్చెనే॥ ॥రమ్మనే॥

నాయమా వెతలు బెట్టుటాదాయమా వొంటిగానుండే
పాయమా నా చెలిమింత హేయమా॥ ॥రమ్మనే॥

చూచునా తొలతటి ప్రేమ దాచునా మనసు దయ
తోచునా నేరములన్ని కాచునా॥ ॥రమ్మనే॥

ఒట్టుబెట్టి నన్నేలీనా వరదా నారాయణుడాపళ్లి
పట్టునా తిరుగా చెట్టబట్టునా ॥రమ్మనే॥ (ప - 69)

ఇందులోని అనుప్రాసలు హృదయంగమంగా ఉన్నాయి. విరహబాధ భరించలేక నాయిక చెలితోచెప్పి "విరహాగ్నిచేత కరిగి మేను సగమాయనే" అనిచాల చక్కగా చెప్పి వాపోయింది.

"పల్లవి : తటుకు తటుకు మని యదరీనె గుండె
దిటవులేదె నీ సాక్షిగా

అను.... కుటిల కుంతలి యన్నృణ సరోవర
మటప్రసన్న వేంకట శౌరిమొన్న
చిటికిలో వలపించి పోయెనే
నెటులసైతు దెలుపవె నా రొమ్మున॥ ॥తటుక॥

నిలువ నీయదు నిలిచినచోట
నిముష మొక్క యుగమాయెనే
పలుక నీదు ప్రాణసఖులమీది
జాళి యెపుడు మరుపాయెనే
తలచి తలచి వేదనచే గుందితి
తలవాకిట నిలచి యెదురు చూచితి
లలన యీతని పైరోసితి
చెలువరాయని జాసిన మొదలుగ॥ ॥తటుక॥

అన్నమేమో నాజిహ్వకు సుంత
హాయనేది లేదాయనే
కన్నెరో విరహాగ్నిచేత
కరగి మేను సగమాయెనే
అన్ని దైవముల వేడుకొంటి
అతనికైన వారిని శరణంటి
యెన్ని సకునములో జూడమంటి
యెమ్మెకాడిటకు రానందున॥ ॥తటుక॥

రతులు దేలించిన నాసామి
రాక సమయ మిటు జేసెనే
అతివరో సరివారు నవ్వగ
అగడు నా తల వ్రాసెనే
పతిని విడచి నే నే వగనైతు
పణతి యీ తొడపు లెచటనైతు
మితము మించె చిలుకతేజిరౌతు
మేలువాడు పేంచేసేటంతలో॥ ॥తటుక॥ (ప–73)

ఇందులో సముచిత పదప్రయోగంతో నాయిక విరహవ్యధని చక్కగా పర్ణించాడు పదకర్త. ఇలాగే ఇంకొక్క నాయిక నాయకుని 'విరహమగ్గల' మాయెరా అని వేడుకొంటుంది. "వలచివచ్చిన దానరా మది దీర" (పదం-75)

స్త్రీ పురుష వర్ణనలేగాక ఇతరస్వాభావిక వర్ణనలు సైతం ఇందులో ఉన్నాయి. ఒక చెలి నాయిక స్వభావాన్ని యథాతథంగా వర్ణించి చెబుతుంది.

"పల్లవి : ఎంతయే బ్రాకైతే నేమి
హితవేగద నీకు యీ

అను.... వింతజూచి నవ్వని వారెవ్వరు
వేణుగోపాలరాయ మొన్నటి ॥దెంత॥

పడకటిల్లు వకనాడుకనూడ్వడు
పట్టిమంచ మెన్నడు కదిలించదు
పడిగెమెపుడు బైటబెట్టి కడగదు
పరుపు దుప్పటైనా విదలించదు॥ ॥ఎంత॥

పేడజూచినా తలవెంట్రుకలు
ఎదురుగానె యెంగిలి పొగచుట్టలు
గోడమీద విపరీతపు నల్లులు
కొమ్మ పెదవిపై సున్నపు గురుతులు ॥ఎంత॥

పల్లు కుత్తుని వేసిన పుడకలు
పైటకొంగు కడవెళ్లా మరకలు
తెల్లవార్లు వింటివిగా గురకలు
చెల్లగడితివి యాభై కరుకులు॥ ॥ఎంత॥

వారానికి పందుల సాకింది
వల్లమాల్ని కోళ్లను పెంచింది
నీరాకకు దోవలుగాచింది
నిన్నుగూడి గర్వము మించింది. ॥ఎంత॥ (ప-119)

ఇది ద్వితీయ భాగం దేశీయ పదాలో ఒకటి. ఇందులోని వర్ణన అంతా జుగుప్సా వహమే. కానీ స్వాభావికవర్ణన చేయడంలో కవి ప్రతిభ గోచరిస్తుంది. ఆతనికిగల లోకజ్ఞత గోచరిస్తుంది.

ఇంతకంటే తృతీయ భాగం జాతీయ పదాల్లో 'కరువు'ని వర్ణించడంలో కవి తన ప్రతిభానైపుణ్యాన్నంతా ఉపయోగించాడు.

"పల్లవి : అచ్చయ బుట్టింది భూమికి బలుశబ్బ
రైణా దానమ్మ సోణిదీ సూడెం

అను.... పచ్చినూకలు నేలా
బడితె యిదీనేబ్బ దేలు
బిచ్చగాల్ల శేశిడిశ
బిరుదుబంట్ల నీతూరి॥ ॥అ॥

పందలు గదిలె పరమటిశీమ కెగబడి
కందులేశిరిగా శెక్కాద్రూక్కా
పందేశి అందులో సాంకోలేకమ్మెశిరే బిడల
కుందనంబుపై బడి కూట్లీల కిలబోయె ॥అ॥

శెట్టుమీది పచ్చులట్లు తలేలేశె
మట్టు దొంగలు వగతట్టగ్గి దేర
గట్టిగా బీదోల్లకు కలబందేగా కూడు
బట్టపరకేడ దిప్పటి యాడమాసులకు ॥అ॥

ఆలుమొగడు గూడెదది వోరొబగురేగిచం
సాలావుడ కాడించె సప్పంనారాగాలు
యీ లోనా యేనుగోపాలుని దయసేత
కాలువరసము గురిశ కరువుదెలిశిగాక॥ ॥అ॥ (ప-142)

జానపదుల మాటల్లో కరువునిగూర్చి కడురమ్యంగా స్వభావోక్తిలో వర్ణించాడు సారంగపాణి. ఇలాగా వర్ణనా వైదగ్ధ్యాన్ని పలువిధాలుగా ప్రకటించి తన ప్రతిభా నైపుణ్యాన్ని వ్యక్తంచేశాడు సారంగపాణి.

## 2.7 భావచిత్రాలు (Imagery) :

వర్ణనా వైవిధ్యంలో చూపిన మరో విశిష్టలక్షణం భావచిత్ర రచన శబ్ద చిత్రాలతోపాటు భావచిత్రాలు ఈతని పదాల్లో ఉన్నాయి. వాటిని - మనం చదువుతూన్నప్పుడు ఆయా భావాలతో కవికిగల ఆత్మీయత స్పష్టమవుతుంది. ఆత్మీయంగా లేకపోతే అలాంటి రచన చేయడం సాధ్యపడదు. ఈ భావచిత్రాలు పదాలకు పదాలు, చరణాలకు చరణాలు, పంక్తులకు పంక్తులుగా ఉండడం గమనించవచ్చు. పూర్వోదాహృతమైన పదాలు పేటికపే చక్కటి చిత్రాల్లా ఉండడం గమనించవచ్చు. పోతే ఒక పదంలోని చరణాలు మనోజ్ఞమైన భావచిత్రాల్లా ఉండడం మనం చూడవచ్చు.

"పల్లవి : నిన్ను దైవమనుచు యెట్లా నమ్ముదునయ్యా
యిన్నాళ్లవలె యికను-మదిలో

అను.... ఉన్నవంశయమె విన్నవించెదనిపుడె
వెన్న మ్రుచ్చిలి దిన్న వేణుగోపాలదేవ ॥నిన్ను॥

చెల్లబో జమదగ్ని చెప్పిన నెపమున
యెల్లభూతమ్ములు తల్లడమందగ
నుల్లము చెదర కత్యుగ్రకోపమున
తల్లిని ఖడ్గమున తలద్రుంచి వకటా ॥నిన్ను॥

వేదశాస్త్రముల ప్రవీణుడై యరుదెంచి
పేదవటుడై బలిని ప్రార్థించి వేడగ
పాదత్రయంబుర్వి పాత్రుడని యర్పించ
నాదట పాతాళ మణగ బెట్టితివయ్యా ॥నిన్ను॥

యేలోకముననైన యిట్టివింతలు గలవా ?
యీలాగు సుగ్రీవు డితవుబల్కగానె
నీ లావు దెలియుటకై నిరపరాధియైన
వాలినొక్కమ్మున వసుధగూల్చితివహహా ॥నిన్ను॥ (కీర్తన-161)

ఇందులోని మూడు చరణాల్లోని పరశురామ, వామన, శ్రీరామావతారాల్ని ఎంతో మనోజ్ఞంగా భావచిత్రాలుగా చిత్రించాడు సారంగపాణి. అలాగే

"పల్లవి : ఇంతకంటె చోద్యమిక వేరుయున్నదె
యెంత ఆశ్చర్యమయ్యా-చూడ

అను.... వింతలు నీ కథలు వినవిన వేడుకలు
కంతునిగన్న చక్కని వేణుగోపాల ॥ఇం॥

భృగురాముడై యల జగతి కశ్యపమునికి
తెగువనర్పించిన దేవుడవూ
మగటిమిచెడి బలిని మధురభాషణముల
వగలేక ధర మూడడుగులు వేడినావంటె ॥ఇం॥

అక్షయ వలువలు అల్ల ద్రౌపదికిచ్చి
రక్షించిన శ్రీరమానాథుడే
కక్షికట్టుక గోపకామినుల మైలలు
నిక్షేపమ్ముగ బట్టి వృక్షమెక్కినావంటె ॥ఇం॥

శంకాటంకము లేక జలరాశి బంధించి
లంకేశునణచిన రణధీరుడౌ
కంకపత్రము దాఁకిగి కాలయవనుడు దరుమ
బెంకేలబోయి కొండబిలముజొచ్చినావంటె ॥ఇం॥

(కీర్తన-169) లో శ్రీకృష్ణుని జీవితవిశేషాల్ని నిందాస్తుతిలో చక్కటి భావ చిత్రాలుగా మూడు చరణాల్లోను చిత్రించాడు సారంగపాణి.

ఇలాగే :

"పల్లవి : నాయక సామైనందుకు పాట
నయముగ పాడవలె అందున

అను.... గాయక మెరికి వినుపించేందులో
మనముగూడ వలే ప్రౌఢ ॥నాయక॥

కాసుకైన వక్కలాకులు
తీసుకోను చేతులాడక
తేసుపండ్లతో సొమ్ములు జార
వేసుకు కులికి నట్టేగాదు ॥నాయక॥

సొట్టబుగ్గలతోను వెండి
మెట్టెలువేళ్ల రొదలు సేయ
పట్టుచీర చుంగులు జార
గట్టుక కులికి నట్టేగాదు॥ ॥నాయక॥

బిడిబిడి కటికాలు బిలువ
అడుగు మీద అడుగు విడుదు
ఆడనె తెలియక చదురుమీద
ఆదేనని మురిసితే కాదు ॥నాయక॥

కోటేరు బెట్టెట్టు ముక్కున
వాటమైన నత్తు బెట్టి
మాటావలుకు నేరక పసుపు
మరియింత బూసితేగాదు ॥నాయక॥

పొట్టివాకున శాలువ ముసుకు
బెట్టుకొని పిళ్ళారాయవలె
పెట్టాఁదించుకొంటు మంత్రుల
చుట్టు తిరిగినట్టేగాదు ॥నాయిక॥

ఒకనితో సరసాలాడి వే
రొకనిజూచి సైగజేసి

ఒకని ముద్దుపెట్టుకొని
ఒకని రమ్మన్నట్టేగాదు ॥నాయక॥
వేణుగోపాలుని గూడి
వేలాంత్రాలు సంపాదించి
రాణివాసమనుచు గోడలు
రాతిరి దాటీనట్టేగాదు ॥నాయక॥ (వ_90)

ఇంక చరణమంతాగాక సగం చరణంఅంటే రెండురెండు వంక్తుల్లో ఒక్కొక్క భావచిత్రాన్ని మనం చూడగలం. చక్కటి ఉదాహరణ :

"పల్లవి : కరుణ నీకు నామీద గలుగుటకు
కారణమేమయ్యా

అను : పరమాత్మ వేణుగోపాల నీదు నామ
స్మరణమైన చేసితినే _ యేవగనైన ॥క॥

అల కుచేలునివలె నటుకులుదెచ్చి మి
మ్మారగించు మంటినే
చలవగంధము కుబ్జవలె దేవరవక్ష
స్థలమున నలదితినే ॥క॥

విలసితముగ యా విదురునివలె మీకు
విందొనరించితినే
కులుకుచు నారదునివలె పారిజాత
కుసుమ మర్పించితినే యేవగనైన ॥క॥

పరికించిచూడ శబరివలె మామిడి
పండ్లు గైకొమ్మంటినే
దరిలేక రావణుతమ్ముని వలె మిమ్ము
శరణు వేడుకొంటినే

కరిరాజువలె నీవే గతి యని పలుమారు
మొరలు బెట్టు కొంటినే
పరులబాధలకై ద్రౌపది వలె హే కృష్ణ
పాహిపాహి యంటినే యేవగనైన ॥క॥

అతిబాలుడైనట్టి యల్ల ధృవుని వలె
వెదకుచు తిరిగితినే
మతిమంతుడగు హనుమంతునివలె మిమ్ము
సతతము గొలిచితినే
చెతురుడైన గుహునిగతి నావ దాటించి
చెయ్యెత్తి మ్రొక్కితినే
పతితపావనుడనుచు లోకములెల్ల
ప్రఖ్యాతి జేసితినే – యేవగనైన ॥క॥ [కీర్తన–162]

పరమ భక్తాగ్రేసరులైన కుచేలుడు, కుబ్జ, విదురుడు, నారదుడు, శబరి, విభీషణుడు, గజేంద్రుడు, ద్రౌపది, ధృవుడు, హనుమంతుడు, గుహుడు – అనేవాళ్ళ భక్తిప్రపత్తుల్ని వారికృత్యాల్ని స్పష్టంచేస్తూ రెండురెండు పంక్తుల్లోనే మనోజ్ఞమైన భావచిత్రాలు పదకవితలో చిత్రించిన అనల్పకల్పనాశిల్పి సారంగపాణి. ఇలాగే నాయికానాయకుల శృంగారాన్ని అభివర్ణిస్తూ దేశీయపదాల్లోను, రెండురెండు పంక్తుల్లో భావచిత్రాలు చిత్రించడానికి ఈక్రింది పదం చక్కటి ఉదాహరణ :

"పల్లవి : చిటికెవేసితె నీవంటి
చెలులు లక్షపదివేలే
విటుకులాడి యెడవనుకొన్నావో
వేణుగోపాలుడు నాపేరు॥ ॥చిటి॥

అందగత్తెవనుచు వలచినందుకె
అలమి కౌగిటను జేర్చేవా
గంధమలది విరులు సిగనుజుట్టి
కప్పుర బాగాలిచ్చేవా

బంగరుచికమ్మలు గదలగరాగము
పాడి వీణెవాయించేవా
పందెమేళమున యేమాటాడక
దండనతో ప్రొద్దులుబుచ్చేవా॥ ॥చిటి॥

సరిగెపయుట దిగ్గునతొలగించి
చనులు అంటనిచ్చేవా
అరమరసేయక చక్కెరకెమ్మో
వానవిచ్చి లాలించేవా
మరునిభయము నీకెందుకు వలదని
మనసుదెలిసి నడిపించేవా
తరియిదిగాదు యింటికిరమ్మని
తలుపుమూసి గడెవేయించేవా॥ ॥చిటి॥

చెలువరాయ నాసామిగ రమ్మని
చెక్కులునొక్కి ముద్దిచ్చేవా
మొలకనవ్వు లొలుక సారెసారెకు
మోము మోముననుజేర్చేవా ॥చిటి॥

కలను కలిసినది నిజమౌటకు నను
గడియ రతుల తనియించేవా
కలదులేదనుచు నిజముగ నాతో
పలికి యిపుడు సెలవిప్పించేవా ॥చిటి॥ (వ-126)

ఇంతేగాక పదంలో ఒక్కొక్కపంక్తిలో ఒక్కొక్కభావచిత్రం చిత్రించడం గూడా సారంగపాణికి చేతనవుతుంది. పరిమితశబ్దాలతోనే ఎంతో అర్థనిర్భరమైన భావాన్ని ఇమిడ్చి, చిత్రకారుడిలా పదకవితలో ఒక్కొక్కపంక్తిలోనే చిత్రించడం సారంగపాణికే సాధ్యంకాగలిగింది.

"పల్లవి : లంజవారి తమ్ములకే యిప్పుడు
రాజఠీవులన్నీ యెందుకు

అను : కంజభవునికీ వసుమతిలో గుడి
కరువైనది వేణుగోపాల॥ ॥లంజ॥

ఖాసాబంతి భోజనమాయె
పీసె తమలపాకులు విడెమాయె
వాసన గంధము బూయడమాయె
మీసాలకు అత్తరు మెరుగాయె॥ ॥లంజ॥

నానాటకి పాగపెద్దదాయె
నయము శాలువలు గప్పడమాయె
శీనా అద్దము జూడడమాయె
చిమటాపని దినము దప్పదాయె ॥లంజ॥

కాళ్లకు వంకర పైజారాయె
కాపులు లంచము దోపడమాయె
వేళ్ళనిండ ఉంగరాలాయె
వీధివీధి గుర్రపు స్వారాయె॥ ॥లంజ॥

చేతిరుమాల విసరడమాయె
చెవుబపోగు లాడించడమాయె
రాతిరి సంగీతము మెండాయె
స్వజాతి ధర్మ మంతయు మరుపాయె॥ ॥లంజ॥

జాబులు జట్రలు వ్రాయడమాయె
స్వామిజవా..లు చెప్పడమాయె
జేబులోనె పెట్టె ఓగెమాయె
జెట్టువచ్చి న..ము బట్టుటాయె॥ ॥లంజ॥ (ప-117)

ఇది దేశీయ పదాల్లోనిది

దీనితో సారంగపాణి భావచిత్రరచన పూర్తిగాలేదు. సగం సగం పంక్తి లోనే ఒక్కొక్క భావచిత్రం రచన చేయడంలో కూడా సారంగపాణి సమర్థుడే.

"పల్లవి : నీ వారి నడతలన్నియు–
నేనే యెరుగనా

అను.... భావజ జనక వేణుగో–
పాలా నాతో దాచితేనే ॥నీ॥

తల్లి నిన్ను రోలగట్ట
తండ్రియావుల మేపబంపె
యిల్లాలు సడ్డసేయక
యిల్లిల్లు విహరించసాగే ॥నీ॥

అత్తగారు నరనాథుల–
కందరికీ పొత్తుల బాయ
ఉత్తముడా మీ యన్న నాగే–
లెత్తుకొని తిరుగులాడె ॥నీ॥

కోడలందటి నోళ్ల నిలచె–
కొడుకు తలగొట్లమా రాయె
నాడేని సోదరి యొక స
న్యాసి నంటు కొనీ జరిగె ॥నీ॥

కూతురు పారుబోతాయ–
నీతి దప్పి నడిచేను మరిది
ఘాతేశుడైన మీ బావ
చేత గాక బిచ్చమెత్తె ॥నీ॥

హింసకు వెరువని కాల
కంసుడు మేనమామ నీ
సంసార మిటువంటిదయ్యో
స్వామి వేణుగోపాల ॥నీ॥ (కీర్తన-164)

-ఇందులో " తల్లి నిన్ను రోలగట్టె, తండ్రియావుల మేపబంపె, కోడలందటినోళ్ల నిలచె, కొడుకు తలగొట్ల మారాయె, కూతురు పారుబోతాయ, నీతిదప్పి నడిచేను పరిది"- అనే ఈ సగంసగం పంక్తుల్లో చక్కటి భావచిత్రాలు సహృదయ రంజకమై ఒప్పుతున్నాయి.

ఇంక చివరిగా ఒక శబ్దంవల్లగానీ, పదబంధాలవల్లగానీ ఈ భావ చిత్ర రచనని సాధించాడు సారంగపాణి. వీటిని మనం శబ్ద చిత్రాలనడమే సముచితం.

"పల్లవి : కడుపా నీవింత ఘనమైతివా యే
అను.... కడ గురుతు లేదాయె కలకాలమునందు ॥కం॥

పాతకాలు చేసేది ప్రజలబాధించేది
నీతి యేటకలిపేది నిష్ఠమానేది
జాతకాలు వ్రాసేది జలధిలో మునిగేది
కోతి నాడించేది నీ కొరకే గదవే ॥క॥

పేటలు గట్టేది బేరము లాడేది
మూటలు మోసేది ప్రుచ్చిలించేది
పాటలు పాడేది వయిరువచ్చ జేసేది
కోటి విద్యలు నీ కొరకే గదవే ॥క॥

ఎలిక బొక్కలు ద్రవ్వి యెన్ను వ్రేళ్ల దీసేది
శిలలు భేదించేది శివమాడేది
పులుల బట్టుకొని పురములు దిరిగేది
కొలువు గొలిచేది నీ కొరకే గదవే ॥క॥

యేవేళ ధనికుల యిండ్ల చుట్టు దిరిగేది
నావ దాటించేది నవ్వించేది
తావు విడిచి దేశాంతరమున నుండేది
గోవుల గాచేది నీ కొరకే గదవే ॥క॥

ధారుణి యేలేది దండు దాళ్ళు దిరిగేది
నారిజాక్షుల విటుల వలపించేది
భారకుడౌ వేణుగోపాలుని దూరేది
గోరిముష్టెత్తేది నీ కొరకే గదవే ॥క॥ (కీర్తన-192)

-ఇలాగా సారంగపాణి పదాల్లో, చరణాల్లో, రెండు పంక్తుల్లో, ఒక్కొక్క పంక్తిలో, సగం పంక్తిలో మనోరంజకమూ, ఆనందనిష్యందీ అయిన భావచిత్రాల్ని పదకవితలో సాధించిన ప్రతిభాసంపన్నుడు. కడకు శబ్దచిత్రాల్ని సైతం చూపడం అతనికే చేతనయింది.

## 28 అలంకారాలు :

ప్రాబంధిక రచనకు అష్టాదశవర్ణనలతో పాటు ఆలంకారిక శైలి తోడ్పడి నప్పుడే కవి ప్రతిభ వ్యక్తమవుతుంది. వర్ణనాత్మక శైలితో పాటు ఆలంకారిక శైలిని తనపదాల్లో సమాదరించిన వాడు సారంగపాణి. శబ్దార్థాలంకారాలు ఈతని పదాలన్నిట స్పష్టంగా గోచరిస్తాయి. అవి అలవోకగా తన పదాల్లో వచ్చి చేరినవే గాని కష్టసాధ్యమైనవికావు. ఈ అలంకారాలన్నీ సందర్భ శుద్ధితో ఉండడం విశేషం.

### 281 శబ్దాలంకారాలు :

సారంగపాణి పదాలన్నింట ప్రాసనియతి ఉంది. లేనిశ్రమనికొని తెచ్చుకొని ద్విప్రాసను సైతం వాడడం విశేషం.

ద్విప్రాస

"పల్లవి : నిన్నుగొల్చి యొరుల వేడబోయితే
నీ కపకీర్తి గాదా

అను.... పన్నగవైరివాహ వేణుగో
పాలరాయ యాపన్న సహాయ ॥ని॥

ఎంచితి యిష్ట దైవమని భా
వించితి ప్రణమిల్లి భక్తి గా
వించితి త్వన్నామ మంత్రము జ
పించితి పూజించితి
పొంచితి ప్రాపు దొరుకుట కనుస
రించితి రక్షింతు వనుచు నా
సించితి దాసదాసులను వ
రించితి మిగుల సంతసించితి ॥ని॥

దేవరా మునుల కీప్సితార్థము
లీ౽రా అల ద్రౌపది మానము
గావరా గజరాజును సత్కృప
బ్రోవరా లక్ష్మీవరా
సేవరాజిల సేయగాను వర
మీవరా ధీవరా యనుచు సం
జీవరాయని బ్రహ్మగాను బహు
తీవరాన దేవరాజ వందిత ॥ని॥

చేరితి శుభము లిమ్మనుచు చల
పోరితి భూపతుల బొగడి గో
జారితి ఆజ్ఞానుడనై బహు
దూరితి వేసారితి

కోరితీ హరికథ వీనులవిన
మీరితీ దుష్టనరుల సంగతి
దారితీ మాయ దెలియుటకు మిము
జేరితీ భారతీశ నుతపద ॥ని॥ (కీర్తన-177)

ఇందులోని చరణాల్లో ద్విప్రాస ప్రయోగించారు. అలవోకగా పదాలువచ్చి ఇలని పదకవితలో చేరిపోయినట్లు స్పష్టం. ఇందులో అనుప్రాస సైతముంది.

అంత్యప్రాస :

ఒక్కొక్క చరణానికి మాత్రమే పరిమితమైన అంత్యప్రాస :

పల్లవి : నీయింటికి నీవు వచ్చేటందుకు
నెలత నంప వలెనా

అను : రాయబారమా చిరుతని చెంగల్వ
రాయా యిదీ మా పాగాయ ॥నీయింటి॥

ఎపుడు వత్తువని యెదురే జూచుచు
యెవరు వచ్చినా శకునము లడుగుచు
కపట దైవాలకెల్ల మ్రొక్కుచు
కరగుచున్నాను చే బిలచుచు ॥నీయింటి॥

ఒకటె రెండనుచు దినములు యెంచి
వద్ద దిరుగు చిలుకల నదలించి
సుకములేక పైపై తమి మించి
సొలయుచున్నాను పొందదలంచి ॥నీయింటి॥

చెలుల కందరికి లంచముగట్టి
శయ్యమీద చెక్కిట చెయిబెట్టి

వలరాయని రోయ బాయదిట్టి
వగచుచున్న నాపై దయబుట్టి ॥నీయింట॥ (ప-74)

చరణాలన్నిట ప్రతి పంక్త్యంత్యప్రాసకూర్చిన పదాలనేకం.
ఒకఉదాహరణ :

పల్లవి : ఏమిసేతు విరహవేదన
యెంతని తాళుకొందునమ్మా

అను : సామినాపై ప్రేమ మరచె
నామదికెంతో దిగులుతోచె ॥ఏమి॥

కోరిన కోరికె కొదవలాయె
కూరిమెల్ల వెగటాయె
వారచూపులే జూడడమాయె
వంచనదైవము వగదాయె ॥ఏమి॥

తలచి తలచి వగచుటాయె
నిలచినచోట నిలువదాయె
చెలియరో యన్నము సైచదాయె
చిత్తము వాని విడువదాయె ॥ఏమి॥

మనసు రానీ మాటలాయె
వినయ మెన్నడో విడచిపోయె
యెనసిలేదని ఏరాటుసేయ
యెంచిన వేణుగోపాలుని మాయ ॥ఏమి॥ (ప-45)

ఇలాంటిదే మరొకటి :-

పల్లవి : అన్నిటికిది సులభ మార్గము సుమీ
హరినామ స్మరణా

అను : పన్నగ శయనుడైన వేణుగో
పాలుని సన్నిధికి జేరేటందుకు ॥అ॥
చన్నీళ్ళలో మునుగుట కంటె
చలిలో జపము జేసుటకంటె
మిన్నుజూచి ధ్యానించుటకంటె
మిగుల జన్నములు సలుపుటకంటె ॥అ॥

వేదశాస్త్రములు చదువుటకంటె
అతివీరుడై యనిని గెల్లుటకంటె
భేదవాదముల పొరలుటకంటె
పెక్కువ్రతముల స్రుక్కుటకంటె ॥అ॥
దివ్యదేశముల దిరుగుటకంటె
తీర్థయాత్రలు పోవుటకంటె
ద్రవ్యదానము లిచ్చుటకంటె
తాపసియై గుహలు జేరుటకంటె ॥అ॥ (ప-183)

పల్లవి అనుపల్లవులలోను, చరణాలు ప్రతి పంక్తి అంతంలోను అన్త్యప్రాస లున్నాయి.

"ఎంతవేడుకొన్న పలుక - దేమి సేతుకొమ్మా
ఇంత రాతిమనసు వాని - నెందు గాననమ్మా
చిటుకుమంటె కోపమైతే యెటుల సైతునమ్మా
కటకటా దైవమెంత కరుణదప్పెనమ్మా
మాయదారి వగలకెంతో - మరులైతినె కొమ్మా
బాయననుచు చిన్ననాడె - బాసలిచ్చెనమ్మా
గచ్చులాడి నాపై పశి - గల్పించెగదమ్మా
మచ్చుజల్లి నాదువిభుని - మనసు విరచెనమ్మా
వేణుగోపాలునికిది వేడుకాయె నమ్మా
జాణననుచు గూడి నన్ను - జాలి బెట్టెనమ్మా (ప-44)

అనుప్రాస పదమంతటా కలదు :

ఏరా యేరామా బోధింప
రారా రా రాపూసేయ వ
ద్దూరా దూరాన నిలుచుందురా – నీపదిరా నడి
చేరా చేరా రావేసుందురా॥

నిన్నా నిన్నాడు కొన్నది
విన్నా విన్నాణ గత్తెను
కొన్న కొన్నపతకమిత్తురా – సేదాకిత్తంటే
చిన్నచిన్న పనులు మెత్తురా॥
వద్దావద్దా రావుయొక్క
పొద్దా పొద్దాయనే యిట్లా
కద్దా కద్దాచెలితో ఆటలు – యేపేయిదే
రద్దా రద్దాయ నీమాటలు॥
కానీకానీ నీబోటిసత
మానీ మానితివి దయ
రానీ రానీదు మాయింటికి అది జెప్పినట్లు
పోనీ పోనీదు పొరుగింటికీ॥
ఇందు యిందు ముఖులు మెచ్చ
ముందు ముందుగా గూడినా
యందు యెందుకింత కోపమూ – వేణుగోపాల
సందు సందుల ప్రస్తావమూ॥ (వ–20)

యమకాలంకారం చక్కగా కుదిరింది.

పల్లవి : ఏరమామణి బోధవింటివి
ఏరమాటాడవు నాతోవక
అను : వీరమా మణిమణి వేడితె గం
ధీరమా వేణుగోపాల ॥ఏరమా॥

మందు రాచినదేమో యికనే - మందురా దాని యింట
విందు రాతిరి జోసేసితివట - విందురా చెలులు
సందురా నవ్వేవారికి మన - సందురా నీకు యేలా
గుందురా రా నినుజూడక నామది గుందురా సుందరాకార ॥ఏరమా॥

మెత్తురా నాపేరంటె శివ - మెత్తురా చెలికి ఇటుచను
వి త్తురా కాపురాల - విత్తురా నాసామి
ఇత్తురా ఒకనాటికి మొలతా - యిత్తు రాచ్చలకే మరి యెడ
మిత్తురా మునుపటి దయరా నే - మిత్తురా వుత్తరవ్వేలేల ॥ఏరమా॥

ఏలరా దానిగూడి నటువలె - ఏలరా నన్ను నేగుణ
శీలరా నీవా చెలికెంతన శీలరా చలము
చాలురా వెలదికి రేపేనా - చాలురా అది జెప్పిన మాట నె
పాలురా కలిగినదంటే కో - పాలురా మేలురానీకు
॥ఏరమా॥ [వ-13]

ఇలాగే :

పల్లవి : ఎంత దుడుకుజేసెనే - ఓ భామా న
నెంత దుడుకు జేసెనే

అను : ఎంత దుడుకు జేసే - నెవరితో దెలుపుదు యీ
వింత కార్వేటి నగర - వేణుగోపాలరాయు ॥డెంత॥

గంటీలు బెట్టి వాలు - గంటీ నామోవి పలు
గంటీలు జేసిన త్రాణ - గంటివేమే
యొంటి పాటున యిటు - వంటి పనులయితే ర
వ్వంటికమ్మ చెల్లనా - వంటి దానిని రాతి ॥రెంత॥

అక్క వినవే వాని - అక్కర బంగారాయ
అక్కరలేదు పొమ్మంటె - అక్కసుతో

చక్కెపోయ్యేవా యని - చక్కని నా గుబ్బలు
చక్కగా బిగబట్టి - చక్కెలైన్నో జెప్పుచు ॥ఎంత॥

పట్టు చీరకు వక్కి - పట్టు వరహా లయిదు
పట్టుమనుచు నాచై - పట్టుకొని
కట్టుకొంగున మూట - గట్టుకోవే యని యి
కట్టు గూడిరా - కట్టు వుంగరమిచ్చి ॥ఎంత॥ [ప-14]

ఇలాగా రకరకాలుగా శబ్దాలంకార ప్రయోగం పదాల్లో చేసి తన ఘనతను, ప్రతిభని ప్రకటించాడు సారంగపాణి.

## 2 8 2 అర్థాలంకారాలు :

శబ్దాలంకారాలతో పాటు వివిధార్థాలంకారాల్ని ప్రయోగించి తన పదకవితకు శోభ చేకూర్చుకొన్నాడు సారంగపాణి, వాటి మూలంగా సహృదయ పాఠకులు ఆనందపరవశులు కాకపోరు.

**ఉపమ :**

"వీణెలు మీటుచును - ఒక్కరికొకరు
జాణతనము లాడుచును
మాణిక్యమువంటి - మగువ నిన్నేలిన
వేణుగోపాలుడా - వెలదిగూడినగాని" [ప-31]

"దోసకారిపోవే యతడీ - త్రోవ దొక్కనా - వూరకె
ఆసుబోసిన కోవివలెనే ఆడకు యీడకు
తిరిగేవు మాత్రమె" [ప-37]

"తలిరాకువంటి పాదము లొత్తుచుండగ
అలసితివని నీతో అన్నదైన కద్దా
తలపురాదుగ యిసుమంతైన నీమదికి యీ
గెలకల పంచమే చెలువు డిచ్చె నీకు" [ప-72]

"పొట్టివాకున శాలువ ముసుకు బెట్టుకొని పిళ్లారయవలె
పెట్టాడించు కొంటు మంత్రుల చుట్టు తిరిగి నట్టేగాదు" [ప-90]

రూపకం :

"కరుణ చేతను కోరి మోహించియా
కనకాంగి నినుజేరి మఱిమఱి తమిమీఱి
విరహ భరముచే తరము గాక తారీ మరులూరీ
తరుణి గురుకుచగిరుల నురమున
నొరసి మురిసిన సరస మెల్లను
మరచి వత్తుర యేర యాదారి ఓరోరి" [ప-62]

"కన్నెరో విరహాగ్నిచేత
కరగి మేను సగమాయనే" [ప-73]

స్వభావోక్తి :
"తల మొలకడ నెల్ల నరసిపోయె
దగ్గి దగ్గి హీనస్వరమాయె
పిలచినాను చెవ్వి విన రాదాయె
బలము వుడిగి తప్పటడుగు లాయె

రాత్రైతే రేచీకటి గదలడు
రమణి నీబిగి కౌగిలి వదలడు
మూతిమీద బట్ట యేమారడు
ముష్టి వకరికైన వేయనీయడు" [ప-108]

అర్థాంతరన్యాసం :

"పల్లవి : చండితనము జేసే - సరసిజాక్షితో యిట్లా
సరసాలు సేయకురా - ఇనా

అను : కొండ ద్రొవ్వేలుకను బట్టుదురా వేణు
గోపాల నేనంటే - కోపాలాయే వేళ ॥చండి॥

ఎక్కడలేని మోహముతో దాని - పక్కజేరి పాదములంటితే
గ్రక్కునలేచి చిడిముడి పాటున - గద్దించి పలికేనుగా
మక్కువతో నాకుమడుపు లీయబోతే
నక్కరలేదని యావలి మోమాయె
ఇక్కల సంతోషమనుమాట నిజమాయె
చక్కిలి గింతలు చత్రాతికి గలదా॥
రాతిరీవు గుజరాతి ముత్యపుసరులు
చేతికిత్తా మని ప్రీతితొ బిలచితె

ఘాతకురాలు గొణగుచు నీ మీద - కండ్లెఱ్ఱ జేసెనుగా
పాతకురాలు నీబంపిన పైడి - పట్టేదేలేదని యానలిడుకొనె
చూతామనుచు సన్న వేతామాయంటి
యీతాకు రాలున యే యాకు రాలిన
ఉయ్యాల మంచముపై నిన్నటిరేయి
పయ్యెద తొలగించి పణతి నిద్రించగా
చయ్యన నీవా సమయాన బలిమిని - సమరతి గూడగనూ
అయ్యెడ తెలివొంది అధిక కోపమున
గయ్యాళి తన వామకరమున నెట్టించె
నెయ్యము సేతుర నెనరులేనిచోట
కొయ్యబొమ్మను చేర కోరికెలిచ్చున. ॥చండి॥ [ప-38]

"పల్లవి : పొడుగున గూర్చున్నానని మిట్టిపడి వెర్రి
పోకలేల పొయ్యేవే నీవు

అను : గుడిసెవా పైనది నడితిలో నిజమాయె
ఘుడుపు లేక సుకవిజనుల నావల గదిమి ॥పొడుగు॥
అందగత్తెవో లేక హాయిగ పాడేవో
సుందరి అభినయ సురతవో నీ
యందేల రవశేవక్కెందుకు కొరగావు
పందెంత బలసిన నందితో సరిబౌనా ॥పొడుగు॥

బెట్టుగా ఒకజతికి పేరిణిదొక్కేవా
గట్టిగా చదరంగము జూచేవో
బట్ట దబ్బెలోని పసయాడవట్టిదే
పట్టుగూర్చితేనె పైజారు మడికౌనా ॥పొడుగు॥

కోడిగాల వేణుగోపాలు గూడేవో
పోడిమైన కథల ప్రొద్దుబుచ్చేవో
నేడుక్రొత్తదే చిన్నాడే నిన్నెరుగనా
కూడు గలిగితేనే కక్క గోపిదేవౌనా ॥పొడుగు॥" (ప..111)

అర్థాంతరన్యాసాలంకారం ప్రతిచరణాంతంలోను ఉంది.

లోకోక్తి :

"పల్లవి : వంచనలకు గురుపీఠమురా యీ
చంచలాక్షి యనగా

అను : మంచిదికదా యంటివి యిక పలు
మాటలేల వేణుగోపాల ॥వంచన॥

కండ్లుతేలించి కులికినవ్విన
కౌగిలించినా పువ్వుల
చెండ్లుదెప్పించి శిఖను జుట్టిన
చెక్కిలి నొక్కినా

గుండ్లపేరు నీకు కానుకిచ్చిన
గుసగుస లాడినా
ముండ్ల మీది విలువ సామ్యమేగా
ముదిత వలపుతిన్నగ దెలిసీసీ ॥వంచన॥

అడుగులకును మడుగులు తాపరచిన
హారతులిచ్చినా – కర్పూర
వీడెము సేయమని లాలన వీణెమీటినా
గడియకొక్క వింతసొగసు జేసిన
గంధము బూసినా
వుడుము కలుగులోని చెయ్యిసామితె
యువిదె నెనరు తిన్నగా దెలిసీసీ ॥వంచన॥

మూతిసాచి ముద్దిమ్మని కొసరిన
ముచ్చట జెప్పినా తన
చేతవిరుల సురటిబూని విసరిన
చేలాగిచ్చిన
రాతిరి నీమనసు రంజిలగ రతులగూడినా
కోతిచేతి మాణిక్యము సామితె
కొమ్మమనసు తిన్నగ దెలిసీసీ ॥వంచన॥" (ప-56)

వ్యాజస్తుతి :

పై అలంకారాలన్నింటికంటే చాలా మనోజ్ఞంగా తనప్రతిభ ప్రకటిత మయ్యేలా వ్యాజస్తుత్యలంకార ప్రయోగంచేశాడు సారంగపాణి. ఈవ్యాజ స్తుత్యలంకార ప్రయోగంలో ఏశతకకర్తకీ తీసిపోడు సారంగపాణి. పై పెచ్చు పోతన కొన్ని సందర్భాల్లో అత్యంతభక్తి ప్రపత్తులతో చేసినట్లీతడు ప్రయోగించడం మనం గమనించవచ్చు.

"పల్లవి : నీకేసమ్మతికాని యిటువంటి నడతలు
మాకెవ్వరికి సరిపోదయా

అను : తాకనాడిరని తప్పులెంతురనీ వి
పేకానికి మందు వేణుగోపాలా ॥నీకే॥

అబ్జముఖులు పదహారు వేలుండగ
కుబ్జను మరుకేళి గూడితివి ॥నీకే॥

మొలను పీతాంబరము చెలువొందుచుండగ
ఆలగోపికల చీరలందితివి ॥నీకే॥

పాలకడలియందు పవ్వళించియుండి
బాలుడై యశోదగ బ్రాకితివి ॥నీకే॥

తేజోరాశియైన దేవుడవైయుండి
రాజీగ నరుని సారథివైతివి ॥నీకే॥

వాటమైన పరమపదము వదలి కా
ర్వేటి నగరమున వెలసితివి ॥నీకే॥" (కీర్తన-163)

ఇంతకంటే మనోహరంగా పొడిపొడిమాటలలో నిందాస్తుతిచేయడం సారంగపాణికి చేతనౌతుంది.

"పల్లవి : నీవారి నడతలన్నియు - నేనేమెరుగనా

అను : భావజనక వేణుగో - పాలా నాతోదాచితేనే ॥నీ॥

తల్లి నిన్ను రోలగట్టె తండ్రియావుల మేపబంపె
యిల్లాలు సడ్డసేయక - యిల్లిల్లు విహరించసాగే ॥నీ॥

అత్తగారు నరనాథుల - కందరికీ పొత్తులబాయ
ఉత్తముడా మీయన్ననాగే - లెత్తుకొని తిరుగులాడె ॥నీ॥

కోడలందరి నోళ్ళనిలచె - కొడుకు తలగొట్లమారాయె
నాథేని సోదరి యొకసన్యాసి నంటుకొనీజరిగె ॥నీ॥

కూతురు పారుబోతాయ - నీతిదప్పి నడిచేనుమరిది
భూతేశుడైన మీబావ - చేతగాక బిచ్చమెత్తె ॥నీ॥

హింసకు వెరువని కాల - కంసుడు మేనమామ నీ
సంసార మిటువంటిదయ్యో - స్వామి వేణుగోపాల ॥నీ॥"
(కీర్తన-164)

"పల్లవి : ఎంతపేదవాడే - వేణుగోపాలు
డెంత పేదవాడే -

అను : అంత పేదగాకుంటె - అలనా డా కుచేలుని
అటుకులకు చేసాచునా - ఓచెలులార ॥ఎం॥

పంచమంచమెయుంటె భావజనకు డీ
పాముపై నిద్రించునా
అందపేరేయుంటె అచ్యుతు డాదనుజానీ
అవని దానమడుగునా
వుండనిల్లేవుంటె పుండరీకాక్షుడు
యుదధివాసముజేసునా ఓచెలులార ॥ఎం॥

కట్టవస్త్రతోమెయుంటె కంసవైరి గో - పాం
గనచీర లాశించునా
గొడ్డుబడక యుంటె గోవిందు డీగతి
గోవుల తా గాచునా
పొట్టనిండితె శౌరి పొరుగిండ్ల జొరబడి
పొంచివెన్న ముచ్చిలునా ఓచెలులార ॥ఎం॥

పరిపాటి వాహనమే ప్రద్యుమ్ననికేవుంటె
పక్షినెక్కి తిరుగునా
దరిపేరేవుంటే శ్రీధరు డనిశము నిజ -
దాసులవంచ జేరునా

గురియైన సాయకమీ మురవైరికే యుంటె
గరికె పోచబట్టునా ఓ చెలులార ॥౨౦॥ [కీర్తన-173]

## 2.9 లోకజ్ఞత :

వర్ణనాత్మకమూ, ఆలంకారికమూ అయిన శైలితోపాటు లోకజ్ఞత కవిప్రతిభకు నికషోపలం లాంటిదనడంలో సందేహంలేదు. ఇలాంటి లక్షణం సారంగపాణి పద కవితలో స్పష్టమవుతుంది. కవికిగల వ్యుత్పత్తికి శాస్త్ర విజ్ఞానంలో ఒక భాగమైన లోకజ్ఞత వన్నెగూరుస్తుంది. అలాంటి లోకజ్ఞత సారంగపాణి పదకవితలో అడు గడుగునా అగపించి పరమానందపరవశుల్ని చేస్తుంది; అది ఆతని కవితలోని విశిష్టత. శృంగార పదాల్లోను అంతకంటె దేశీయ పదాల్లోను, అంతకంటె జాతీయ పదాల్లోను జనజీవన విధానాన్ని చక్కగా వర్ణించి లోకజ్ఞతను సుస్పష్టం చేశాడు సారంగపాణి. సమకాలిక సామాన్యులు మొదలు రాజవంశీయుల వరకు, వేశ్యలు మొదలు పలు తెగల, జాతుల, వర్ణాల వాళ్ల వరకు సమస్త సమాజాన్ని సముచిత రీతిని తన పదాల్లో వర్ణించాడు సారంగపాణి. పండగపబ్బాలు, సంతజాతరలు, తిరుణాళ్ల తెప్పోత్స వాలు అన్నిరకాల ఉత్సవాల్ని చక్కగా చిత్రించాడు తన పద కవితలో. తినేతిండి, కట్టేగుడ్డ, ధరించే ఆభరణాలు, వస్త్రాలు, ఉండే నివాసం సునిశితరీతిని వర్ణించ బడ్డాయి. వివిధ మనః ప్రవృత్తుల చిత్రణ ఇందులో ఉంది. ఇలాగా సమాజం యావత్తూ అద్దంపట్టినట్లు ఈతని పదాల్లో ప్రతిబింబించింది. మరి సాహిత్యం సమాజ ప్రతిబింబంగదా !

### 2.9.1 వివిధ వస్తుపరిజ్ఞానం :

రాగాల పేర్లు :

పల్లవి : ఈ సీమల హరిణాక్షులవలెగా - దీమోహనాంగి

అనుపల్లవి : కాశీపురి నుండివచ్చెనదీ - కళ్యాణి వేణుగోపాల

కన్నడ సేయక నీదరబాయ
గాచియున్నది నాటనుండి

అన్నె మెరుగననియా హరిపాదము
లాన బెట్టెరా
వన్నెలాడి బహుళా నాతో దన
వద్ది కీక్షణమే తోడి తెమ్మనె
నెన్న నొకరి తరముగాదు సామజ
యానతీవి గుజరిపడచనదగు ॥ ॥చ॥

పంచమశ్రుతిని తంబుర మీటి –
సంచుగా పాడి సారంగ
పంచిపెట్టి నటుల వినికి చేసే
ప్రౌఢ నాయకీధా
వంచన యింత లేకను బలుమారు
వనిత గౌరీపూజ సేయు చున్నది
పంచసాయకుని సేనల రాకకు
భయము జెందనదె వచ్చెవరాళి ॥ ॥చ॥

శ్రీ మీఱ చెలువొందు చున్నది –
రామామణి రంగుమీఱ
కామించి వచ్చెననుచు నీ వింక
కా బిరుదు లీరా
ఆ మానిని కెంతో నీపై అసా
వేరే పని తోచదు
నా మాట విని యేలుకోర అభినయము
నాట్యమతివనేత లలితము ॥చ॥ [ప–1]

"పల్లవి : కన్నతల్లి కరుణించి బ్రోవుమిక
నన్నేదని మనసా పే రెంచక

అను : సన్నుతింతు నరుణాద్రిపురి వెలయు
సాంబశివుని ముద్దు మోహనాంగి
శాంతరూపి శరదాదు కళా ధరి
చండ భైరవి త్రిశూలిని
సంతోషముగ ముద్దుగా నభీష్ట మొసగు
సన్నుతాంగి సాధుపోషణి
పంతముగను రంభాదికాంతలు
పంతువరాళి పదచాళిని
వింతగాను కొలువుండు వేళలో
వేడ్క మీర నానందభైరవి ॥కన్న॥" [కీర్తన-21]

స్వరస్థానాలు :

"పల్లవి : దాని ప్రాయము పదారేండ్లు నీ – దానినేలుకోరా

అను : సానిధా పనికి హొంతకారి – సామి వేణుగోపాలరాయ॥దాని॥[ప-2]

కొమ్మలపేర్లు :

"తరుణికేపని దారబోసి వచ్చెనె మద – దంతికొమ్మా ఎంతో
మురిపెము లేకనే యిచ్చిన మరువంపు – మొలకకొమ్మ॥" [ప-3]

మందులపేర్లు :

"పల్లవి : ఆవాలుగంటి మాటలతని కతిమాధురమాయె
నన్నింత మోడిసేతురా

అను : రావే యూరక పాద – రసమువలె తిరిగేవు
భావము దెలిసి యి – ప్పటి కోర్చుటేబాగు॥ ॥ఆవాలు॥ [ప-4]

ఖౌప థాలపేర్లు :

పల్లవి : వర కన్యాతిలకమీ - వనితపేరు దీని

అను : పరికించ వేణుగోపాల నాసామి॥ ॥వరకన్యా॥

పొలతినెమ్మోము సం - పూర్ణచంద్రోదయము
అలకాళి రుచి వినోదాంజనంబు॥ ॥వరకన్యా॥ [ప-7]

ఆభరణాలు :

చిలుకలతాళి (29), ముత్యముముక్కర (71), అందెలు, మెట్టెలు, దుద్దులు (138), ఇత్తడి కమ్మలుంగరాలు (154), భన్నసరము (93), ఉంగరం, గుండ్ల పేరు, (89) బేసరాలు, వజ్రమణుల కమ్మలు, వేలి వుంగరాలు (107), రేగడిబిళ్ల (122), తాళిబొట్లు, పచ్చల మొలనూలు, వేలివెండిచుట్లు, చేకట్లు, పతకము (79), వెండిమెట్టెలు (37), గుజరాతి ముత్యపు సరాలు (38), చీటిపాటి సొమ్ములు (107), రవల బందరు కమ్మలు (118).

వస్త్రాలు :

నారాయణవనముచీర, (121), మొగ్గల పనిచీర (71), బందరు పావడ, పిల్లడుగుల చీర (139), మల్లచీర (16), పావడ, రవికలు (107), కరకంచు చీర (37), మునిమడుగుల రవికెలు, మూడు కొంగుల చీరలు (88), మట్లువారిసీమచీర (15), కండెచీర (93), వట్టుచీర (90), పచ్చనికమ్ములచీర (26), వారవప్పళి చీర (29).

ఆయావస్తువుల్ని పదాల్లో చేర్చి రచించినప్పుడు ఏవిధమైన అనౌచిత్యమూ రాలేదు; పదసారస్యంగాని, మాధుర్యంగాని చెడలేదు. ఇవి సారంగపాణి పదరచనా నైపుణ్యానికి, లోకజ్ఞతకీ చక్కటి నిదర్శనాలు.

రకరకాల రోతల్ని ఈకింది పదంలో వివరించి స్వానుభవంతో లోకజ్ఞతని ప్రకటించాడు సారంగపాణి.

పల్లవి : పాపాత్ముని ధర్మాధికారిగా
బంపే దొకరోతా ॥పా॥

అను : కోపముజేసే నరనాథుకొలువు
కొలచే దొకరోతా – ఛీఛీ
వలసినభాగ్యములుండి భుజించని
వాని కలిమిరోత – యింట్లో
కులకాంతలు వుస్సురనగ వేశ్యల
గూడే దొకరోతా – ఛీఛీ ॥పా॥

జారస్త్రీగర్భంబున సుతుడై
జనియించుటరోత – ధరలో
వారకయాచకవృత్తిని దిరిగే
వాని బ్రతుకు రోతా – ఛీఛీ ॥పా॥

పుట్టి నింటననవరతము భార్యను
బెట్టేదొకరోత – వగజెడి
పట్టెడుకూటికి చుట్టాలకడప
మెట్టేదొకరోతా – ఛీఛీ ॥పా॥

హీనుని పంచమహాత్ములు గాచుట
యెంత తగనిరోత – తన
మానినివద్దకి నన్యపురుషులను
మాట్లాడుట రోతా – ఛీఛీ ॥పా॥

తాపసియై అరిషడ్వర్గంబుల
తగిలేదొక రోత – వేణు

గోపాలుపదములు నమ్మియుం
గోపి యగుటరోతా - ఛీఛీ ॥పా॥ (కీర్తన-174)

వివిధ వ్యక్తుల స్వరూపస్వభావాల్ని చిత్రించాడు :

"పల్లవి : వారివలె చక్కనివాడై తే
చేరని త్తువు - నిజమైతే

అ. ప : సారెకు దొరగండ్ల జూచుచు
కూరిమితో నిన్ననుభవించే ॥వా॥

మీసా లెరుపా చేతులు తెలుపా
మీనాక్షయ్యవలె రొమ్మున
నీసాక్షిగ వీపున గూనా
వ్యాసాచార్లవలె నేమైన ॥వా॥

పండ్లుపొడుగా మెడలోకణితా
పాపాపిళ్ళవలే అవటి
కండా పావపుచెవ్వడ బోయ
కదిరిగానివలె నేమైన ॥వా॥

దూడాకడుపా తిరువళ్ళూరి
ఆడిగానివలె ముక్కు
నడ్డా తలవణుకా మరగుజ్జా
నల్లపరెడ్డివలె నేమైన ॥వా॥

నత్తా యిప్పుడు వచ్చిని సారాయి
సత్త వనమరునువలె మూగచే
కొత్తచీర రాతిరి తెచ్చిన
కోమటిబోడివలె నేమైన ॥వా॥

పదయక నినుగూడిగదా యెగ
తాళి సేయవలే యింతకు
పదతిరో వేణుగోపాలుని
పద్దుచెల్ల వలె నేమైన ॥వా॥ [ప-139]

ఇలాగే తుమ్మికూర, ఉసరికాయలునమలడం, మోపెడు కసువుగోయడం, పళ్ళలోని ఎంద్రకాయలు, భూమినక్కలగూర్చిన చాలావిషయాలు తెలిసినవాడు సారంగపాణి. వీటినిచక్కగా "బారుబూరుమని పరుగులెత్తితేనిచట

.... .... .... .... .... ....

భామరో వేణుగోపాలరాయని గూడి" [ప-121] లో వర్ణించాడు.

కరువునిగూర్చి ఈతడుచేసిన "అచ్చయ బుట్టింది ........." [ప-142]లోని వర్ణన ఇతనిలోకజ్ఞతకు నిదర్శనం.

## 2.9.2 సాంఘిక స్థితిగతులు :

ఆనాటి సమాజస్థితిగతుల్ని చక్కగా అభివర్ణించారు సారంగపాణి. వాటిలో కొన్ని ఈనాటికీ సత్యాలుగానే ఉన్నాయి.

"కూనలమ్మకు పేటగొట్టనా నిన్ను

గూడితే పొంగళ్లబెట్టనా" (ప-76). ఇందులోని పేటగొట్టడం, పొంగళ్ళు బెట్టడం ఈనాటికీ ఉన్నాయి. గంగజాతర మొదలైన క్షుద్రదేవతారాధనల్లో ఇవి సామాన్యమే. తెనాలిరామకృష్ణుడు పాండురంగమాహాత్మ్యంలో 'గంగజాతర' నభివర్ణించి కృతకృత్యుడైన విషయం తెలిసిందే.

కలిమిలేములు ఈక్రిందిపదాల్లో చిత్రితం :

"తల్లి పేరుజెప్పి పుల్లనికూట్లోళ్ళ
కిల్లిల్లు దిరిగేపుఇది మానమా

నల్లనావుల పాలుకొల్లె మీమందలో
చెల్లబో చలిపేళ చై వెంటజారగ" (ప-87)

"కోళ్ళు గుడిశంతాపోయి చుట్టు
కొల్లారింఢ్లాయ నులక
తాళ్లా నల్లులకుక్కి వదలి
కీళ్ళ కుంచమాయె." (ప-93)

తనకాలంలోని వక్కలాకులు, పొగాకు, సుగంధద్రవ్యాలు, వస్త్రాలు మొద లైనవాటిని అభివర్ణించాడీ కిందిపదంలో :

ప : నిష్కర్షగా రాత్రికొచ్చేవాడవై తే
నిష్కాలు గొంచురారా నేనా

అ. ప : ముష్కరి వినను యీతుష్కప్రియాలు తు
రుష్కాలు దిగివుండే లష్కరులోనుంచి ॥నిష్కర్ష॥

దండిగపొవ్వాకు రెండువీశల వక్క
పండుటాకుల ముడియ పాలకావిళ్ళు
కండశర్కర దుత్త కౌజులబుట్టలు
మెండజారగానే యెత్తించుకొనినీవు ॥నిష్కర్ష॥

పూలుగంధము బుక్కపునుగు లవంగాలు
యేలక్కాయలు తులమెత్తు జాపత్రి
పాలుమాలేవు దీపానికడ్డెడు నూనె
యీలోబంపించి నీవింట్లోనె భోంచేసి ॥నిష్కర్ష॥

మునిమడుగు రవికెలు మూడుకొంగులచీర
దినుసువారి పప్పు తేటద్దమూ
పనిబూని వేణుగోపాల సాగించుక
నను రతిగూడి ఆనందమొందుటకు॥ ॥నిష్కర్ష॥ (ప.98)

తననాడు సైతం లంచగొండితనం ఉన్నట్లు, ఆ లంచగొండితనాన్ని, తనసతి సంపాదనపై ఆధారపడే పద్ధతినీ, అన్యాయరీతిని ధనమార్జించేవిధానాన్ని సారంగపాణి మిక్కిలి ఖండించాడు.

పల్లవి : ధర్మకార్యముల కడ్డము నిలిచే
దబ్బిలి దొక బ్రతుకా – శుద్ధ

అను : నిర్మలాత్మకుల మది నొప్పించే
నీచుల దొక బ్రతుకా – హరిహరి ॥ధ॥

మగనికి వంచన జేసి భుజించే
మానిని దొక బ్రతుకా సభలో
తగ వారిని లంచముగొని మెరిగే
ధగిడీ దొక బ్రతుకా – హరిహరి ॥ధ॥

తన సతిసంపాదన కాసించే
మనుజుని దొక బ్రతుకా – గురుపుల
మనమున దలచుచు పూజింపని యు
న్మత్తుని దొక బ్రతుకా – హరిహరి ॥ధ॥

న్యాయరీతిగా ధనమార్జింపని
నరపతి దొకబ్రతుకా – కలిగే
హాయిగ తాదిని యొకరికి బెట్టని
యధముని దొకబ్రతుకా – హరిహరి ॥ధ॥

తలిదండ్రుల బుద్ధులవిననొల్లని
తనయుని దొకబ్రతుకా – ఒక్కరి
బలిమికలిమిజూడగ సైచని ని
ర్భాగ్యుని దొకబ్రతుకా – హరిహరి ॥ధ॥

తాపత్రయముల నంటించుకొనే
తపసిది యొక్క బ్రతుకా - వేణు
గోపాలుని భక్తులదూషించే
కొంచెపు దొక్క బ్రతుకా - హరిహరి ॥ధ॥ [కీర్తన176]

వేణుగోపాలుని ఉత్సవ విగ్రహం ఊరేగింపు వస్తూండగా ఆనాటి ఆనందోత్సవాన్ని, భక్తిని సారంగపాణి క్రింది పదంలో చక్కగ వర్ణించాడు.

"పల్లవి : కదలివచ్చెను జూడరే - వేణు
గోపాలుడు కనులపండుగ గాను

అను : పదిలుడై గరుడునిపై నెక్కి భక్తుల
ముదమండజేయుచు ఇదిగో రాజ మార్గమున ॥క॥

సురలు నుతింపగను వేదము లవనీ -
సురులు పఠింపగను
ధరణీశు లతిభక్తి -
తను సేవింపగాను
సరసీజాక్షులు నాట్య -
సరణి నభినయింపగాను
పగలు వత్తులు వెలుగగా -
ఛత్రచామరలు ॥క॥

వాణ విద్యలు మెరయగా
మృగ మదతిలకము -
మోము కళలూరగ
పగగా కీర్తన భాగ
వతులు పాడుచురాగా ॥క॥

భేరిదుందుభులు మ్రోయ -
వంది మాగధులు
చేరి హెచ్చరిక సేయా
వారణ వాయములు
వరుసగుంపులై డాయ
మీరి సంతోసమున
మింట చందురుడుగాయ [కీర్తన-170]

కరువుకాటకాలు, ఆసమయంలో వివిధవ్యక్తుల మనస్తత్వాలు అభివర్ణించాడు.

పల్లవి : అచ్చయబుట్టింది భూమికి బలుశబ్బ
రైణా దానమ్మసోణిదీ సూడెం

అను : పచ్చినూకలు నేలా
బడితె యిదీనెబ్బదేలు
బిచ్చగాల్ల శేశిడిశ
బిరుదు బంట్ల నీతూరి ॥అ॥

మందలుగదిలె పరమటిశీమ కెగబడి
కందులేశిరిగా శెక్కబ్రూక్కు
పదేశి అందులో సాంకో లేకమ్మెశిరేబిదల
కుందనంబుపైడి కూట్లిల్ల కిలబోయె ॥అ॥

శెట్టుమీది పచ్చులట్టు తలేలేశ
మట్టుదొంగలు వగతట్ట గ్గిదేర
గట్టిగా బీదోల్లకు కలబందేగా కూడు
బట్ట మరకేడదిప్పటి యాడమాసులకు ॥అ॥

ఆలుమొగడు గూడేదది వోలొ బిగురేగి చం
సాలా పుడకాడించె సప్పంనారాగాలు
యీలోనాయేనుగోపాలుని దయసేత
కాలువరసము గురిశ కరువు దెలిశగాక ॥అ॥ [ప-142]

ఆనాటి తెప్పతిర్నాళ్ళవేడుక, వినోదాలు వ్యావహారికంలో చక్కగా అభి వర్ణితం.

"పల్లవి : నగరాన తెప్పతిర్నాల్ల యేడికె
సూన్నవాగు నివురాలేదంటె - అపిడె" [ప-147]

'అగ్గితిరునాళ్ళ'ని నిప్పుతిరుణాళ్ళు అంటారు. దీన్ని "కృత్తికానక్షత్రోత్సవం" అంటారు రజనిగారు. 'అగ్నిగుండం' ఏర్పరచి తమభక్తిప్రపత్తుల్ని వ్యక్తం చేసి లగుండాల్లో భక్తులు దిగివెళ్ళతారు. అగ్నిబాధ నిజమైనభక్తులకు ఏమాత్రం ఉండదు దీన్ని 'అగ్గితిరునా'ళ్ళనడం వాడుక. తన కాలంనాటి అతిరునాళ్ళను ఎంతో చక్కగా పామరజన వ్యవహారానికి తగినరీతిని వర్ణించాడు సారంగపాణి.

"పల్లవి : అగ్గితిరుణాలంట అజ్ఞాని కతలంట
అవురా యెంత సోద్దెమే
బారతకత - ఔరా యేన్నెన్నింతలే

అను : సుగ్గిజయము దీని మట్టు బలాదూరు
అగ్గురోరపు అయ్యోర్యెడిగె నీ సాచ్చిగ ॥అ॥

యిగనేసు పయినెక్కి యీటీసమూ దొచ్చి
బిగు పేగ్గెలెన్నెన్నో - బలికి దుశ్శాసూని
మొగము చూడగానె - మొర్చనాయాలత్తొ
గుగురు మిగురనకుండ - గుద్దెల్ల గుక్కెనె ॥అ॥

అనుపం తెనకటోడు - అబిమన్ను డెంటనె
సనియునోలె బట్ట - సాముశెయుచు అట్టె
యినయె యీరబద్రుడు - నిసనకాయలు దొక్క
కనురెప్పే శేతల్కి - కర్ణుని శించనె ॥అ॥

యిరన్నేచ్చు చడ్డకు - డింద్రజత్తోకరెయ్యి
దురివోదముని శెయిలో - దూరిముక్కునవెల్లి
అరశిపిసాశోలె - అశ్వద్ధామను మింగి
సురివోదమాయనే - సూతయేడి గున్నే ॥అ॥

బేరి బూరుగలింట - గారదేవల మొద్ద
యీరపతిమెక్కు మొక్కి - యిటు తలె త్తేతల్కి
మారుబాసోమెకడు - మొలతి త్తోదిలించుకొని
శారెడై దీ శెడిదొ - జనుల కిచ్చేనే నిపు ॥అ॥

తేనీగ గుములోలె - తెందె తెందెగపంజ
కోన చముద్రంగుంట - కొనసునల్పడి సూడె
నానాదించింగల్లె - నానారం చంతోలె
యేమగోపాలుడు - యెటుల గాయించెనె [ప-153] ॥అ॥

ఆనాటి సంత, సంతలో గల నానాదినుసులు వర్ణితం.

"పల్లవి : నాన్నారము చంత్లో నానాదించుందెంట
నయముగిచ్చేరంటనె - సూడే

అను : ఈన్నే పొద్దెక్కనే - యీదేడుండా - దెంటె
కోణ్ణి గొండపోతె - కొందురే వొగురైన ॥నాన్నా॥

ఇలనేత సూల్లెడె యీసుల్లె మగ్గవే
పలుగుశాపలాడ మస్తంటటె

తల యొంటికెతాళ్లు నిలువుపొడుగై య్యానే
అలసొచ్చే తత్కిడ అంబలొండుండెరే ॥నాన్నా॥

అమ్మెరంటి త్తలి కమ్మలుంగరాలు
దెమ్మనిస్తి శీల్లుతిమ్మశాతా
కుమ్మరక్కదోట గురువు అగు మూడెల్మిచో
చొమ్ముగ సూడాలే చోద్దెంగుండాలె ॥నాన్నా॥

మోదోల్ల శీన్నెంగు మెట్టెల కంటొచ్చి
ఏడిదోచలు తిన్నోరెండుకొని
ఆడనీల్లు దాగి అగ్గెలేసురుకెత్తె
సూడలే దేవుల్ని సూడ యేడిగున్నె ॥నాన్నా॥

అబిడిప్పటి కీదు లెంతచింగారమే
నబురు కొక్క మోలు నాన్నెముగా
పెబువే గాయించెనో బెమ్మెని మించెనో
నుబిలమైయుండు యీ సూని దీయనిశాతా ॥నాన్నా॥

కాశి పొడుగెతికిన కలదా యీ గోపిరం
యెశశీలు గుల్లో యెగిరేరేమొ
వోశయ్యోర్లు గుములైవా పొయిరే చిలపెద్ద
పాశపుకూడే గోపాలుని దయశాత ॥నాన్నా॥ (ప-154)

ఆనాటికులకాంతలు వెలయాండ్రలాగా చెలరేగి నలు దిక్కులకు పారిపోయిన రీతినివర్ణించి, వేశ్యలకు జీవనమేమని వాపోతున్నారు సారంగపాణి.

"పల్లవి : కులకాంతలు విడిబడి నలుదిక్కుల
చెలరేగి రిదేటిపాపమో అయితే

అను : వెలయాంధ్రకు జీవనమేమిక శ్రీ
వేణుగోపాలా సంకరమై ॥కుల॥

ఉగదెలియని బిడ్డలనెడబాసి
వున్నమూల ముంతదాటవేసి
పగనిపేరు కారాదాదని రోసి
మన్నెకాపురము వ్యర్థముజేసి ॥కుల॥

అందెలు మెట్టెలు రవికెతోజుట్టి
అత్తమామలకు దుద్దులుబెట్టి
బందరుపావడలో సద్దిగట్టి
పట్నము జూతామని భ్రమబుట్టి ॥కుల॥

పిల్లెడుగులచీర యెత్తికట్టి
చల్లపగ్గ మొకచేతబట్టి
ఒల్లె యూడ్చినడుముకు బిగజుట్టి
నల్లశాజిన్ నిండుముసుగుబెట్టి ॥కుల॥

తలిదండ్రుల మదితల్లడబెట్టి
తమజాతుల కపకీర్తిజుట్టి
తలపరాని నిందెల కొడిగట్టి
ధర్మశాస్త్రముల రోచికబుట్టి ॥కుల॥

జారుపైట చెరగు మెడకుజుట్టి
తీరలంజకాండ్ర చెట్టబుట్టి
ఊరుదిక్కు రోతబుట్టి
ఉబ్బితబ్బిబై తొడదట్టి॥ ॥కుల॥

పగలు రేయి జాగ్రత్తగా నడిచి
బాపనిండ్ల పూటకూళ్ల గుడిచి

తెగువచేసి తాణాలుగడచి
తగుదుననుచు సిగ్గు శరముడిచి ॥కుల॥

ఇంతదూర మెవరు వెతకరాదని
యెవరువచ్చి పేలు వంచలేరని
అంతపనికి తేవిణి చిత్తూరని
చింతలేదుహూణుల దరబారని ॥కుల॥" [ప-138]

ఇలాగా తన కాలంనాటి సమస్త విషయాల్ని అభివర్ణించి తన పదకవితకు విశిష్టతని చేకూర్చుకొన్నాడు సారంగపాణి.

## 2.10 హాస్యం :

సారంగపాణి పదాల్లో హాస్యానికి సైతం స్థానం ఉండడం విశేషమే. "ఇంత చక్కని అందగత్తె" అంటూ వేశ్యారూపాన్ని అపహాస్యం చేస్తూ హాస్యోత్పత్తికి అవకాశం కల్పించాడు సారంగపాణి ఈ క్రింది పదంలో.

"పల్లవి : ఎక్కడి నుండి దాపురమాయెనె
ఇంతచక్కని అందగత్తె లేని

అను : వెక్కులు పుట్టించి వేణుగోపాలుని
దక్కించుకొని యెవరు తన కెదురులేరని ॥ఎక్క॥

ఆట చదువుసున్న పాట లంజ మందు
బూటకములకది పుట్టినిల్లు
సీటు యింతనరాదు నిలువెల్ల కపటము
గూటమువలె తిని కూర్చుంటే కలదు ॥ఎక్క॥

లలన పల్వరుస గవ్వలతో వీయములందు
కలబంద వాసన కలికిమేను

ఓలుకరౌతు నగరు దలప చీకటికోన
వలపుమందులసంచి ఒకనిమిషమేమరదు ॥ఎక్క॥

మొగచెంపలదిగాక మోమెల్ల మొటిమలు
దిగబడ్డచనులు తొట్టినోరు
వగలాడివయసు యేబదిమీద రెట్టెల్లు
యెగతాళిసేయక వాడేలాగుగూడెనో ॥ఎక్క॥ (ప-96)

మరొక్కటి :

"పల్లవి : అంతమాత్రము నే నియనటె
అజ్ఞానురాలా నే

అను : నెంతబిలచిన నసేమిరాయని
గంతెవైచుచు పరుగెత్తేవు ॥అంత॥

శేవాకాలము రాతిరిగుళ్లో
ఆవేళాదాకా నిలుచుంటె
తేవాకు లయవా రొక దోశ
నీ వాళ్లో దోపె మూసుకొమ్మని ॥అంత॥

గద్దగూడువలె తలబెట్టుకొని
సద్దులాడ వచ్చితె సాతాని
పెద్ద వెలగచిప్ప దెచ్చుకొమ్మని
శిద్దెలోని చమురువంచి యిచ్చెను॥ ॥అంత॥

రొయ్యదిన్ననోటికి హొవ్వాకిం
తియ్యమనుచు యెడమచెయ్యి సాచితే
అయ్యతోడె లేదని తన చారుడు
బియ్యమిచ్చె వుగ్రాణపు దాసరి॥ ॥అంత॥

పాతగుడ్డ పైట కందలేదని
భంగపడితే నాంచారుకప్పుడు
సాతియున్న చీరగుంజి వేగమె
చేతికిచ్చె పరిచారక వైష్ణవు॥ ॥దర॥

వేణుగోపాలా రారమ్మని
వింతగా నను గూడితివైనా
వీణుగా నిను బొమ్మందునటే
వెర్రిదాన తెలుసుకోవైతివి॥ ॥అంత॥ (ప-94)

జాతీయ పదాల్లో చాలముఖ్యమైన పదం "అగ్గితిరుణాలంట.... యెటుల కాయిం చెనె" (ప-153) పూర్వోక్తం. ఇదిపామర ప్రజలకు అతిసహజమై పామరభాషలో రచితం. భారత, రామాయణ కథల్లోని ఘట్టాల్ని కలగా పులగం చేసి పామరో చితంగా చెప్పుకోవడాన్ని రచించడం సార్ఙ్గపాణికి మాత్రమే సాధ్యమైంది. ఈ పదం చదువుతుంటే మృచ్ఛకటికంలోని శకారుని అసంబద్ధ ప్రలాపాలు గుర్తుకువచ్చి వెంటనే నవ్వు వస్తుంది. సారంగపాణి ఈ పదరచనతో చక్కటి హాస్యాన్ని అందించాడు మనకు.

ఇంక :

పల్లవి : గుత్తలంజలను మరిగినవారికి
దుత్తేకడపటను వరాల

అను : తిత్తిపుత్తడైన వెనకబోతె
బెత్తమె వేణుగోపాల ॥గు॥ "అనే

పల్లవి, అనుపల్లవులను విన్నవెంటనే నవ్వువస్తుంది

ఆపైన

"కావలసిందిచ్చే దినముల
కాళ్ళు రెండు కనులనొత్తుకుందురు
యీవులుడిగి యిలుదూరితే గౌరీ
దేవి వాయనము దవుకొందురు ॥గు॥

బేరసారములుడిగి బికారై
బిక్కికాయ తిన్నకోతివలె బోయి
కారు బారుసేయవచ్చెనా శృం
గారకట్ట దెమ్మని దిగతీతురు ॥గు॥

కడకు బోయిన మూడుదినములైనా
యెడముగా పవళించగ గూడి
విడువలేక వొదిగిళ్ళుబారితే
పెద అర్ధచంద్రుని నియమింతురు ॥గు॥ (వ-191)

మూడుచరణాల్లో చివరగల "గౌరీదేవి వాయనము దవుకొందురు, శృంగార కట్ట దిగతీతురు, పెదఅర్ధచంద్రుని నియమింతురు" — అన్నప్పుడు కడుపుబ్బనవ్వు రాకమానదు.

ఇలాగే పూర్వోక్తమైన "కడుపా..........నీకొరకే గదవే" (వ-192) విన్నం తనే చిరునవ్వు పెదవులపై చిందకపోదు.

ఇంతకు ముందే వ్యాజస్తుతి పూర్వక పదాలు ఉదాహృతాలు. వాటన్నిట చమత్కారంతో కూడిన హాస్యం ప్రకటించాడు సారంగపాణి. అవి :

"నిన్ను దైవమనుచు యెట్లా నమ్ముదునయ్యా" [కీర్తన-161]

"నీకే సమ్మతిగాని యిటువంటి నడతలు" [కీ-163]

"నీవారి నడతలన్నియు నేనేమెరుగనా" [కీ-164]
"ఎంత పేదవాడె వేణుగోపాలు డెంత పేదవాడే" [కీ-173]
"ఇట్టిపనులు సేతురా ఎట్టివారైనా" [కీ-186]

ఇలాగా సారంగపాణి తన పదాల్లో హాస్యాన్ని సైతం పోషించి ఉండడం అతని ప్రతిభకు నిదర్శనం. తన్మూలంగా తనది పదకవితే అయినా వాసి, వన్నెగల కవిత అని స్పష్ట మవుతుంది; ప్రౌఢకవితతో తులతూగ గలదని వ్యక్త మవుతుంది.

2. 11 పోలికలు :

ఇంతవరకు సారంగపాణి కవితతో ఆతని ప్రతిభావ్యుత్పత్తులతో పాటు లోకజ్ఞత మొదలైన అనేక విశిష్ట లక్షణాల్ని మనం చవిచూశాం. ఇప్పు డీకవి కవిత ఇతర కవుల కవితతో ఎలా సాదృశ్యం వహించిందో పరిశీలిద్దాం.

పదకవితా చక్రవర్తిగా ప్రసిద్ధిగాంచిన క్షేత్రయ్యతో సారంగపాణి అన్ని విధాలా సరితూగగలడు. క్షేత్రయ్య రచించి నన్ని పదాలు సారంగపాణి రచించ లేదో, రచించినా అవి మనకు లభించలేదో తెలియదు. క్షేత్రయ్య పదాలంటే శృంగార పదాలే. పైగా క్షేత్రయ్య నాటినుంచే పదం అంటే శృంగారపదం అన్న ప్రసిద్ధి వచ్చింది. కాగా క్షేత్రయ్య స్వీయా పరకీయా సామాన్య నాయికా శృంగారాల్ని అభి వర్ణించాడు. సారంగపాణి నాలుగు విధాలైన పదాలు రచించాడన్న విషయం పూర్వోక్తం. అందులో ముఖ్యంగా దేశీయపదాలు, జాతీయపదాలు, కీర్తనలూ ఉండడం విశేషం. పైగా ఇతడు వర్ణించినది సామాన్య నాయికా శృంగారం. సారంగపాణి శృంగారపదాలు క్షేత్రయ్య పదాల్లాగే వుంటాయి. పెద్ద తేడా ఉండదు. శబ్దాల్లో, భాషలో, భావంలో, రచనలో అవే ఇవి. ఇద్దరి ఇష్టదైవమూ గోపాలుడు. క్షేత్రయ్య ఇష్టదైవం మువ్వగోపాలుడు; సారంగపాణి ఇష్టదైవం వేణుగోపాలుడు. సారంగ పాణి తన పదాల్లో వాడిన అంతరంగం, సీమాటి, కొంచగాడ, అసురుసురను, కోపము సేయు, పొంచులువిను మొదలైన పదాలు, పదబంధాలు, క్రియలు క్షేత్రయ్యలో కోకొల్లలు. పాటపాడి ఆడడం, తంబురా, వీణ మొదలైన వాద్యాలు వాయించడం క్షేత్రయ్య పదాల్లో లాగా సారంగపాణి పదాల్లోనూ ఉన్నాయి.

"పాటపాడి మెప్పించనా నీపై
పదముచెప్పి వలపించనా॥ (ప-76)

"పంచమశ్రుతిని తంబురమీటి సంచుగాపాడి, సారంగ
పంచిపెట్టినటుల వినికిడిచేసే ప్రౌఢనాయకిరా (ప-1)

"సంతోషముగ నాడునా తంబుర మీటి-
సంచుపాట బాడునా (ప-33)

"రొమ్మున తంబురమీటుచు బాడుచు [కీర్త-195]

"రక్తిలేని పదమేమిటికి" [కీర్త-180]

ఇవి క్షేత్రయపదాల్లో ఇంకా స్పష్టంగా ఉన్నాయి. "పదము పాడగవినేవో; వలరాజుమీదను పదము పాడుకొనుచు; పన్నుగదాని వర్ణింపలేనట్టి పదము లేటి పదములే;" "సొంపునవానిపై పదముపాడి వీణసొలపుగ మీటుదునే; అందమైన వీణ చేతబూని అనురాగములే మీటి పొందుగాను పదకవిత్వము పలుకనేర్చునా?" సంతోష ముగా నాడనా! తంబురామీటి సంచుపాటపాడునా !"[1]

ప్రసిద్ధమైన క్షేత్రయ్యపదం ఖండితనాయిక శృంగారం గలది.
"ఇంటికి రానిచ్చేనా.... ....యనిపిలిచేనా"[2]

ఇదేపదం సారంగపాణిపదాల్లో 39 పదంగా (పు28, 29) ప్రకటించబడింది. ఇందులోతేడా మువ్వకుబదులు వేణు ఉంది. తక్కిన పదమంతా ఒకటే. సారంగపాణి క్షేత్రయ్యపదాల్ని గ్రహించాడనడంకంటే గాయకులో, అభినయం పట్టేవారో లేదా లేఖకులో పొరపాటున మువ్వకుబదులు వేణుగామార్చి సారంగపాణి పదాల్లోచేర్చి ఉంటారేమోనని నా అనుమానం. ఎందుకంటే క్షేత్రయ్యపదాల్లాంటి వెన్నింటినో రచించిన సారంగపాణి దీనిని గ్రహించాడనడం సముచితంగాదు.

1 క్షేత్రయ్య పదసాహిత్యం - పు200, 201
2. క్షేత్రయ్యపదములు - వావిళ్ళ ప్రచురణ. పుట - 30,31

ఇలాంటిదే మరోపదం :

"అక్కరలేని కాపురమాయె.... .... సతమాయె"(ప-6 పుట. 67) (క్షేత్రయ్య పదములు : వావిళ్ళప్రతి). ఇదే పదం సారంగపాణిపదాల్లో (ప-54) ఉంది. 'మువ్వ'కు బదులు 'వేణు' ఉంది. అంతే తేడా.

ఇలాంటిదే మరొక్కటి :

"ఇంతమోహమేమిరా .... గారడమేలా"

(ప-37, పు 41 క్షే. ప. వావిళ్లప్రతి)

సారంగపాణి పదాలు - పదం-33 (పు. 23)

ఇంకొక్కటి :

"తెలిసె నీనెవరు మంచివాడవు"

(ప-31, పుట 35, 36 క్షే. ప. వావిళ్లప్రతి)

సారంగపాణి పదాలు - పదం-43 (పు. 31, 32)

ఇంకొ ఒక్కటి :

"తన చిత్తము వచ్చినటుల - దయవచ్చీని"

(పదం-46, పుట 52, 53 క్షే ప వావిళ్లప్రతి)

సారంగపాణి పదాలు - పదం-55, (పు. 42)

మరొక్కటి :

"ఇచ్చిన మంచిదె వాడలబోవు"

ప-66 (పు. 73; 74 క్షే. ప వావిళ్లప్రతి)

సారంగపాణి పదాలు - పదం-59 (పు. 46)

ఇక పల్లవి ఒకేతీరున ఉంది;

"నీ పొందు పేయకమాన మువ్వగోపాల! నీ పాదమాన"

(ప-157, పుట 174 క్షేత్రయ్య పదములు, వావిళ్లప్రతి)

"నీ పొందుసేయక విడిచేనా వేరే
నెలత కొప్పున విరులు ముడిచేనా అరే"
(సారంగపాణి పదములు - ప-76)

ఇలాగే మరో పల్లవి, అనుపల్లవుల ఎత్తుగడ.

ప॥ "ఎవ్వతె నిను బోధించెనో

అ : మువ్వగోపాల ! నాదు – ముచ్చటఁజెల్లనియ్యక
ముందుకు నడిపింపుమని – ముమ్మాటికి చలపట్టె॥
(పదం-83 పు. 91 క్షే. ప. వావిళ్ల ప్రతి)

ప : ఏ రమామణి బోధ వింటివి
ఏర మాటాడవు నాతో వక

అ. ప : ధీరమా మఱిమఱి వేడితే గం
భీరమా వేణుగోపాల"
సారంగపాణిపదములు - పదం-13 (పు.8,9)

ఇట్లే పల్లవి, అనుపల్లవుల్లో సామ్యం :
(క్షే. ప. వావిళ్ళప్రతి) - "శ్రీపతిసుతుబారికి...." (పదం-203)

సారంగపాణిపదములు

"సామి యీకోపమేల ..." (పదం-34)

క్షేత్రయ్యపదాల్లో స్త్రీ, పురుష విరహం నానారీతుల వర్ణించబడింది; అందులో ఒకనాయికా విరహవర్ణన యీ క్రిందిపదంలో చక్కఁగా చిత్రించబడింది,

"ఏల వలచితివోయమ్మ... ....చెలువరాయనిపై",
(క్షే. వ. వావిళ్ళ ప్రతి, పదం - 108. పు120,121)

దీనితో అన్నివిధాల పోలికగల సారంగపాణి పదం ఉంది.

"తటుకు తటుకు...... ఏంచేసేటంతలో"

(సా. ప. పదం - 73, పు60,61)

మరోపదం :

"ఏమిసేతునే .... చందనగంధి నే."

(క్షే.ప. వావిళ్ళప్రతి-పదం 80, పు91,92)

"ఏమిసేతు ... వేణుగోపాలుని మాయ (సా.ప పదం 45, పు33)

విషయం వేరైనా సామ్యముంది

"పచ్చియొడలి దానరా నాసామి"

(క్షే.ప. వావిళ్ళప్రతి - పదం164 పు181, 182)

"ఒట్టు బెట్టుదు ....నీకు" (సా. ప. 51, పు 38)

ఇలాగా అనేక రీతుల క్షేత్రయ్యతో సామ్యంగల పదకర్త సారంగపాణి.

ఇంక తదితర కవులతో సారంగపాణి పదకవితకు గల పోలికల్ని పరిశీలిద్దాం, శ్రీనాథుడు రెడ్డిరాజుల ఆస్థానంలో విద్యాధికారిగా వ్యవహరించినట్లు సారంగపాణి కార్వేటినగర రాజుల ఆస్థానంలో విద్యాధికారిగా ఉండేవాడనీ, ఉద్దండ పండితుల ప్రశంసలకు పాత్రమైన శృంగార నైషధాదుల రచించినా, పామర ప్రజల కోసం పల్నాటి వీరచరిత్ర పదకవితని సైతం రచించడం విశేషమనీ, అదే రీతిని చక్కటి శృంగార పదాలు రచించినా పామరజనసన్నిహితుడై సారంగపాణి జాతీయ పదాలు రచించడం వీరిద్దరి మధ్యా గల సామ్యాన్ని వ్యక్తం చేస్తున్న విషయం పూర్వోక్తం.

సారంగపాణి పదాల్లోని చతుర్థ భాగంలోని కీర్తనలు, పదకవితా పితామహుడని ప్రసిద్ధి గాంచిన అన్నమయ్య సంకీర్తనలతోను, రామదాసు కీర్తనలతోను తులతూగుతున్నాయి. పైగా భక్తిలో ఇతడు అన్నమయ్య, రామదాసు,త్యాగయ్యలని జ్ఞప్తికి తెస్తాడు.

జాతియపదాల్లో అనేక పర్యాయాలు పూర్వోక్తమైన చక్కటి పదం.

"అగ్గితిరుణాలంట యెటుల గాయించెనె" (ప-153) లోని పామర ప్రజల అసంబద్ధ విషయాలు మృచ్ఛకటిక నాటకంలోని అసంబద్ధ ప్రలాపి అయిన శకారుని మాటల్ని గుర్తుకు తెస్తాయి. ఇదిగూడా ముందే ప్రస్తావించబడింది.

సారంగపాణిది పదకవిత అయినా ప్రౌఢప్రబంధ కవుల కేమాత్రమూ తీసిపోడు. సారంగపాణి పదకవితా రీతుల పరివ్యాప్త పరిశీలన వల్ల అభివ్యక్తమైంది. శబ్దార్థాలకు సమాన ప్రతి పత్తినిచ్చి ప్రబంధ పద్ధతిలో చేసిన రచనకి కింది పదం అన్ని విధాలా నిదర్శనం.

"పల్లవి : దానికెవ్వరు సాటీ ఆవెలది నీకే
తగురా రాజకిరీటీ

అను : మానిత వరగుణపేటీ నీపై
మరలు కొన్నదిరా మాబోటీ యికనీను
మానదురా భానుసమతేజా
మాకరాట్కార్వేటి రాజా॥ ॥దాని॥

మగువను సభల నెన్నుదురు
మామనదలించు నెన్నుదురు ఆ
వగలాడి పల్వరుస కుదురుమేటి
వజ్రమణులనుచు బల్కుదురు యీ
జగతి దాని కెవ్వరు నదురు విరి
జాజులంపె నీకు నదురు మంచి
నిగనిగలు గల మొగడు తమ్ముల
దెగడు చనుగవ బొగడ తగునిక॥ ॥దాని॥

వనజ గంధి కనుల దీరు చూడ
వలరాజు చేతి కిలి తీరు ఆ

ఘనవేణి మెరుగునూగారు సౌరు
గణుతింప ఫణులిడుగాదె
నిన్ను రమ్మనె పలుమారు తావు
మొనల కోర్వదు పలుమారు అను
దినమునను చెలి మనము సమ పెన
గొని తమి యింతనగ వశమా ॥దాని॥

సుదతి నెన్నగ శ్రీల మిన్నా దాని
శృతుల పై కరిశ్రీల మిన్నాల
మదవతికే గౌను సున్నా నాదు
మనవి వినవా మనసున్నా
బెదరించు కురు లళులకన్నా గొప్ప
పిరుదులు చక్రముల కన్నా సామి
అదనిదని మరుకదనమున సతి
నెదను తమి వదలకను గదియర ॥దాని॥ [ప-61]

ధూర్జటి పద్యరచనలోని శబ్దార్థాల విశిష్ట విశదీకరణ క్షమమైన పదరచన సారంగపాణిలో ఉంది.

"పల్లవి : హరినామ స్మరణే సేయకుంటె
అవతల గతియేమి

అను : వెరవుదెలసి సత్సంగతి వదలక
వేణుగోపాలుడైన శ్రీనర ॥హరి॥

అన్నదమ్ము లెడబాయక మునుపే
యాలునిష్ఠు రోక్తులనక మునుపే
కన్నకొడుకు దండించక మునుపే
కాయము వ్యాధుల చివుకక మునుపే

వృద్ధాప్యము ప్రాపించక మునుపే
వుత్సాహము బలముడుగక మునుపే
నిర్ధనుడై దిగులుబడక మునుపే
నేత్రాలు పొరగప్పక మునుపే ॥హరి॥

కఱ్ఱసూనుకొని దిరుగకమునుపే
కంఠధ్వని తగ్గిపోక మునుపే
అఱ్ఱు ముందరికి వంగక మునుపే
అంగము తల వణుకెత్తక మునుపే ॥హరి॥

దవడలు లోనికి బోవక మునుపే
దంత పటుత్వము తప్పకమునుపే
చెవులకు మందము దట్టకమునుపే
చెల్లబో సడవ జేరక మునుపే ॥హరి॥

అప్పులకాపులు కదియక మునుపే
అన్నమొకరు దినిపించక మునుపే
దొప్పలోన చై కడగక మునుపే
ద్రోవతి బరువై దోచక మునుపే ॥హరి॥ (కీ-168)

ఈ పదం ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యంలోని నత్కీరుని –

"తివిరి యంగమ్మున . . . పరిహరింప" (3-177) పద్యాన్ని గుర్తుకు తెస్తుంది.

సారంగపాణి పదాల్లో ఒక నాయకుడు "మాటల పందిలి బెట్టకే" (పదం-40) నాయికతో పేసు కొన్నట్లున్న మాటలు పసుంగా తెనాలిరామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యంలో విషయం వేరైన నిగమశర్మ అక్క తమ్మునికి "మాట తేటలంబం డిరి వెట్టి "న (3-24) విషయాన్ని జ్ఞాపకం చేసి, మాటల తేటలోని మర్మాన్ని స్పష్టం చేస్తున్నాయి.

సారంగపాణి కీర్తనల్లోని కొన్ని పంక్తులు వేమన నీతి వాక్యాల్ని గుర్తుకు తెస్తాయి. సారంగపాణి_

"భక్తితో పిలిచి పెట్టినయన్నము
పట్టెడైనను చాలు"

(పదం_166) అనే పల్లవి

"గంగగోవుపాలు గరిటెడైనను చాలు
కడివెడైన నేమి ఖరముపాలు
భక్తిగలుగు కూడు పట్టెడైనను చాలు
విశ్వదాభిరామ వినురవేమ" అనే వేమన పద్యాన్ని తలపింపజేస్తుంది. ఇలాగే _

"భక్తిలేనీ పూజాలేమిటికి ప్రతిదొరకగానే
భక్తిలేని పూజలేమిటికి

(పదం_180) అనే పల్లవి.

"పల్లవి : భక్తిలేని వ్రతము లెన్నిజేసిన
ఫలము లేదు సుమ్మీ వి

అను : రక్తులమని వేసాలు ధరించుక
రహిని వేణుగోపాలుని పాద

॥భ॥

జడలు వెనక జీరాడిననేమి
జాహ్నవి లోపల మునిగిన నేమి
కడుపు గట్టి నటియించిన నేమి
కాళ్ల పాదుకలు మెట్టిననేమి

॥భ॥

కావి వస్త్రములు గట్టిన నేమి
కంప్లుమూసుకొని గొణిగిననేమి
లావుగ తిరుమణి పెట్టిన నేమి
లక్షతులసి సర్పించిన నేమి

॥భ॥

మేని నిండ భస్మ మలదిన నేమి
మెడల రుద్రాక్షలు పూనిన నేమి
నానాభూముల తిరిగిన నేమి
నదులు నిధులు గనుగొంటే నేమి ॥భ॥
(కీర్తన-184) అనే పదమూ వేమన -

"ఆత్మశుద్ధి లేని యాచార మదియేల
భాండశుద్ధి లేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినురవేమ" అనే పద్యానికి వ్యాఖ్యానంలాగా ఉంది, వేమన హేతువాద రీతిని సైతం అభివ్యక్తం చేస్తున్నాయి.

"మాట వినని తనయుండేమిటికి
మదిరా నడువని సతి యేమిటికి
చోటు చాలని యిల్లేమిటికి
సొడ్డు బెట్టు చుట్టా లేమిటికి" (కీర్తన-180)

అనే సారంగపాణి మాటలు -

"కోతికి జలతారు ..... సత్కథాశ్రవణమేల" (పద్యం-13) అనే నరసింహ శతకంలోని మాటల్ని తలపింప జేస్తున్నాయి.

ఇంక సారంగపాణి పూర్వోక్తమైన ఈ క్రింది వ్యాజ స్తుతిగల -

"నీకే సమ్మతి..........వెలసితివి" (కీర్తన-163)
నీవారి నడతలన్నియు..........స్వామి వేణుగోపాల (కీర్తన-164)
ఎంత పేదవాడే .....ఓచెలులారా (కీర్తన-173)
ఇట్టిపనులు .. దూరనిత్తురా" (కీర్తన-186)

ఈపదాలన్నీ ఆంధ్రనాయక శతకంలోని వ్యాజస్తుతి పద్యాలతో అన్నివిధాలా సామ్యం కలిగి ఉన్నాయి.

సారంగపాణి ఈ క్రిందిపదాలు :

"పల్లవి : మనుషా నమ్మబాకే —
యిద్రేగాము కశేభాటం —
మనుషా నమ్మబాకే

అను : మనుషా యీాద్రేగాము
మట్టి పట్టెంటిది
పనికేటిలో నుండె
పరమాత్ముడెల్నంటె ॥మ॥

తొమ్మిది సొరంఘాళ తోశే వరమాశిగ
బెమ్మనాయించిది—బెష్టకారి కట్టె ॥మ॥

ఎన్నెంటా యెంకేలు — యెంక మ్ముంగలెంటికేలు
కన్నెయాదుల బట్ట — గడగకుంటె గబ్బు ॥మ॥

పయియెన్నెలకుగున — వరమ కొండలము
మయిదు యీాన్మ్రుడు శేశి — మబ్బి గప్పిండాడు ॥మ॥

తన బోషాణశెత్తి — ధరమధాణం శేశి
యినవలె రామేండెం — కనమోచ్చము
ఎంటవగటిరావు — యేనుగోపాలుని
బింక్తై పాథకవళం — బట్టాలే పట్టిగ ॥మ॥ (ప–150)

"పల్లవి : హరినారాయణ గోవిందాయని
స్మరణ సేయవే వో మనసా

అను : పురుషోత్తమ దామోదర కేశవ
భోగిశయన వేణుగోపాల ॥హ॥

ధర్మమందు నిశ్చలమతి నుంచి
దమయు శాంతసత్యమున నటించి
నిర్మలజ్ఞాన మాక్రమించి
కర్మఫలము రామునికర్పించి
పరమభాగవతుల సేవించి
భక్తిమార్గమున ప్రవర్తించి
అరిషడ్వర్గముల మొదలుద్రుంచి
అంతటను విష్ణువనితలంచి ॥హ॥

ఇతర చింతలన్నియు తొలగించి
యిహసుఖంబు తుచ్ఛమని త్యజించి
ధృతిపీడక శౌరిని ధ్యానించి
దుష్టనరుల సంగతి వదలించి ॥హ॥ [కీర్తన-175]

"పల్లవి : మనసా చపలము మానవా యీ
అను : తనువు నిత్యముగాదనియెంత చెప్పిన ॥మ॥

చయ్యన సుకృతము సంగ్రహించలేక
అయ్యయ్యో మితిమీరి పొయ్యేవారినిజూచి
మూడుదినంబుల ముచ్చటకై అన్నృత
మాడవలదనుచు వేడుకొన్నగాని ॥మ॥

పరకాంతలపొందు నరక హేతువని
పరిపరివిధముల మొరలు బెట్టినగాని ॥మ॥

ధర్మ చింతవిడిచి దయదాక్షిణ్యములేక
దుర్మార్గ వృత్తినీదుట కొరగాదంటే ॥మ॥

పనిబూని వేణుగో - పాల దేవునిపాద
వనజములకు నిన్ను - పెనవేయకగాని ॥మ॥ [కీర్తన-182]

"పల్లవి : అద్దెకొంప వంటిది యీ దేహ
మనిత్యమే మనసా

అను : మిద్దెమీది పరుగులు రెణ్ణాళ్లు సు
మీ వేణుగోపాలుని సాక్షిగ ॥అ॥

బండెగొడ్ల వంటిది సంసారము
భ్రమయకే మనసా
యెవరున్న నడమంత్రమే జీవుని
కెవరు లేరు మనసా ముమ్మాటికి ॥అ॥

పువ్వువంటిది యౌవన మనగా
పొంగకే మనసా
మదిని వేణుగోపాలుని మంత్రము
మరువకే మనసా ముమ్మాటికి ॥అ॥ (కీర్తన-190)

- పోతులూరి వీరబ్రహ్మంగారి తత్వాల్లా వినవిస్తున్నాయి.

చివరిగా సారంగపాణి -

"వేణుగోపాలుని ..... దీతుమా" (కీర్తన-158)

అనే కీర్తన బాణీని గ్రహించి స్వాతంత్ర్యోద్యమ సమయంలో మహాత్మా గాంధీని గూర్చి చాల చక్కగా దామరాజు పుండరీ కాక్షుడుగారు -

"శ్రీ గాంధీనామం - మరువాం మరువాం
సిద్ధము జైలుకు - వెరువాం వెరువాం
మాగాంధీనే మేం . నమ్మేం నమ్మేం
మరి ఇతరుల మేము-నమ్మాం నమ్మాం" అంటూ గొంతెత్తి పాడారు.

ఇలాగా అతి ప్రాచీన కాలంనుంచి ఆధునికుల వరకు గల కవుల కవితలతో సారంగపాణి పదకవిత సాదృశ్యం కలిగి ఉండడం అతని విశిష్టతకు నిదర్శనమని స్పష్ట మవుతుంది.

## 3. భాషా వైభవం

ఇంతవరకు సారంగపాణి పదాల్లోని కవితా వైశిష్ట్యాన్ని వివిధ రీతుల పరిశీలించి వివరించడం జరిగింది. ఈ ప్రకరణంలో సారంగపాణి భాషా వైభవాన్ని తెలుసుకోడానికి ప్రయత్నిద్దాం. ఇతఃపూర్వమే ప్రసక్తాను ప్రసక్తంగా సారంగపాణి తన పదాల్లో వాడుక చేసిన భాషా రీతుల్ని స్థూలంగా చెప్పడం జరిగింది. ఇక కొంత వివరణాత్మకంగా ఈ భాషా రీతిని తెలుసుకోవడం అవసరం. మహాకవి తిక్కన తరువాత తెనుగు తేటని, తియ్యదనాన్ని, బలాన్ని, మర్మాన్ని తెలుసుకొన్న పద కవితా చక్రవర్తి క్షేత్రయ్య. ఈ భాషా విషయంలో క్షేత్రయ్య పక్కనే నిలువగలవాడు సారంగపాణి. క్షేత్రయ్య తన పదాల్లో సందర్భోచితంగ వ్యావహారిక రూపాల్ని వాడడంతో సంతృప్తి పడ్డాడు. కాని సారంగపాణి వ్యావహారిక రూపాల్ని వాడడమే గాక ప్రత్యేకంగా మూడో భాగంలో జాతీయ పదాల్లో పామర ప్రజల వాడుక భాషని ప్రయోగించడం విశేషం. ఇది జానపదగేయాలకి సన్నిహితంగా ఉంది. అందలి భాష జానపదుల వ్యవహారానికి తగిన రీతిలో కూడా ఉంది.

తేటతెలుగు సారంగపాణి పదాలన్నిటా మనకు కనిపిస్తుంది. మన మనస్సులను అలరిస్తుంది. ఆనందాన్నిస్తుంది. అక్కడక్కడా సంస్కృత సమాసయుత రచన ఉంది. కాని అందులోని సమాసాలు నాతికఠినమై, దూరాన్వయ రహితమై ఉండడం సారంగపాణి భాషలోని విశిష్ట గుణం. పూర్వోక్తమైన "వరకన్యా తిలకమె.... ...... కలయు మికరతిని" (ప-7) లో సమాసాలున్నా, శ్లేషాత్మకమై, చమత్కార యుతమై సారంగపాణికి సంస్కృతాంధ్ర భాషలలో గల ఉభయ భాషా పాండిత్యాన్ని ప్రకటిస్తున్నాయి. తేట తెలుగు దనానికి ఉదాహరణ :-

"పల్లవి : అట్లాగె కావలె దానికి
హైశ్మావాసు నాడు

అను : కొట్లాడిందెరుగవటె వేణు
గోపాలుని పిలువ వద్దంటె ॥అ॥

వడ్డికి వేయమని రూకలు
గుడ్డతో గట్టియ్యగానే
సొడ్డు నెత్తిన వేసి యురికె
జిడ్డు మొన్నటితోనే విడిచె ॥అ॥

కలభూషణము లన్నీ మడిచీ
తలమాటున పంచుకుంటె
మెళుకువగా అంటుకొనీ జరిగె
పిలుము నిన్నటితోనే విడచె ॥అ॥

పండుకునే యుండి పక్కలో
పయి పనులన్ని చక్కబెట్టి
కుండలు చట్లన్ని జల్లగడిగి
వుండింది పండింది వూడ్చుకపోయె ॥అ॥ (ప-140)

ఇలాగే యితని భాష సర్వశోభస్కరంగా ఉంటుంది. సారంగపాణి పదాల్లో చక్కటి తెలుగు పలుకుబళ్ళ, సామెతలు, సందర్భోచితంగా ఉండి అతని పదాలకు శోభని చేకూర్చాయి. అన్య దేశ్యాలు సైతం ఈతని పదాల్లో చోటు చేసుకొన్నాయి. సంధి, సమాస రీతుల్ని సైతం ఇందులో మనం గమనించ వచ్చు.

### 3.1 పలుకుబళ్లు :-

పలుకుబళ్లు లేక నుడికారాలు అన్నవి ప్రతి భాషా వైశిష్ట్యాన్ని, స్వభావాన్ని, స్వాతంత్ర్యాన్ని ప్రకటించేవిగా ఉంటాయి. తెలుగు భాషా స్వభావాన్ని బాగుగా గుర్తించిన సారంగపాణి తన పదాల్లో పలుకుబళ్లని చక్కగా ప్రయోగించాడు.

అక్కరలేని కాపురమాయె (54)

అడుగులకు మడుగు లొత్తేనే (50)

అడుగులకు మడుగులు తాపరచిన (56)

అడుగులోనే అరవై యారు గుణాలైతే (35)

అడుగులోన వేయి గుణములైతే (55)

అడ్డమాజ్ఞ లేదు (91)

అన్యాయాని కొడిగట్టు (28)

అసు రుసురను కుంటే (52)

ఆర్చేర తీర్చేర (189)

ఇంటింటి చెంద్రుడవు (35)

ఇంటిలు పాది (120)

ఇరు చెవ్వేరుగనీక (101)

ఇసు మంతైన (72)

ఉరిమి జూచు (101)

ఎగబోయు (99)

ఏమే మెగబోసిరో (70)

ఒకరు పచ్చగవుంటె (118)

ఒట్టుబెట్టు (51)

ఓరగండ్ల జూచు (110)

కంచి గరుడసేవో (101)

కనుల నొత్తుకొను (191)

కనుసైగ జేసె (46)

కన్నులెర్ర జేసె (37)

కారు బారుసేయు (191)

కాలి కొద్ది (65)

కాలికి బొమ్మ గట్టనా (125)

కుదవబెట్టు (16)

కోపము బెట్టెట్టు (90)

గాంధారి తనాలు (117)

గుట్టు చప్పుమనగ (98)

గురికాయించితివో (131)

గుసగుసలాడు (56)

గోడమీది పిల్లి (98)

చప్పుడు సేయక (30)

చిటుకమంటె కోపమైతే (44)

చెప్పినంత మాట చెల్లించేసామి (30)

చురచురమని (66)

చెయ్యొత్తి మొక్కిన (52)

చెవినిల్లు గట్టుకొని చెప్పిన (48)

తటుకు తటుకు మని యదిరినే గుండె (73)

తమది గంపెడు దాచుకొని (91)

తల దువ్వి బాస జేసిన (72)

తిరుమల కొప్పు బెట్టించిన (92)

తెప్పజోడా (97)

తొడదట్టు (28)

దేవేంద్ర పదవి (29)

నను నవ్వేరట (91)

నసనసలు (134)

నామము బెట్టిన (92)

నాలిబొల్లి మాటలు (120)

నీ పప్పేమి చిమిడిందిప్పుడు (93)

నీవేన శాస్త్రము (105)

నీ వొడ్డు పొడుగేమి (105)

నెత్తి వ్రాత (87)

నేలమీద బొటనవ్రేలు రాయకే (30)

పంచప్రాణము (84)

పతిమనసు పాషాణమని (4)

పలుకే బంగారమాయెనా (85)

పాపపు దైవము (123)

పుడక ద్రుంచి వేసెనట (55)

పుడకేల విరిచేరు (30)

పుట్టినిల్లు (96)

పూసలలో దారమువలె (57)

పెదవులు తడుపుచూ (134)

బహు ఘనముగ (66)

బాసలిచ్చె (44)

బొడ్డుకోసిన కొడవలి (91)

మంకు గుణము (77)

మంచమెల్ల కంతలు (91)

మంటీ ముక్కాయె (54)

మందాయెనా (10)
మనస్సు విరిచె (44)
మాటల పందిలి పెట్టకే (40)
మాటల మారి (16)
మీవీధికి ఒక దండము (120)
మూతివోరగ బెడితివి (120)
మూతులు బొడిచేవు (122)
మెటుకలు విరచి (37)
మెడదిప్ప రాకుండా (83)
మొగమంత కండ్లుజేసుకొనేవు (106)
మొగము చిట్లించగానే (76)
రాతిమనసు (44)
రావణమాయ (11)
వక్కకైనా నాసలేదు (58)
వాని చెలిమికొక దండమే (58)
సనవిస (121)
వుట్టి పండిందిపుడు (118)
వేలు వంచరని (28)
శుద్ధమడ్డి సాంబ్రాణి (4)
సున్న జుట్టిన (91)
హరిసాక్షిగ (55)

**3.2 సామెతలు :–**

కవితలోని సామెతలు పాఠకులకు చక్కటి ఆమెతలు. పైగా జాతి స్వభావాన్ని అవి స్పష్టం చేస్తూ కవికి భాషపై గల అధికారాన్ని అభివ్యక్తం చేస్తాయి.

ఇలాంటి సామెతలు సారంగపాణి పదకవిత నిండా మనోజ్ఞమై ఆనందాపాదియై ఉన్నాయి.

అందరాని పండ్లు కాశించి నట్లాయె (17)
అందరాని పండాయెగా (85)
అద్దెకొంప వంటిది యీదేహమ్మనిత్యమే (190)
అరవై యేండ్లు జెల్లితే అర్లుమర్లు గాదటవే (124)
ఇల్లలికితే పండుగాయెనా (125)
ఈనగాచి నక్కకిచ్చి నట్లు (79)
ఉడుము బోతేపోయినది, చై మాత్రం విడిచితేచాలు ననే కథగా(58)
ఉలవకట్టు సామెతగా నున్నది (98)
ఎంచబోతే మంచమెల్ల కంతలు [91]
ఓడలు బండ్లౌచ్చు బండ్లు నోడలబోవు [59]
కటకటా వీనిపేరు దలచితే కాశియాత్ర పోయి వచ్చిన తీరదు [57]
కలిమిలేములనగ కావడికుండలు [59]
కాలము బోవును కడకు మాట నిలుచును [59]
కుప్పలు కాలిచి పేలాలుదినే [193]
కొంటెరాని సొమ్ము కొసరితే వచ్చునా [189]
కొండకేగే వాని మొలను కొడవలి చెక్కినట్లాయెనా [36]
కొండ ద్రొవ్వెలుకను బట్టుదురా (38)
కొయ్యబొమ్మను చేర కోరికలిచ్చున (38)
కోటివిద్యలు నీకూటి కొరకేగదా! (192)
కోతిచేతి మాణిక్యముసామెత కొమ్మమనసు (56)
కోమటి విశ్వాసమాయెగా (85)

గురువుకు పంగనామములు బెట్టేపాపాత్ములు (193)
గోడమీది పిల్లివలెనె పొంచి (98)
చక్కిలిగింతలు చట్రాతికి గలవ (38)
చెట్టునెక్కమని నిచ్చెనదీసే (19?)
చెడ్డచేని కింటివడపొంగలి చేసినట్లు (58)
తెంకాయకు వచ్చేది ముందర (107)
తడిబట్టలతో గొంతులుగోసే (193)
తిన్నయింటికి రెండు దలచేద్రోహి (135)
నక్కవినయములు జేసేవారికి చక్కనిమరియాదా (60)
నట్టేటికిదోసి పుట్టిముంచె (193)
నమ్మి నానబోసినట్లాయెగదా యల్లనాటి సంకేతములు [40]
నల్లవాని నమ్మరాదనే నుడికల్లగాదమ్మా [79]
ప్రాణమెక్కువటే మానముకన్న [125]
పిల్లిదిన్నకోడిని రారమ్మని పిలిచితే పలుకునే [79]
పిల్లిదిన్న కోడివలెనే యుంటివి [120]
పుట్టించినవాడు పూరిమేపున [189]
పుట్టినబుద్ధులు పుడకలతో సరి [193]
పులగముమీది పప్పుసామెత ఆయె [35]
పులిదాసర్లకు పెట్టిన కథగా [193]
పూసలలోని దారమువలె యెంతజేసె నమ్మినందుకు [51]
పెరటిచెట్టుమందుకు గైకోరని పెద్దలనగ వినమా [60]
బలవంత మాఘస్నాన మాయె [85]
బండెగొడ్లవంటిది సంసారము [190]
బిక్కికాయ దిన్న కోతివలె [191]
బూడిదలోని హోమమాయె [135]

పిండిసరాలె శిత్తయండలో నిలబడి
పుండొద్దు మాయేపి పుదురు మిడుకనేరు
వాసొద్దువద్దని కొందరు సూతాం
తీసవొయ్యేదని కొందరు యీ
దాసరోల్ల వల్చతరమా కాపిరెంసేయ
యిసుల్ల పుట్టెన్నో యిరబడిందనెరహహా
చెయ్యితీరదని కొందరు నేడు
వెయ్యనేరాదని కొందరు బిగ్గ
కుయ్యవద్దు నోరుముయ్యనుచు రాగ
గయ్యాళి బైటికిగదిమి పొమ్మనె కృష్ణా
పెద్దలు లేరని కొందరు నేడు
తద్దిన మనేవారు కొందరు నిలువు
టద్దములో కొప్పుదిద్ది చూడనేగాని
కద్దులేదనరు యీకలికాల మహిమేమో
మించింది వేళని కొందరు వద్లు
మీకు బెత్రాదని కొందరు ఆబెడె
సంచినిండ వచ్చె సైరాసై యని అనుమా
నించి రేపు రమ్మనే వింతయిదియేమో (వ-194)

మరికొన్ని వ్యావహారికా రూపాలు :

అనిపించింది, ఏండ్లు శానాచెల్లిన వృద్ధుకు, కప్పడమాయె, కొందరు గిల్లి విదిలించరు – గిపెట్టినగాని, గోజార కేసింది, చూడదమాయె, చూతామని, చూసే టందుకు, చీరలక్కరలే, చేతికిత్తామని, యిడుతునా, తపించుకొంటేని, విడుతునా, నీవొల్లోని గింజలేవి సూపమనేరు, పుణ్యానికే, పూయదమాయె, పెండ్లిజేసుట శాబా సని, బహుశా, బహుమెండాయె, మల్లాదెకొద్ది, మీకుబెత్రాదని, సంమందము (సంబంధము).

ఇలా పదాలన్నింటిలో ఈరూపాలు కనిపిస్తాయి. పైగా వీటిని వ్యస్తంగా గాకుండా ఆయాపదాల్లో సందర్భోచితంగా చదివినపుడు రసభావస్ఫోరకమై, ఆనంద నిష్యందులై ఉంటాయన్న విషయం సహృదయైకవేద్యం.

3.9.2 రాయలసీమ వ్యావహారికం :

సారంగపాణి పదాల్లోని భాష ప్రధానంగా రాయలసీమ వ్యావహారికమునూ, ప్రత్యేకించి చిత్తూరు మాండలికమునూ. అయినా తదితరమాండలికాలు - అంటే రాయలసీమకంతా సమానమైనవి - లేకపోలేదు. పూర్వోక్తమైనట్లు తృతీయభాగం లోని జాతీయపదాలు రాయలసీమకు ముఖ్యంగా చిత్తూరుకు సంబంధించినవి. అంటే పామరజనోచిత వాడుకభాషని సారంగపాణి ప్రయోగించాడు. దీన్నేమండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు పాత్రోచితమైన భాషఅంటూ పేర్కొన్నారు. ఒకఉదాహరణ పూర్వోక్తమైన పదం :

"పల్లవి : ఆగ్గితిరణాలంట అజ్జునికతలంట
అవురాయెంత సోద్దెమే
బారతకత - బౌరాయెన్నెంతలే

అను : సుగ్గీజయము దీని సుట్టుబలాదూరు
అగ్గురోరపు అయ్యోర్నడిగే నీసాచ్చిగ (ప-153)

దీనిలో పామర ప్రజల నోళ్ళలో నలిగిన సంస్కృత పదాలు వారి వాడుకకు తగినట్లు, అమరినట్లు ఒదిగిపోయాయి. మరొకచక్కటి ఉదాహరణ - పూర్వోక్తమైన పదం :

"పల్లవి : నాన్నారము చంత్లో నానాదించుండెంట
నయము గిచ్చేరంటనె - సూడే

అను : ఈన్నె పొద్దెక్కనే - యీడేడుండా - దెంటె
కోణ్ణిగొండపోతె - కొందురే వొగురైన" (ప-154)

"పదములు శృంగారవధూ
మృదుమధుర మనోజ్ఞవాక్య మిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁబొంక మెఱఁగి పలుకఁగజెల్లున్"
(తాళ్ళపాక చిన తిరుమలయ్య : సంకీర్తనలక్షణము - ప. 56)

కానీ వైరాగ్యపదాలు అలాగాక "అగ్రామ్యరమ్య విష్ణుచరితోదారమై" ఉండటం అవసరం. వీటినే ఆధ్యాత్మిక పదాలంటారు. అన్నమయ్య ఈ రెండు విధాలైన పదాల్ని రచించాడు. అదేరీతిని సారంగపాణి సైతం ప్రథమభాగంలో శృంగార పదాల్ని, చతుర్థ భాగంలో కీర్తనల్ని రచించాడు. ఇందులో అక్కడక్కడ వ్యావహారిక రూపాలుండి సహజంగా ఆ పదాలు మనోజ్ఞమై రసభావ పరిపుష్టికి కారణభూతమై ఒప్పుతున్నాయి.

ఇంతకంటె ద్వితీయ భాగంలోని దేశీయపదాలు శృంగార పదాలే అయినా అవి దేశీయ పదాలని నామకరణం చేయబడి ప్రజలకు మరీ సన్నిహితంగా ఉన్నట్లు రచించబడడం వల్ల వాటిలో శిష్ట వ్యావహారికం కనిపిస్తుంది. ఈ సందర్భంలో "ఈ శిష్ట వ్యావహారికంపై ఎంతో గౌరవాదరాలు గల మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి మాటల్ని స్మరించడం సమంజసమే." ఈ ద్వితీయ భాగమంతా మధురమై, రసవంతమై, పాత్రోచితమై సర్వవిధముల శ్లాఘా పాత్రమైయున్నది. సారంగపాణిగారు ద్వితీయ భాగంలో అనుసరించిన భాష నేటి రచనలకు లక్ష్యప్రాయమైయున్నది." "(గిడుగు) రామమూర్తి పంతులుగారు సారంగపాణి పదాలు ఎరుగుదురో ఎరగరో నేనుచెప్పలేను. కాని సారంగపాణిగారు ద్వితీయ భాగ రచనలో లక్ష్యరూపంగా చూపిన భాషయున్ను, రామమూర్తిగారు వాదనలలో స్థిరపరచిన భాషయున్ను ఒకటే. కాబట్టి సారంగపాణి గారిలో ఉన్న నూతనత్వానికిన్నీ, రామమూర్తిగారిలో ఉన్న ప్రాచీనత్వానికిన్నీ మనము ఆనందించవలెను."[3] ఈ పై వాక్యాలకు చక్కటి నిదర్శనం ఈపదం :

3. సమీక్ష : సారంగపాణిపదములు - పు. 32, 34

పల్లవి : ఒక ధూపములేదే నీసాక్షిగ
ఒట్టి పై బూటకమేనే యేమో

అను : ఇకముందర ముత్యాలకుళ్ళాయి
యెన్నడో బెట్టేనట యిప్పుడు॥ ॥ఒక॥

కానని నాసవతులు యీవూళ్ళో
కల్పించేందుకు దొడ్డాశ్చర్యము
కానావున్నది రామాయణమిది
లోనిగుట్టు పెరుమాళ్ళకు తెలివిడి॥ ॥ఒక॥

గుఱుగుఱు ఆలోచనలేగాని
కోమలి నేనొకపోడిమి యెఱుగను
అడిగి తెలుసుకొని పిమ్మటకాదను
తడకు దాసరి ప్రతిష్ఠవంటిది॥ ॥ఒక॥

ఏణాక్షిరో యీ సాంబ్రాజ్యానికి
యేమిటికే గాంధారితనాలు
వేణుగోపాలుడ ననుగూడి
వేళ్ళ వుంగరాలిచ్చేననేరు॥ ॥ఒక॥ (ప-116)

పల్లవిలోని, అనుపల్లవిలోనివాక్యాలు, చరణాల్లోనివాకా లు చక్కటివ్యావహారికభాషకు ఉదాహరణలు. నీసాక్షిగా, ఒట్టి పై బూటకమేనే, కానని నాసవతులు, దొడ్డాశ్చర్యము, కానావున్నది రామాయణము, లోనిగుట్టుపెరుమాళ్ళకు తెలివిడి — మొదలైనరూపాలు తక్కిన రెండుచరణాల్లోని వాక్యాలు సహజసుందరమైన వ్యావహారికం. ఇలా ద్వితీయభాగమంతా కన్పిస్తుంది. కాగా నాలుగోభాగంలోని కీర్తనల్లోను ఈవ్యావహారికం ఉంది.

"నిండుకొన్నదని కొందరు అరువు
నీయబ్బతోడని కొందరు తైంద

చేరేటందుకు (183)

వచ్చేటందుకు (74)

3.7. వింతప్రయోగాలు (విలక్షణ ప్రయోగాలు) :

కొన్ని విలక్షణప్రయోగాలు సారంగపాణిపదాల్లో కనిపిస్తాయి.

కోపాలుచేసేనే (10) (కోపగించుకొనెనే)

చెలుల మందగాగూర్చేవు (తిర్యక్కుల సమూహానికి 'మంద' అని వాడటం కద్దు.)

చులకతనము (చులకన)

ఎంతత్రాణదానవే (89)

తుసకారమనే (109) < తీస్కారమనే < తిరస్కారమనే

గాంధారి తనాలు (116)

వారానికి (119) [కోరుకు-కడప, అనంతపురపువాడుక.

కౌలుకి - ఉత్తరసర్కారులోని వాడుక.]

తాటాకు వ్రాసేయమని (131) (ఉత్తరం రాసేయమనడానికి)

బయిసారిపొయ్యేవు (132) బయిసి < బిగిసి

గర్వితొత్తు (135)-తిట్టు

పొంచులువిని (193)-పొంచివినడం (ఇదిక్షేత్రయ్యలోనూ ఉంది)

భీష్మకరించు (భీష్మించు అనడానికి బదులు)

వినికిచేసే (వినిపించే)

బంగరు గెట్లు (15) బంగారు దిమ్మలు (క్షేత్రయ్య వాడాడు)

3.8 అన్యదేశ్యాలు (Loan words) :

సారంగపాణి పదాల్లోని భాషలో సమకాలికంగా వాడుకలో ఉన్న అన్యదేశ్య పదాల్ని ప్రయోగించడం సహజమే. ఇలాంటి పదాలు అనేకం.

3.8.1 అరబ్బీ, ఉర్దూ, పారశీ, హిందీ :-

ఆత్తరు, అరే, అర్జీ

కరుచూ (< ఖర్చు), కుళ్ళాయి, కొజ్జా, కొత్వాల్‌గిరి

ఖాసా, ఖుల్ దారోగా, చీటీ

జముఖానా, జాబులు, జేబు, ఝాడజేసి, ఠాణా, తేవణీ, తంబురా, తురుష్కులు, దర్బారు, దివాలెత్తు, ధగిడీ, పక్కా, పాగ/గా, పావడా, పైజారు, బత్యాలు, బాపురే, బుక్కా, బుచేదారి, మహలు, రాజీ, (నీయింటికి) రాంరాం, రుమాలు, లష్కరు, వరహా, శాబాసు, శాలువా, శీనా, సంబళాలు, సదరు, సలాము, సుబేదారుడు, స్వారి.

3.8.2 కన్నడం :- బీగ (మాయె), హద్దు, హాయి, హాసు,

3.8.3 తమిళం :- తిరు (వీధి), తిరు (వీసము), నంబి, పిళ్ళ (పిళ్ళారయ వలె), సీమాటి.

3.9 వ్యావహారిక భాష :-

సందర్భోచితంగా ఇతఃపూర్వం వ్యావహారిక భాషను స్పృశించడం జరిగింది. సారంగపాణి పదాల్లో వ్యావహారికభాష ఎలాఒదిగి, ఆ పదాలకే ఎలా వాసి వన్నె దెచ్చి పెట్టిందో పరిశీలిద్దాం.

3.9.1

సారంగపాణి పదాలు నాలుగు భాగాలుగా ఉన్నాయనీ, అందులో ప్రథమ, చతుర్థ భాగాల్లోని శృంగార పదాలు, కీర్తనలు చాలావరకు లక్షణ యుక్తంగాను, ద్వితీయ తృతీయ భాగాల్లోని దేశీయ జాతీయపదాలు శిష్ట శిష్టేతర వ్యావహారిక రూపంలో ఉన్నాయన్న విషయం పూర్వోక్తం. అయినా శృంగార పదాల్లోను, కీర్తనల్లోను వ్యావహారిక రూపాలు లేకపోలేదు. శృంగారపదాలు గ్రామ్యోక్తియుక్తంగా ఉండవచ్చు.

3.6 క్రియలు :

సారంగపాణి పదాల్లో మొదటి భాగంలోని శృంగార పదాల్లోను, చతుర్థ భాగంలోని కీర్తనల్లోను, వ్యాకరణ బద్ధమైన క్రియారూపం గోచరిస్తుంది. ద్వితీయ భాగంలోని దేశీయ పదాల్లో శిష్టవ్యావహారికాన్ని, తృతీయ భాగంలోని జాతీయ పదాల్లో పామరప్రజల వాడుకభాషని తదనుగుణమైన క్రియల్ని ప్రయోగించినట్లు స్పష్టం.

3.6.1 ఇచ్చుమున్నగు చువర్ణాంత ధాతువుల, చేయు మొదలైన యువర్ణాంత ధాతువుల మీది ఆద్యక్షరంమీది భాగానికి 'స్తే' ఆదేశం అవుతుంది.

ఇస్తివి, చూస్తివి, చేస్తిని, తీస్తివి, లేస్తివి

3.6.2 చేదర్థకంలో : వచ్చితే < వచ్చిన

తెస్తే < తెచ్చిన

ఉంగరాలిస్తే < ఉంగరాలిచ్చిన

మ్రొక్కితే < మ్రొక్కిన

3 6.3 ఉభయప్రార్థనలో : వీణె వింటామంటి

కూడియుండాము

చూతామనుచు

3.6.4 చేతురు, కోతురు లాంటి రూపాల్ని లాక్షణికు లంగీకరించలేదు. ఇలాంటి వెన్నో ఉన్నాయి.

నెయ్యము సేతుర

భంగముజేతురు

పదిపేతురు

3.6.5 ఇచ్చునకు సర్వంబునకీయగు :

(బా. వ్యా – క్రియా - 92)

శఃలక్షణాను గుణమైన ప్రయోగాలున్నాయి.

కౌగిలీర, ఉత్తరమీక

దీని విరుద్ధరూపాలనేకం :

ఇంతికీయలేక, రానీయకే, ఇచ్చినపంచిదే, ఇవ్వకున్నామంచిదే.

3.6.6 సాహాయ్యక క్రియగా కొనుధాతు వను ప్రయుక్తమైనప్పుడు – క – కో పదాంశాలు కన్పిస్తున్నాయి.

పిలుచుక, ఏలుకోర, గురుతిచ్చెనుకోర

3.6.7 ధాత్వాదుల కనుప్రయుక్తమయినప్పుడు 'వ' 'వ'కారాది ధాతువుల తొలిహల్లు లోపించిన ప్రయోగాలున్నాయి.

భ్రమలుట్టె (< భ్రమలు + పుట్టె)

లేసొచ్చేవా (లేచి + వచ్చేవా)

ఈదెంబడెల్లొచ్చే (< వీధి + వెంబడి + వెళ్ళి + వచ్చె)

ఇసికేస్తే (< ఇసుక + వేస్తే)

చుట్టొచ్చిరి (< చుట్టి + వచ్చిరి)

3.6.8 బోసేసితివట (13)

భోంచేసి (88) భోం + చేసి < బోనం < ప్రాకృతః భోణ

భోయణ < (సంస్కృ : భోజన) [2]

దీనికి పామరులవాడుకలో 'బోసేసితివట' రూపమేర్పడింది.

3.6.9 తద్ధర్మార్థక క్రియావిశేషణాలు :

చేసేటంతలో (టుగాగమం)

---

2. ప్రొఫెసర్ తుమాటిదొణప్ప – తెలుగుహరికథా సర్వస్వం. పుట – 329

3.6 క్రియలు :

సారంగపాణి పదాల్లో మొదటి భాగంలోని శృంగార పదాల్లోను, చతుర్థ భాగంలోని కీర్తనల్లోను, వ్యాకరణ బద్ధమైన క్రియారూపం గోచరిస్తుంది. ద్వితీయ భాగంలోని దేశీయ పదాల్లో శిష్టవ్యావహారికాన్ని, తృతీయ భాగంలోని జాతీయ పదాల్లో పామరప్రజల వాడుకభాషని తదనుగుణమైన క్రియల్ని ప్రయోగించినట్లు స్పష్టం.

3.6.1 ఇచ్చుమున్నగు చువర్ణాంత ధాతువుల, చేయు మొదలైన యువర్ణాంత ధాతువుల మీది ఆద్యక్షరంమీది భాగానికి 'స్తొ' ఆదేశం అవుతుంది.

ఇస్తివి, చూస్తివి, చేస్తిని, తీస్తివి, లేస్తివి

3.6.2 చేదర్థకంలో : వచ్చితే < వచ్చిన

తెస్తే < తెచ్చిన

ఉంగరాలిస్తే < ఉంగరాలిచ్చిన

మ్రొక్కితే < మ్రొక్కిన

3.6.3 ఉభయప్రార్థనలో : పీణె విందామంటి

కూడియుందాము

చూతామనుచు

.6.4 చేతురు, కోతురు లాంటి రూపాల్ని లాక్షణికు లంగీకరించలేదు. ఇలాంటి వెన్నో ఉన్నాయి.

నెయ్యము సేతురు

భంగముజేతురు

పదివేతురు

.6.5 ఇచ్చునకు సర్వంబునకీయగు :

(బా. వ్యా - క్రియా - 92)

ఈలక్షణాను గుణమైన ప్రయోగాలున్నాయి.

కౌగిలీర, ఉత్తరమీక

దీని విరుద్ధరూపాలనేకం :

ఇంతికీయలేక, రానీయకే, ఇచ్చినమంచిదే, ఇవ్వకున్నామంచిదే.

3.6.6 సాహాయ్యకక్రియగా కొనుధాతు వనుప్రయుక్తమైనప్పుడు - క - కో వదాంశాలు కన్పిస్తున్నాయి.

పిలుచుక, ఏలుకోర, గురుతిచ్చెనుకోర

3.6.7 ధాత్వామల కనుప్రయుక్తమయినప్పుడు 'ప' 'వ'కారాది ధాతువుల తొలిహల్లు లోపించిన ప్రయోగాలున్నాయి.

భ్రమలుట్టె (< భ్రమలు + పుట్టె)

లేసొచ్చేవా (లేచి + వచ్చేవా)

ఈదెంబడెల్లొచ్చే (< వీధి + వెంబడి + వెళ్ళి + వచ్చె)

ఇసికేస్తే (< ఇసుక + వేస్తే)

చుట్టొచ్చిరి (< చుట్టి + వచ్చిరి)

3.6.8 బోసేసితివట (13)

భోంచేసి (88) భోం + చేసి < బోనం < ప్రాకృత: భోణ భోయణ < (సంస్కృ : భోజన)[2]

దీనికి పామరులవాడుకలో 'బోసేసితివట' రూపమేర్పడింది.

3.6.9 తద్ధర్మార్థక క్రియావిశేషణాలు :

చేసేటంతలో (టుగాగమం)

---

2. ప్రొఫెసర్ తుమాటిదొణప్ప - తెలుగుహరికథా సర్వస్వం. పుట - 329

చేరేటందుకు (183)

వచ్చేటందుకు (74)

3.7. వింతప్రయోగాలు (విలక్షణ ప్రయోగాలు) :

కొన్ని విలక్షణప్రయోగాలు సారంగపాణిపదాల్లో కనిపిస్తాయి.

కోపాలుచేసేనే (10) (కోపగించుకొనెనే)

చెలుల మందగాగూర్చేవు (తిర్యక్కుల సమూహానికి 'మంద' అని వాడటం కద్దు.)

చులకతనము (చులకన)

ఎంతత్రాణదానవే (89)

తుసకారమటే (109) < తీస్కారమటే < తిరస్కారమటే

గాంధారి తనాలు (116)

వారానికి (119) [కోరుకు-కడప, అనంతపురపువాడుక. కొలుకి - ఉత్తరసర్కారులోని వాడుక.]

తాటాకు వ్రాసేయమని (131) (ఉత్తరం రాసేయమనడానికి)

బయిసారిపొయ్యేవు (132) బయిసి < బగిసి

గర్వితొత్తు (135)-తిట్టు

పొంచులువిని (193)-పొంచివినడం (ఇదిక్షేత్రయ్యలోనూ ఉంది)

భీష్మకరించు (భీష్మించు అనడానికి బదులు)

వినికిచేసే (వినిపించే)

బంగరు గెల్లు (15) బంగారు దిమ్మలు (క్షేత్రయ్య వాడాడు)

3.8 అన్యదేశ్యాలు (Loan words) :

సారంగపాణి పదాల్లోని భాషలో సమకాలికంగా వాడుకలో ఉన్న అన్యదేశ్య పదాల్ని ప్రయోగించడం సహజమే. ఇలాంటి పదాలు అనేకం.

3.8.1 అరబ్బీ, ఉర్దూ, పారశీ, హిందీ :-

అత్తరు, అరే, అర్జీ

కరుచూ (< ఖర్చు), కుళ్ళాయి, కొజ్జా, కొత్వాల్‌గిరి

ఖాసా, ఖుల్ దారోగా, చీటీ

జముఖానా, జాబులు, జేబు, ఝూడజేసి, తాజా, తేవణి, తంబురా, తురుష్కులు, దర్బారు, దివాలెత్తు, ధగిడీ, పక్కా, పాగ|గా, పావడా, పైజారు, బత్యాలు, బాషురే, బుక్కా, బుడేదారి, మహలు, రాజీ, (నీయింటికి) రాంరాం, రుమాలు, లష్కరు, వరహా, శాబాసు, శాలువా, శీనా, సంబళాలు, సదరు, సలాము, సుబేదారుడు, స్వారి.

3.8.2 కన్నడం :- బీగ (మాయె), హద్దు, హాయి, హౌసు,

3.8.3 తమిళం :- తిరు (వీధి), తిరు (వీసము), నంబి, పిళ్ళ (పిళ్ళారయ వలె), సీమాటి.

3.9 వ్యావహారిక భాష :-

సందర్భోచితంగా ఇతఃపూర్వం వ్యావహారిక భాషను స్పృశించడం జరిగింది. సారంగపాణి పదాల్లో వ్యావహారికభాష ఎలాఒదిగి, ఆ పదాలకే ఎలా వాసి వన్నె దెచ్చి పెట్టిందో పరిశీలిద్దాం.

3.9.1

సారంగపాణి పదాలు నాలుగు భాగాలుగా ఉన్నాయనీ, అందులో ప్రథమ, చతుర్థ భాగాల్లోని శృంగార పదాలు, కీర్తనలు చాలావరకు లక్షణ యుక్తంగాను, ద్వితీయ తృతీయ భాగాల్లోని దేశీయ జాతీయపదాలు శిష్ట శిష్టేతర వ్యావహారిక రూపంలో ఉన్నాయన్న విషయం పూర్వోక్తం. అయినా శృంగార పదాల్లోను, కీర్తనల్లోను వ్యావహారిక రూపాలు లేకపోలేదు. శృంగారపదాలు గ్రామ్యోక్తియుక్తంగా ఉండవచ్చు.

"పదములు శృంగారవధూ
మృదుమధుర మనోజ్ఞవాక్య మిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁబొంక మెఱఁగి పలుకఁగజెల్లున్"
(తాళ్ళపాక చిన తిరుమలయ్య : సంకీర్తనలక్షణము – ప. 56)

కానీ వైరాగ్యపదాలు అలాగాక "అగ్రామ్యరమ్య విష్ణుచరితోదారమై" ఉండటం అవసరం. వీటినే ఆధ్యాత్మిక పదాలంటారు. అన్నమయ్య ఈ రెండు విధాలైన పదాల్ని రచించాడు. అదేరీతిని సారంగపాణి సైతం ప్రథమభాగంలో శృంగార పదాల్ని, చతుర్థ భాగంలో కీర్తనల్ని రచించాడు. ఇందులో అక్కడక్కడ వ్యావహారిక రూపాలుండి సహజంగా ఆ పదాలు మనోజ్ఞమై రసభావ పరిపుష్టికి కారణభూతమై ఒప్పుతున్నాయి.

ఇంతకంటె ద్వితీయ భాగంలోని దేశీయపదాలు శృంగార పదాలే అయినా అవి దేశీయ పదాలని నామకరణం చేయబడి ప్రజలకు మరీ సన్నిహితంగా ఉన్నట్లు రచించబడడం వల్ల వాటిలో శిష్ట వ్యావహారికం కనిపిస్తూంది. ఈ సందర్భంలో శిష్ట వ్యావహారికంపై ఎంతో గౌరవాదరాలు గల మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి మాటల్ని స్మరించడం సమంజసమే." ఈ ద్వితీయ భాగమంతా మధురమై, రసవంతమై, పాత్రోచితమై సర్వవిధముల శ్లాఘా పాత్రమైయున్నది. సారంగపాణిగారు ద్వితీయ భాగంలో అనుసరించిన భాష నేటి రచనలకు లక్ష్యప్రాయమై యున్నది." "(గిడుగు) రామమూర్తి పంతులుగారు సారంగపాణి పదాలు ఎరుగుదురో ఎరగరో నేనుచెప్పలేను. కాని సారంగపాణిగారు ద్వితీయ భాగ రచనలో లక్ష్యరూపంగా చూపిన భాషయున్ను, రామమూర్తిగారు వాదనలలో స్థిరపరచిన భాషయున్ను ఒకటే. కాబట్టి సారంగపాణి గారిలో ఉన్న నూతనత్వానికిన్నీ, రామమూర్తిగారిలో ఉన్న ప్రాచీనత్వానికిన్నీ మనము అనందించవలెను."[3] ఈ పై వాక్యాలకు చక్కటి నిదర్శనం ఈపదం :

---

3. సమీక్ష : సారంగపాణిపదములు – పు. 32, 34

పల్లవి : ఒక ధూపములేదే నీసాక్షిగ
ఒట్టి పై బూటకమేనే యేమో

అను : ఇకముందర ముత్యాలకుళ్ళాయి
యెన్నడో బెట్టేనట యిప్పుడు॥ ॥ఒక॥

కానని నాసవతులు యీవూళ్ళో
కల్పించేందుకు దొడ్డాశ్చర్యము
శానావున్నది రామాయణమిది
లోనిగుట్టు పెరుమాళ్ళకు తెలివిడి॥ ॥ఒక॥

గుటుగుటు ఆలోచనలేగాని
కోమలి నేనొకపోడిమి యెఱుగను
అడిగి తెలుసుకొని పిమ్మటకాదను
తడకు దాసరి ప్రతిష్ఠవంటిది॥ ॥ఒక॥

ఏణాక్షిరో యీ సాంమ్రాజ్యానికి
యేమిటికే గాంధారితనాలు
వేణుగోపాలుడ ననుగూడి
వేళ్ళ వుంగరాలిచ్చేననేరు॥ ॥ఒక॥ (ప-116)

పల్లవిలోని, అనుపల్లవిలోనివాక్యాలు, చరణాల్లోనివాకా లు చక్కటివ్యావహారికభాషకు ఉదాహరణలు. నీసాక్షిగా, ఒట్టి పై బూటకమేనే, కానని నాసవతులు, దొడ్డాశ్చర్యము, శానావున్నది రామాయణము, లోనిగుట్టుపెరుమాళ్ళకు తెలివిడి — మొదలైనరూపాలు తక్కిన రెండుచరణాల్లోని వాక్యాలు సహజసుందరమైన వ్యావహారికం. ఇలా ద్వితీయభాగమంతా కన్పిస్తుంది. కాగా నాలుగోభాగంలోని కీర్తనల్లోను ఈవ్యావహారికం ఉంది.

"నిండుకొన్నదని కొందరు అరువు
నీయబ్బతోదని కొందరు తైంద

పిండిసరాలె శిత్తయండలో నిలబడి
పుండొద్దు మాయేపి పుదురు మిడుకనేరు
వాసొద్దువద్దని కొందరు సూతాం
తీసపొయ్యేదని కొందరు యీ
దాసరోల్ల వల్బతరమా కాపిరెంసేయ
యిసుల్ల పుట్టెనోళ్ల యిరబడిందనెరహహ
చెయ్యితీరదని కొందరు నేడు
వెయ్యనేరాదని కొందరు బిగ్గె
కుయ్యవద్దు నోర్ముయ్యనుచు రాగ
గయ్యాళి బైటికిగదిమి పొమ్మనె కృష్ణా
పెద్దలు లేరని కొందరు నేడు
తద్దిన మనేవారు కొందరు నిలువు
టద్దములో కొప్పుదిద్ది చూడనేగాని
కద్దులేదనరు యీకలికాల మహిమేమో
మించింది పేళని కొందరు వడ్లు
మీకు బెట్రాదని కొందరు ఆబెడె
సంచినిండ వచ్చె పైరాసై యని అనుమా
నించి రేపు రమ్మనే వింతయిదియేమో (వ-194)

మరికొన్ని వ్యావహారికా రూపాలు :

అనిపించింది, ఏండ్లు శానాచెల్లిన వృద్ధుకు, కప్పడమాయె, కొందరు గిల్లి విదిలించరు – గీపెట్టినగాని, గోజార కేసింది, చూడడమాయె, చూతామని, చూసే టందుకు, చీరలక్కారలే, చేతికిత్తామని, ఝుడుతునా, తపించుకొంటేని, విడుతునా, నీవొల్లోని గింజలేవి సూపమనేరు, పుణ్యానికే, పూయడమాయె, పెండ్లిజేసుట శాబా సని, బహుశా, బహుమెండాయె, మల్లాడేకొద్ది, మీకుబెట్రాదని, సంమందము (సంబంధము).

ఇలా పదాలన్నింటిలో ఈరూపాలు కనిపిస్తాయి. పైగా వీటిని వ్యస్తంగా గాకుండా ఆయాపదాల్లో సందర్భోచితంగా చదివినపుడు రసభావస్ఫోరకమై, ఆనంద నిష్యందములై ఉంటాయన్నవిషయం సహృదయైకవేద్యం.

3.9.2 రాయలసీమ వ్యావహారికం :

సారంగపాణి పదాల్లోని భాషప్రధానంగా రాయలసీమ వ్యావహారికమునూ, ప్రత్యేకించి చిత్తూరు మాండలికమునూ. అయినా తదితరమాండలికాలు - అంటే రాయలసీమకంతా సమానమైనవి - లేకపోలేదు. పూర్వోక్తమైనట్లు తృతీయభాగం లోని జాతీయపదాలు రాయలసీమకు ముఖ్యంగా చిత్తూరుకు సంబంధించినవి. అంటే పామరజనోచిత వాడుకభాషని సారంగపాణి ప్రయోగించాడు. దీన్నేమండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు పాత్రోచితమైన భాషఅంటూ పేర్కొన్నారు. ఒకఉదాహరణ పూర్వోక్తమైన పదం :

"పల్లవి : ఆగ్గితిరణాలంట అజ్జానికతలంట
అవురాయెంత సోద్దెమే
బారతకత - బౌరాయెన్నెంతలే

అను : సుగ్గీజయము దీని సుట్టుబలాదూరు
అగ్గురోరపు అయ్యోర్నడిగే నీసాచ్చిగ (ప-153)

దీనిలో పామర ప్రజల నోళ్ళలో నలిగిన సంస్కృత పదాలు వారి వాడుకకు తగినట్లు, అమరినట్లు ఒదిగిపోయాయి. మరొకటి ఉదాహరణ - పూర్వోక్తమైన పదం :

"పల్లవి : నానార్థము చంత్లో నానాదించుందెంట
నయము గిచ్చేరంటనె - సూడే

అను : ఈన్నె పొద్దెక్కేనే - యీడేడుండా - దెంబె
కోణ్ణిగొండపోతె - కొందురే వొగుర్లైన" (ప-154)

ఇందులో రాయలసీమలోని సామాన్య జనులవాడుకరూపాలెన్నో ఉన్నాయి. 'నానాదించుందెంట, ఈన్నేపొద్దెక్కనే, యీడేసుండాదెంటే, కోణ్ణి కొండపోతె కొందురే బొగురైన, యీసుల్లె మగ్గపే, మలుగు శాపలాడ మస్తంటనె, అలసొచ్చేతల్కీడ, మేడొల్ల శీన్నెంగు మెట్టల కంటొచ్చి, పది దోచలుతిన్నో రెంసు కోని, అడసిల్లు దాగి అగ్గె లేసురుకెత్తి"- ఇవన్నీ పామరుల వాడుకలో ఈనాడున్నాయంటే ఈ భాష ఎంత బలమైందో స్పష్టమవుతుంది. మరికొన్ని వాడుక రూపాలు.

సరిప్రొద్దు కాడ (11): పప్పుశీచిర (29); దిగ్గున (30); బిగ్గెకుయ్యా వద్దు (194); కణజాలాయె (83); జొబుజ్రటలు (117): పరుష (120) ఒకబోకి, గురకా యించితివో (131); ఒక్కపొద్దు (132); శానా, మడ్డిశరీరము (136); నడిమద్దెపు, అరుచోద్యం (146); వొకరితో సెప్పకనే రెయ్యి (147):కొరకొగ్గింజలే (148); శినోడపిగేతల్కి, యెంతసెప్పిన యినవు (151); పనికిమాల్నితొత్తా (130);ప్రొద్దు పోదేమె (16); నీయిశోసమగ్గిబడ, తానే రాకల్లాలకు దీసపోయి తైదలు వొణ్ణించ (151); యదబడు (195); చాలుచాలైంటట (124); వుండింది పండింది (140); మాట్లాడేకొద్దీ (125); ఇచ్చెలేద రూక (151);- మొదలైన ఈ రూపాలు ఈనాడు మనం పల్లెటూళ్ళలో, పామరుల నోళ్ళనుంచి వినవచ్చు. ఇది ఈనాడు బ్రతికి బట్ట గట్టిన భాష. పూర్వోక్తమైనట్లు ఇది రాయలసీమ వ్యావహారికమే అయినా, ప్రత్యే కించి చిత్తూరు మాండలికం అనడమే సముచితం. అయినా అనంతపురం మండలం లోను ఈ రూపాలన్నీ ఈనాడు వినిపిస్తూనే ఉంటాయి.

పై పరిశీలన వల్ల సారంగపాణి పండిత భాషనేగాక పామరుల వ్యావ హారిక భాషను కూడ ప్రయోగించాడని స్పష్టమైంది. తాను ఆస్థాన విద్వాంసుడైనా సామాన్య జన సన్నిహితంగా ఉండినట్లు సువిదితమైంది. కనుకనే అతని భాష ప్రజల భాష అతడు ప్రజాకవి !

# 4. శృంగారం-భక్తి

పూర్వప్రకరణాల్లో సారంగపాణి పదకవితాశిల్పమూ, భాషావైభవమూగూర్చి తెలుసుకొన్నాం. సారంగపాణి శృంగారపదరచనతోపాటు కీర్తనలు సైతం రచించాడు. ఈప్రకరణంలో వివిధవిధాలుగా వర్ణితమైన శృంగారరీతులు, భక్తి, మధుర భక్తి, నీతి, వైరాగ్య ప్రబోధాత్మకమైన పద్ధతుల్ని పరిశీలిద్దాం.

## 4.1 శృంగారరసం :

సారంగపాణి పదాల్లోని ప్రథమ ద్వితీయభాగాల్లోనిపదాలు శృంగారపదాలు, ఇవి శృంగారరస నిర్భరమై ఒప్పుతున్నాయి. శృంగారనాయికలు స్వీయ, పరకీయ, సామాన్య అని మూడువిధాలు. ఈత్రివిధ నాయికాశృంగారం మొదటి భాగంలోను రెండోభాగంలోని దేశీయపదాల్లో కేవలం పరకీయశృంగారాన్ని అభివర్ణించాడు సారంగపాణి. ఈత్రివిధనాయికల వయస్సు అనుభవంమొదలైన వాటినిబట్టి ముగ్ధ, మధ్య, ప్రౌఢఅని మూడువిధాలు. ఇంక శృంగారరస భావాల్నిబట్టి ఎనిమిదివిధాలైన నాయికలుగా విభజించడం జరిగింది. స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక-అని అష్టవిధనాయికలు. విభావానుభావ వ్యభిచారిభావాల సంయోగంవల్ల రసనిష్పత్తి అవుతుందని భరతముని రససూత్రం.[1] ఇట్లే విభానుభావ సాత్త్విక వ్యభిచారి భావాలచేత ఆస్వాద్యమానమైన స్థాయిభావమే రసమని దశరూపకం.[2] స్థాయిఅంటే స్థిరంగాఉండేది. స్థాయిభావమంటే

---

1. "విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" - నాట్యశాస్త్రం.
2. "విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః
   ఆనీయమానః స్వాదుత్వం స్థాయిభావోరసస్మృతః" - దశరూపకం.

రసస్ఫూర్తివరకు సహృదయ హృదయాల్లో నిలిచిఉండేది. ఆలంబన విభావమూ, ఉద్దీపన విభావమూనని విభావం రెండువిధాలు. నాయికా నాయకులు ఆలంబనవిభావం. రసాన్ని ఉద్దీపింపజేసేది ఉద్దీపనవిభావం. ఇది సహజమూ, తటస్థమూనని రెండు విధాలు. యౌవనం, భూషణాలు, చేష్టలు మొదలైనవి సహజోద్దీపన విభావములు. మలయానిలం, చంద్రుడు తటస్థోద్దీపన విభావం. విభావం కారణరూపంలోను, అనుభావాలు కార్యరూపంగాను ఉంటాయి. మనోభావాలైన హావభావాదులూ, అయాత్మజాలైన శోభ, కాంతి, దీప్తి మొదలైనవీ, స్వభావాదులైన లీలావిలాసం మొదలైనవీ, సాత్వికభావాలు. ఇతర శృంగారచేష్టలు అనుభావాలనబడతాయి. నాయికా నాయకుల హృదయాల్లో ఉత్పన్నమయ్యే సంభోగవిషయమైన అభిలాషని లేక కామాన్నిరతి అంటారు. స్త్రీపురుషుల అన్యోన్యాలంబనంగల ప్రేమఅనే చిత్తవృత్తి విశేషం రతిఅని రసగంగాధరం చెబుతూంది. ఈరతి అంకుర, పల్లవ, కలికా, ప్రసూన, ఫలభోగాలనే అవస్థల్లో ప్రేమ-మానప్రణయం, స్నేహం, రాగం, అనురాగం అని పిలువబడుతుంది. ఈశృంగారం విప్రలంభశృంగారం, సంభోగశృంగారం అనిరెండు విధాలు. సంభోగశృంగారం కేవల సురతరూపంలోనేగాక దర్శనం, ఆలింగనం, చుంబనంమొదలైన అనేకవిధాలుగా ఉన్నా వీటన్నిటిని కలిపి సంభోగశృంగారం అంటారు. విప్రలంభమంటే వియోగం. ఇదిఅభిలాష (అయోగ లేక పూర్వరాగ) విప్రలంభం; మానవిప్రలంభం, విరహవిప్రలంభం, ప్రణయవిప్రలంభం అని నాలుగువిధాలు. ప్రణయమానమూ, ఈర్ష్యామానమూ నని రెండువిధాలు.

ఇట్లీ శృంగారం ఇన్ని విధాలుగా విస్తరించింది. ఇన్ని విధాలైన శృంగారాన్ని తమ పదాల్లో అభివర్ణించి తరించిన ఉత్తమ వాగ్గేయకారులు క్షేత్రయ్య, సారంగపాణి, సభాపతి, పరిమళ రంగపతి మొదలైనవారు. క్షేత్రయ్య ఎక్కువగా స్వీయనాయికలా ఆ తరువాత పరకీయ నాయికలా శృంగారాన్ని సామాన్య నాయిక శృంగారాన్ని తక్కువగాను అభివర్ణించాడు. ఇతడు ఎన్నిక చేసిన స్వీయ నాయికా శృంగారాన్ని బట్టి అతని పదాలకు ఉదాత్తత చేకూరింది. సారంగపాణి సామాన్య

శృంగారం ఎక్కువగా వర్ణించాడు. పరకీయ శృంగారాన్ని వర్ణించినా దాన్నితడు గర్హించాడు. కానీ సామాన్య నాయికా శృంగార వర్ణనలో క్షేత్రయ్య కంటె కూడ సారంగపాణి వాస్తవ జీవితానికి సన్నిహితంగా ఉన్నట్లు తోస్తాడు. కారణం సామాన్య జనజీవన విధానాన్ని చక్కగా సారంగపాణి పదాల్లో అభివర్ణించిన సంగతి, ప్రజాభాషని ప్రయోగించిన విషయమూ పూర్వోక్తం. క్షేత్రయ్య లాగానే సారంగపాణి తన పదాల్ని శృంగార రస నిర్భరంగా రచించాడు. ఈ శృంగార పదం ఒక్కొక్కటీ ఒక్కొక్క ముక్తకం; దేనికదే స్వయం సంపూర్ణమై రసభావాది పరిపోషకమై ఉంటుంది. ఇందులో నాయకుడు వేణుగోపాలుడు: దక్షిణ నాయకుడు. నాయికలు అనేకలు, నాయకుని పై ఆయా పదాల్లోని నాయికలకు అనురాగముంది. నాయిక యందు నాయకుడు రతి చిత్తం గలవాడు. కాబట్టి ఆ నాయికా నాయకుల రతి స్థిరమైనది. అది స్థాయి కృతమవుతుంది భావోద్దీపకమైన సామగ్రి ప్రతి పదంలోను ఉంది. నాయికకు నాయకుడు, నాయకునికి నాయిక పరస్పరం ఆలంబనం. ఆయా నాయికల హావభావాది శృంగార విలాసాదులు అనుభావాలు. నాయికస్థాయి రతిసాగరంలో అసూయాదులు, శంకాదులు, ఉత్సాహాదులు లీనమై అనితర శోభని చేకూరుస్తుంటాయి. ప్రియ దర్శనాదులవల్ల కలిగే నాయిక సాత్విక స్థితి పదాల్లో ఉంది. విభావాదుల సంయోగం వల్ల రతి స్థాయి శృంగార రస పర్యవసాయి అయి ప్రతి పదం సహృదయ హృదయంగమమై ఉంటుంది. ఈ వివరణకు ప్రతిపదమూ ఉదాహరణమే. పైని పేర్కొన్న పలురకాల శృంగార రీతులకు చక్కటి ఉదాహరణలు చూపించవచ్చు. నాయికా నాయకుల ఉత్తమ గుణ వర్ణనగల పదాలున్నాయి. ఒక చెలి నాయికా గుణాల్ని వర్ణిస్తూందిపూర్వోక్తమైన ఈ పదంలో "వరకన్యా. రతిని" (7); నాయకుడు నాయికా సంశయ విచ్ఛేదం చేస్తున్నాదీ పదంలో "ఏమిటికే.... ....కొందురే (9) ఇదీ పూర్వోక్తమే. ఇందులో నాయికా నాయకుల గుణాలు వర్ణితం. ఇది నిర్మలమైన నాయికా నాయకుల చక్కటి ప్రేమకు నిదర్శనం:

"పల్లవి : నేను నీవు కనుగొన్న వేళే మొగ
 నేత్రము బాయదుగా మరిమరి
 నెమ్మది గలిగెనుగా

అను : మేను నీ సొమ్మని యానలిడుకొని
మెచ్చితి యీడన వేణుగోపాలుడని ॥నేను॥

చిన్ననాడు పండు వెన్నెలలో యిసుక
దిన్నెలపై సురపొన్నల పొన్నన
పన్నీరు జల్లుక పవళించె లాహిరై
యెన్నొన్నొ విధముల యెదనెద నదుముక ॥నేను॥

ఊరినుంచి కలలోవచ్చి పైకొన్నట్లు
పులికి దిగ్గునలేచి నే నెదిరించినట్లు
తీరుగాదని డింకి తిరిగి సొలసినట్లు
చేరి లెమ్మన్నట్లు చైచై పట్టినట్లు ॥నేను॥

మగడు వినిన చుట్టము లెడబాసిన
తగదని భూపతి దండన జేసిన
అగడైనా యెంత పాపము వచ్చిన
జిగి జిగి సొగసుగ వగలు పెనగొన ॥నేను॥ (ప-67)

కానీ కేవలం సంభోగ శృంగార వర్ణితమైన పదాలనేకం ఉన్నాయి.

వల్లవి : ఎంతదుడుకు జేసెనే - ఓభామా న
న్నెంత దుడుకుజేసెనే

అను : ఎంత దుడుకుజేసె - నెవరితో దెలుపుదు యీ
వింత కార్వేటినగర - వేణుగోపాల రాయ ॥డెంత॥

గంటీలు బెట్టివాలు - గంటీ నామోవిపలు
గంటీలుజేసిన త్రాణ - గంటీ వేమే
యొంటిపాటున యిటు - వంటిపనులయితే ర
వ్వంటి కమ్మచెల్లనా - వంటిదానివిఠాతి ॥రెంత॥ (ప-14)

"కుటిలకుంతలి విను నిన్నటిరేయి విరితోటా
కటుల రమ్మనెనట విటరాయడిటుల ఆ
విటుకులాడిని బిగి కౌగిటజేర్చి మేటౌ చా
కటులిచ్చినాడట యెటుల సైతునెనిచటా
కొమ్మరమ్మని నినేనమ్మినానని విభుడా
యెమ్మెలాడి జడనుకమ్మని మరువంపు
రెమ్మలు సవరించి సొమ్ములుధరియించి
నెమ్మది గూడినాడమ్మ మనమ్మున" (ప-63)

ఈపదాల్లో ఆలింగనం, చుంబనం, కుచగ్రహణం, సురతం మొదలైన వాటితో పాటు సంభోగశృంగారం వర్ణితం. ఇలాగే ద్వితీయభాగంలోని దేశీయ పదాలన్నింటా ఈ సంభోగశృంగారం వివిధరీతుల వర్ణించబడింది

కాగా నాల్గువిధాలైన విప్రలంభ శృంగారమూ సారంగపాణి పదాల్లో మనం చూడగలం. "వినా విప్రలంభేన సంయోగః పుష్టి మశ్నుతే" అని గదా లాక్షణిక మతం! విప్రలంభం లేకపోతే సంయోగానికి పుష్టి తుష్టి ఉండదని అర్థం. ఈ విప్ర లంభ శృంగారాన్ని మహాకవు లెందరో ఉదాత్తంగా వర్ణించి తరించారు. సారంగ పాణి పదాల్లోను ఈ లాంటి ఉదాత్త విప్రలంభ శృంగారం లేకపోలేదు.

అభిలాష విప్రలంభం :

"పల్లవి : దానిప్రాయము పదారేండ్లనీ - దాని నేలుకోరా

అను : సానిధా పనికి హోంతకారి - సామి వేణుగోపాలరాయ ॥దాని॥

సారిరాగా మాపటివేళ - దారిని గాంచి
నీరూప మనిశము మది దలచుచు - నిదుర గానదురా
నీరాకే కోరి సన్నిధి - నీ రీతిగాను గాంచినదిరా
దారిగా మాటాడవు నీదయ - దాని యేచుట నీతిగాదు అల ॥దాని॥

మగధ పాంచాల దేశముల గల - మగువలైన మాగరితెకు సరిగారు
మగని పేరడుగ మాధవుండను - మదిరాక్షులతోను
మగరాల పతకము పదివేలది - మచ్చకంటి గురుతిచ్చెను కోరా
సగము రేయి దాకా పదముబాడి - సారె మెప్పించు నిలువరమ్ముగ
॥దాని॥ (వ-2)

ఇందులో నాయికకు నాయకునిపై గల పూర్వరాగాన్ని ఒక చెలి వర్ణించి చెప్పింది ఇది మిక్కిలి ఉదాత్తాన్వితమై ఒప్పుతూంది.

మానవిప్రలంభం :

ఇది రెండువిధాలు. ప్రణయమానం; ఈర్ష్యా మానం.

ప్రణయమానం :

"పల్లవి : ఒట్టు బెట్టుదుసుమ్మీ వలదు యీసరసాలు
అను : పట్టకురా నాకొంగుగట్టిగ వేణుగోపాల ॥ఒట్టు॥

ఇందుంటేవకమాట యిలువెడలితే వకమాట
దందనకాడా రా నీదయలెల్ల దెలిసే
యెందుకు వేడుకొనేవు యెవ్వరునేర్పిరి చిన్నెలు
సుందరివలె నీకైన అందగత్తెనుగాను ॥ఒట్టు॥

ఎక్కడ నీమదికితవో యెవతెకు నీపై నెనరో
అక్కడికే పోవలెగా కిక్కడపనియేమీ
కక్కసమున వకటంటె కానిది యనిపించుటకా
చక్కగ నీవెందైనా చల్లగయుండుటె చాలు ॥ఒట్టు॥ (వ-51)

- నాయిక నాయకునిపై తనకుగల ప్రణయమానం ప్రకటిస్తూంది. ఇలాగే "చాలుచాలు వానినేస్తము" (వ-68) - అని నాయికనాయకునిపై గలప్రణయ మానాన్ని వ్యక్తంచేస్తూంది.

ఈర్ష్యామానం :

నాయిక తనకుగల ఈర్ష్యామానాన్ని ఇలా ప్రకటిస్తూంది.

"పల్లవి : ఎందుకుబొంకేవురా లేదని నాతో
యెమ్మెలు సేయకురా

అను : ముందరివాడవా వేణుగోపాల నీ
ముచ్చు పగలమానరా నాసామి ॥ఎందుకు॥

నిన్నదానింటికి పోలేదో
నీవది నన్నాడుకోలేదో
అన్నియిపుడే తార్కాణగాదో
యౌరయిట్లయితే కోపమురాదో ॥ఎందుకు॥

సరసాలాడుకోలేదో
సన్నజాజులు జెడనుంచలేదో
పరిమళమలదలేదో
భామచే పీడెమందుకోలేదో ॥ఎందుకు॥ (ప-53)

ఇలాగే "ఇంతసేసిన యింతి యిగనెంతసేయదే" (ప-28) - అని నాయిక తనచెలితో చెబుతూంది.

విరహవిప్రలంభం :

ఈ విరహ విప్రలంభ శృంగారానికి అనేకోదాహరణ లున్నాయి. చల్లటి వెన్నెల, మలయానిలాలు మంటలు రేపడం; కోయిల పలుకులు, తుమ్మెద రొదలు కటువుగావడం; శైత్యోపచారాలు చేయడం మొదలైన ప్రబంధ రీతిలోని విరహ వర్ణనలు అనేకం ఇందున్నాయి. నాయికా నాయకులు విరహ వ్యథాభరిత మనస్కులై చెక్కిట చేయిచేర్చి ఉండడం సామాన్యమే. రెండో ప్రకరణంలో

వర్ణనల్లో యిలాంటి వాటిని వివరించడం జరిగింది. నిర్మల ప్రేమతో విరహిణి అయిననాయిక చెలితో చెప్పి బాధపడడం ఈ పదంలో ఉంది :

"పల్లవి : ఏమిసేతు విరహ వేదన
యెంతని తాళ కొందునమ్మా

అను : సామినాపై ప్రేమమరచె
నామదికెంతో దిగులుదోచె ॥ఏమి॥

కోరినకోరికె కొదవలాయె - కూరిమెల్ల వెగటాయె
వారచూపులే జూడడమాయె - వంచనదైవము పగదాయె ॥ఏమి॥

తలచితలచి వగచుటాయె - నిలిచినచోట నిలువదాయె
చెలియరో యన్నమునైచదాయె - చిత్తము వానిపైనుండదాయె
॥ఏమి॥ (ప-45)

పరోనాయిక విరహ వ్యథాభరిత మనస్క-అయి చెలితో ఈవిధంగా స్పష్టం చేస్తూంది :

"పల్లవి : తటుకుతటుకుమని యదిరీనె గుండె
దిటవులేదె నీసాక్షిగా

అను : కుటిలకుంతల యన్నృణ సరోవర
మటప్రసన్న వేంకటశౌరి మొన్న
చిటికెలో వలపించిపోయెనే
నెటులనైతు దెలుపవె నారొమ్మున ॥తటుకు॥

నిలువనీయదు నిలిచినచోట - నిమిషమొక్క యుగమాయెనే
పలుకనీదు ప్రాణసఖులమీధి - బాళియెవుడు మరుపాయెనే
తలచితలచి వేదనచే గుందితి - తలవాకిటనిలచి యెదురుచూచితి
లలన యీతనిపై రోసితి - చెలువరాయని బాసినమొదలుగ
॥తటుకు॥ (ప-73)

నాయకుడు తన విరహబాధను సువ్యక్తంచేస్తూ నాయికను వేడుకోవడం ;

"పల్లవి : వలచితినే నీపై ముద్దుబాలా
తలచితే నామది

అను : తాళదు విరహమగ్గలమాయె
వంచనమానవే మంచి మాటాడవే
సంచునబాడవే పంచశరుని చిలుకా
యించుబోణుల మేటివంచు సభాస్థలివిని నే ॥వలచి॥" (ప-49)

"పల్లవి : కుందరదన నాపై కూరిమి మరచితో
కొసరివేడిన పలుకవేమె ఆజాణే

అను : సుందరీమణి వడిసుఖ్ఖబెట్టుచు యిట్లా
యెందుకు యేచేవుయికనైన దయచూడవె ॥కుంద॥

కలనైనా మరువజాలనే నిన్ను
గడియజూడకున్న జాలెనే యిట్లా
అలయించిన నాదాయ మెంతౌనే
వలచి వేలునాకివ్రతము జెరుచుకొంటినే ॥కుంద॥" (ప-50)

ఇలాగే నాయికానాయకుల పరస్పరానునయం (11, 31, 47, 52, 75), పరస్పరోపాలంభనం (25, 37, 53); దూతీప్రబోధం (4, 5, 38, 61, 71) ఉన్నాయి. ఇంకా రకరకాల శృంగారాలూ వర్ణితం.

### 4.2 భక్తిరసం :

క్షేత్రయ్య కేవలం శృంగారపదాలు మాత్రమేరచించి, అందు మధురభక్తిని ప్రకటించిఉండగా, సారంగపాణి శృంగారపదాలేగాక, ప్రత్యేకంగా భక్తివైరాగ్యనీతి ప్రబోధాత్మకంగా కీర్తనలురచించి ఉండడం విశేషం. ఈకీర్తనల్లో సారంగపాణి ప్రకటించినభక్తివైరాగ్యనీతి ప్రబోధాత్మకరీతుల్ని చవిచూద్దాం.

భక్తి 'భజ్' ధాతువు నుంచి పుట్టింది; అంటే భజించడం; భగవద్భజనమన్న మాట. సహజంగా చిత్తం పరమేశ్వరుని పాదారవిందాల దగ్గరకు పోవడాన్ని 'భక్తి' అంటాడు శంకరాచార్యులు.[3] నారద భక్తి సూత్రాలలో "సాతస్మిన్ పర(మ)ప్రేమ రూపా" (సూ. 2) [ఆ భక్తి పరమేశ్వరుని యెడల పరమప్రేమ రూపంగా ఉంది.] అని చెప్పబడింది. అంటే ఈశ్వరుని యందుగల పరమప్రేమనే భక్తి అంటారు. ఇట్లే శాండిల్య భక్తి సూత్రాల్లోను "రసా పరానురక్తి రీశ్వరే" (సూ-2) - అంటే భగవంతునిపై గల పరమ ప్రీతి (గాఢానురాగం) భక్తి అని చెప్పబడింది. భగవంతుని యందుగల పరమపూజ్యమైన ప్రీతియే భక్తి. ఇది తొమ్మిది విధాలు.[4] ఈ భక్తిని రసమని నిరూపించినవాడు రూపగోస్వామి. నవరసాలకు మూలం భక్తి అని తెలిపి, దాన్ని సాంగోపాంగంగా నిరూపిస్తూ ఉజ్జ్వల నీలమణి గ్రంథరచన చేశాడు రూపగోస్వామి. ఆవెనుక మధుసూదన సరస్వతి తన భగవద్భక్తి రసాయనంలో భక్తికి రసత్వాన్ని స్థాపించాడు. ఈ ఇద్దరు మహానుభావుల సిద్ధాంతాల ప్రకారం "ఈ భక్తిరసమునకు నాలంబన విభావము భగవంతుడు; తచ్చరిత్రలు విభావములు; భగవదాకార చిత్త వృత్తియే స్థాయి భావము.. అదియే భగవద్రతి. అనుభావములు తత్కాలమునఁబుట్టిన నేత్రాది వికారములు వ్యభిచారులు నిర్వేదశంకా హర్షాదులు. ఇది పరమానంద స్వరూపమగు భక్తిరసముగా పరిణమించును."[5] ఇలాగా భక్తి రసంగా వర్ణించబడింది. "గేయరచనలలో సామ్రాజ్య పట్టాభిషిక్తులగు త్యాగయ్య గారిని విడిచితే భక్తివైరాగ్య రచనలో రెండవ స్థానము గోపన్నగారికే ఈయవలసి

---

3. అంకోలం నిజబీజ సంతతిరయస్కాంతోపలం సూచికా
   సాధ్వీనైజ విభుం లతాక్షితిరుహం సింధుస్సరి ద్వల్లభమ్।
   ప్రాప్నోతీహ యథాతథా పశుపతేః పాదార విందద్వయమ్
   చేతోవృత్తి రుపేత్యతిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే॥
   (శివానందలహరి - శ్లో.61)

4. శ్రవణం కీర్తనం విష్ణోః పాదసేవనమ్
   అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్:(భాగవతం-దశమస్కంధం)

5. శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు : కావ్యాలంకార సంగ్రహం-పు.306.

ఉంది.... ఆయన తాను రచించిన కీర్తనలలో యెదుటివారిని పరవశము చేసి తాను పరవశమగును. 'సకలేంద్రియములార ! యిపుడు సమయముగాదు. సద్దు సేయక యుండరే' అని గోపన్నగారు అంటూ ఉంటే ఇంద్రియములకు ఏకాగ్రత గోపన్న గారికే కలుగుతుందో మనకే కలుగుతుందో చెప్పలేను.... త్యాగయ్య గారికుండే సర్వతోముఖ ప్రతిభగాని, గోపన్నగారి కుండే భక్తి తాదాత్మ్యముగాని, సారంగపాణి గారికి లేకపోయినా, భక్తికి తగిన భావన, భావనకు తగిన భాష ఒకదానికొకటి తుల తూగుతూ సారంగపాణిగారి భక్తివైరాగ్య కీర్తనలు చాలా హృదయంగమములుగా ఉంటాయి."[6] - అని మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు అభిప్రాయ పడ్డారు. కానీ మనం ఇక్కడ ఓవిషయం గమనించాలి, భక్తిభావనలో త్యాగయ్య, రామదాసులతో ఇతర వాగ్గేయకారులను పోల్చడానికి వీల్లేదని నా అభిప్రాయం. వీరిద్దరు అజన్మ శ్రీరామ భక్తాగ్రేసరులు, సారంగపాణి క్షేత్రయ్య లాగా మొదట రక్తిగలిగి ఆవె నుక భక్తి వైరాగ్యాల్ని ప్రకటించాడు. అంతేగాక సారంగపాణి కీర్తనల్లో తాదాత్మ్యం లేదంటే, త్యాగయ్య కృతులకు, రామదాసు కీర్తనలకు ఉన్నంత ప్రచారం సారంగ పాణి కీర్తనలకు లేకపోవడమేనని భావించవచ్చు. అయినా నవవిధ భక్తుల్ని, వైరాగ్య కీర్తనల్లో ప్రకటించాడు సారంగపాణి, ఇష్టదైవం వేణుగోపాలుడు.

"వేణుగోపాలుని విడువము - మరి
వేరే వక్కరి పేరు నుడువము
............ .... .... ....
పతిత పావనుడే మాకు చుట్టము
గోపబాలుని భజనె దిట్టము
. . . . . . .
హరిని వినా వేరే పాడము.....
..... . .... వరం
కామునిమదిలో బంధింతుము

6. నమీక్ష. సారంగపాణి పదములు - పు20, 21.

నారాయణ దివ్యనామము యె
న్నటికీ మరువ మీ నీమము
తారకమిది మాకు క్షేమము శ్రీ
ధరుని సేవే పూర్ణకామము" (కీర్తన-158)

అని విష్ణు భక్తి, కీర్తన, స్మరణ, సేవనాదుల్ని ప్రకటించాడు.

ఇలాగే : "అన్నిటికిది సులభ మార్గము సుమీ
హరినామస్మరణా
పన్నగశయనుడైన వేణుగో
పాలుని సన్నిధికి జేరేటందుకు." (కీర్తన-183),

అని తెలిపి, జపతపాలు, యజ్ఞయాగాలు, వేదవాదాలు, వ్రత తీర్థయాత్రలు, దానధర్మాలు అవసరంలేదనీ వివరించి, చివరికి తాపసియై గుహలు జేరడాన్ని ఖండించాడు. అదే విధంగా వేణుగోపాలుని పాద భక్తి ప్రధానమని "భక్తిలేని వ్రతము లెన్ని జేసిన ఫలము లేదు సుమ్మీ" (కీ-184) అని చాటి, పై ఆడంబరాల్ని ఖండించాడు. ఇంకా "నీ దివ్యమంగళమూర్తి ధ్యానము, భక్తి నిత్యముకృప సేయవే" (కీ-185) అని వేడు కొంటాడు. ఇంకా :

"పట్టవలెనయ్యా - గట్టిగమనసు
పట్టవలెనయ్యా
పట్టవలె వేణుగోపాలు పదములు
కట్టవలెను వైకుంఠానికి మెట్లు" (కీ-165)

అని భక్తిమార్గాన్ని ప్రబోధించాడు. పూజఅవసరమే. కాని అదిభక్తిసహితమైనప్పుడే దానికివిశిష్టత; చేసినందుకు సార్థకత; సఫలత. అందుకే సారంగపాణి.

"భక్తిలేనిపూజ లేమిటికి ప్రతిదొరకగానే
భక్తిలేనిపూజ లేమిటికి" (కీ-180) అనిఅంటాడు.

మహాభక్తాగ్రేసరులైన కుబ్జ, శబరి, కుచేలుడు, విదురుడు, నారదుడు, విభీషణుడు, ధృవుడు, హనుమంతుడు, గుహుడు మొదలైనవాళ్ళ చరిత్రల్ని పేర్కొని అంతటిభక్తి తనలోలేదంటూనే తనభక్తి ప్రపత్తిని ప్రకటించాడు సారంగపాణి.

"నిన్ను నేనువిడువాను నీపేరుమరువను
నీబంటు బంటైనాను॥ (కీ-179) అని,

"హరినారాయణ గోవిందాయని
స్మరణసేయవే వోమనసా
పురుషోత్తమ దామోదర కేశవ
భోగిశయన వేణుగోపాల॥ (కీ-175)

అని భగవన్నామస్మరణ ప్రాధాన్యాన్నిచెప్పి నిర్మలభక్తి కావాలని వివరించాడు. "కర్మఫలము రామునికర్పించి" – అనిభగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించిన ప్రధానవిషయాన్ని వివరించాడు. "ఎంతపేదవాడే " (173)అని నిందా స్తుతిచేసి, "నిన్నుగొల్చి...." (177), "నన్నునీవిక " (178)అని ప్రార్థించి భగవద్భక్తిని ప్రకటించాడు. "మనసా చపలము మానవా...."(182),"మనుషానన్మ కాకే " (150) "అద్దెకొంపవంటిది యీదేహమనిత్యమేమనసా "(199)– అని వైరాగ్యంప్రబోధించి, ఆధ్యాత్మిక చింతననుగూర్చిన ఆలోచనకు అవకాశం కల్పించిన మహాభక్తుడుగా, వైరాగ్యప్రబోధకుడుగా, ఆధ్యాత్మిక చింతనాపరునుగా సారంగపాణి మనకు దర్శనమిస్తాడు.

### 4.3 మధురభక్తి :

భాగవతంలోని భక్తి మధురభక్తి. భాగవతభక్తి సంప్రదాయం శ్రీకృష్ణ సంబంధి భక్తిమార్గాల్లో శ్రేష్ఠమైంది. భాగవతంలోని మధురభక్తి రసావలంబనులైన గోపికాకృష్ణులు ఆలంబనగా వెలసింది వల్లభాచార్యుని పుష్టిమార్గం. ఇదిచైతన్య స్వామి మధురభక్తి. భగవంతుడనే నాయకుడొక్కడే పురుషుడు; మానవకోటి స్త్రీ సమూహం. ఈస్త్రీపురుషుల అనంతశృంగారలీలయే విశ్వం. ఇట్లాంటిఅలౌకిక మధుర

భావంగల మధురభక్త్యుపాసకులు జయదేవుడు, విద్యాపతి, మీరా, అన్నమయ్య క్షేత్రయ్యలు. కానీ అన్నమయ్య, క్షేత్రయ్యల మధురభక్తి[7] సారంగపాణిలో కని పించడంలేదు. శృంగారపదాల్లో లౌకికశృంగారాన్ని, కీర్తనల్లోభక్తినీ ప్రకటించాడన్న విషయం పూర్వోక్తం. అయినా -

"పల్లవి : కులకాంతలు విడిబడి నలుదిక్కుల
చెలరేగి రిదేటి పాపమో అయితే

అను : వెలయాండ్లకు జీవనమేమిక శ్రీ
వేణుగోపాలా సంకరమై ॥కుల॥

ఉగదెలియని బిడ్డలనెడబాసి - పున్న మూలముంత దాటవేసి
మగనిపేరు కారాదాదని రోసి - మన్నెకాషరము వ్యర్థముజేసి
॥కుల॥

.... ... ... .... .... .... ..

తల్లిదండ్రులమది తల్లడబెట్టి - తనుజాతుల కపకీర్తిజుట్టి
తలపరాని నిందెలకొడిగట్టి - ధర్మశాస్త్రముల రోచికబుట్టి
॥కుల॥ (ప-138)

- అనేపదంలో లౌకికశృంగారం కనిపించినా, భాగవతగోపికా మధురభక్తి చ్ఛాయలు కనిపిస్తున్నాయి. ఇంతేగాక ఈపదం క్షేత్రయ్యమధురభక్తి ప్రాధాన్యంగల ప్రసిద్ధపదం -

"చూడరె అది నడిచే హొయలు

.... .... .. ... .... .... ....

కూడునటే అదిమనిషా ప్రమాకా"[8] - ను గుర్తుకుతెస్తుంది. కొంత వరకు సారంగపాణిపదం దీనిలోని మధురభక్తిచ్ఛాయల్ని తెలుపుతుంది.

---

7. క్షేత్రయ్య పదసాహిత్యం - పు.175 - 189 .
8. పైదే - పు.185, 185.

4.4 నీతిబోధ :

అన్నమయ్య శృంగార సంకీర్తనలతో పాటు అధ్యాత్మ సంకీర్తనలు రచించి తరించాడు. క్షేత్రయ్యవి కేవలం శృంగార పదాలు మాత్రామే. సారంగపాణి శృంగార పదాలతోపాటు కీర్తన రచనచేసి, అందులో భక్తి, వైరాగ్యం, వేదాంతం, ఆధ్యాత్మికచింతన, తాత్వికచింతన మొదలైన విషయాల్ని వివరించి, లౌకిక విషయాల్ని తెలిపి మంచిని పెంచుకోవాలని మానవాళికి నీతి ప్రబోధం చేశాడు. సారంగపాణి లోకరీతుల్ని, వ్యక్తుల తత్వాల్ని బాగా గుర్తించినవాడు కావడం వల్ల భక్తి లేని పూజ అనవసరమనీ, "జీతము ముట్టని కొలువేమిటికి" (180) అని అనేక విషయాల్ని, "గుత్తలంజలను మరగిన వారికి" (191) కలిగే పర్యవసానాన్ని, "పోరాని తావులకు పోరాదు బుద్ధిమంతుడైతే" (181) చెప్పి "కడుపా నీ వంతఘనమైతివా.... కోటివిద్యలు నీ కొరకేగదవే" (192) అని అనేక జీవిత సత్యాల్ని వివిధ రీతుల వివరించాడు. "పాపాత్ములకెక్కడిదీ కాలము" (193) అంటూ పాపాత్ముల పాపపు కార్యాల్ని తెలిపి, "దాతను వాజులు జరిపే దబ్బలి తలమీదనె సొడ్డు" (167) అంటూ ఏదోవంక జూపి తప్పించుకోవడం ఉత్తమ లక్షణం కాదని నిరూపించి, "మంచివాడనుచు కీర్తి వహించే మానవుడే ఘనుడు" (171) అని మంచివాడుగా మనడానికి వలసిన సమస్త విషయాలు వివరించి, "భక్తితో పిలిచి పెట్టిన యన్నము పట్టెడైనా చాలు" (176) అంటూ అంతశ్శుద్ధి, ఆత్మసంతృప్తి ప్రధానమని ప్రబోధించాడు.

"అక్షయ పాత్రకుపోతే కలదని వొక భిక్షవేయరయ్యా" (194) అనే పదంలో అక్షయపాత్రతో భిక్షమెత్తుకొని జీవించే సర్వసంగ పరిత్యాగుల్ని లెక్కచేయని దుష్టుల దౌష్ట్యాన్ని మిక్కిలి గర్హించాడు సారంగపాణి. ఇలాగే "ఉంఛవృత్తితో బ్రతికే వారికి" (195) కోప మనవసరమనీ,

"అమ్మా! అక్కా! అయ్యా! యనవలె
పొమ్మంటే తలవంచుకపోవలె

రొమ్ముననెత్తి తంబుర మీటుచు బాడుచు
రోసము పడక యిల్లిల్లు దిరుగవలె"- అంటూ ఎంతో చక్కగా ప్రబోధించాడు. ఇది సారంగపాణి జీవితంలోని చివరి దశలోని స్వానుభవమంటారు బాలాంత్రపు రజనీకాంతరావు గారు.[9] కానీ ఆనాటి సమస్తవ్యక్తుల మనస్తత్వాల్ని పరిస్థితుల్ని గుర్తించిన లోకజ్ఞుడైన కవిగా సారంగపాణి చెప్పిన నీతి అని తలంచడమే సముచితమని నాభావన.

భక్తి, వేదాంతం, వైరాగ్యం, ఆధ్యాత్మికచింతన, తాత్వికచింతనలని చక్కగా వివరించాడు సారంగపాణి. "హరి తానే వున్నాడన్నిటికీ యేవెరపు లేదిక మాకు" (189) అని అంతటికీ ఆ పరమాత్ముడని వివరించాడు. ఇంకా-

"పల్లవి : అద్దెకొంపవంటి యీదేహ
మనిత్యమే మనసా

అను : మిద్దెమీది పరుగులు రెణ్ణాళ్లు సు
మీ వేణుగోపాలుని సాక్షిగ ॥అ॥

బందెగొడ్లవంటిది సంసారము
భ్రమయకే మనసా
యెవరున్న నదమంత్రమె జీవుని
కెవరులేరు మనసా ముమ్మాటికీ ॥అ॥

పువ్వువంటిది యౌవమనగా
పొంగకే మనసా
నవ్వుగాదు సిరులు మెరుపు వంటివి
నమ్మకే మనసా ముమ్మాటికి ॥అ॥ (ప-190)

అని శరీరమనిత్యమన్న సత్యాన్ని హృదయానికి హత్తుకొనేట్లు నీతిని ప్రబోధించాడు సారంగపాణి.

ఇలాగా సారంగపాణి శృంగార, భక్తి, వైరాగ్యాల్ని సముచిత రీతిని వర్ణించాడు.

---

9. ఆంధ్రవాగ్గేయకార చరిత్రము - పు.299, 300.

# 5. సంగీతం - అభినయం

క్షేత్రయ్యలాగా సంగీత సాహిత్యాలకు సమాన గౌరవం ఇచ్చి అభినయానికి అనుకూలంగా పదరచన చేయడమేగాక, కీర్తనలు సైతం రచించిన సారంగపాణి పదాల్లోని సంగీతం, అభినయాన్ని గూర్చి క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం. తన్మూలంగా సారంగపాణి పదవివరణ అన్ని దృక్కోణాలనుంచి చూచినట్లవుతుంది. ఈ పరిశీలనకు సంపూర్ణత చేకూరుతుంది. నేను సంగీతాభినయాలు తెలిసిన వాడిని కాకపోయినా క్లుప్తంగా వాటిని వివరించడానికి యత్నిస్తాను.

## 5.1 సంగీతం :

> "వాఙ్మాతురుచ్యతే గేయంధాతు రిత్యభిధీయతే
> వాచం గేయంచ కురుతేయః సవాగ్గేయ కారకః"
>
> [శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరం]

పదంలోని వాక్కు మాతువు; గేయం ధాతువు. అలాంటి వాక్కును గేయాన్ని రచించగలవాడు వాగ్గేయ కారుడని అర్థం. ఇతఃపూర్వమే సారంగపాణి మాతువు అంటే పదాల్లోని సాహిత్యాన్ని రుచిచూశాం. ఇప్పుడు ధాతువు అంటే సారంగపాణి పదాల్లోని సంగీతాన్ని గూర్చి పరిశీలిద్దాం. "గీతం వాద్యం తథా నృత్యం సంగీత ముచ్యతే"-గీతవాద్య నృత్యాలు మూడింటిని సంగీతమంటారు. కానీ "గీతవాద్యో భయం యత్ర సంగీతమితి కేచన"-అంటే గీతవాద్యాలు సంగీతమని కొందరితలంపు. ఆంధ్ర వాగ్గేయకార పితామహుడైన అన్నమయ్య సంకీర్తనల్లో సాహిత్యానికి ఎక్కువగానూ, సంగీతానికి తక్కువగానూ ప్రాధాన్యముంది. పదకవితా చక్రవర్తి

ద్యైన క్షేత్రయ్య పదాల్లో సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యం ఉంది త్యాగయ్య కృతుల్లో సంగీతానికి ఎక్కువగానూ, సాహిత్యానికి తక్కువగానూ ప్రాధాన్య ముంది. పదకర్తల్లో క్షేత్రయ్య పక్కనే నిలువగలవాడు సారంగపాణి. కాబట్టి ఈతని పదాల్లోనూ సంగీత సాహిత్యాలకు సమానమైన ప్రతిపత్తి వుంది. సారంగ పాణి పదాలు, కీర్తనలకు వాడిన రాగతాళాలు మాత్రమే తెలుస్తున్నాయి. కానీ స్వర ప్రస్తారం మొదలైన విషయాలు మనకు తెలియడంలేదు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు క్షేత్రయ్య పదాల్లో కొన్నింటికి రామదాసు కీర్తనల్లో కొన్నిం టికి మంచాళ జగన్నాథరావు గారిచేత స్వరకల్పన చేయించి ప్రకటించారు. ఇలాంటి స్వరకల్పన సారంగపాణి పదాలకు సైతం చేయించడం ఎంతైనా అవసరం. "క్షేత్రయ్య మార్గము శృంగారమును ప్రధానముగా స్వీకరించి అధ్యాత్మబోధ అంతర్గర్భితముగా సాగుతూ నాట్యమునకు, అభినయమునకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చింది. క్షేత్రయ్య మిగిలినవారి కంటె ఒక అడుగు ముందుకు వేసినది ధాతు కల్పనములో! అంటే సంగీత రచనలో! ఇది తరువాత వాగ్గేయకారు లెందరికో క్షేత్రయ్యను మార్గదర్శిని చేసింది. నేటి కర్ణాటక సంగీతపు రాగాల స్పష్టరూపం కావలె నంటే మనకు తొట్టతొలుతగా క్షేత్రయ్య పదాలలో దొరుకుతుంది "[1] ఇలాగే సారంగపాణి పదాల్లోను మనం సంగీత రీతులను చూడవచ్చు. సారంగపాణి కార్వేటి నగర సంస్థానములో ఆస్థాన విద్వాంసుడు, వైణిక విద్వాంసుడు, ఉత్తమ వాగ్గేయ కారుడు, అభినయాచార్యుడు, సంగీతవేత్తగా ఉండి, అనేక సమ్మానాల్ని పొందిన వాడన్న విషయం పూర్వోక్తం. ఇలాగా సారంగపాణి విశిష్ట వాగ్గేయకారుడు కావడం వల్లనే తన పదాల్లో అనేక రాగతాళాల్ని ప్రయోగించాడు. కానీ వాటి స్వర ప్రస్తారం మనకు తెలియదు.

సారంగపాణి పదాల్లో అక్కడక్కడ పదం పాడడం ఆడడం, వీణ, కిన్నెర, తంబుర మొదలైన వాద్యాలతోపాటు అనేక రాగాలపేర్లు పేర్కొనడం జరిగింది.

"ఈసీమల హరిణాక్షుల వలె గా దీ మోహనాంగి" (1)

1. సాహిత్యోపన్యాసములు-3 క్షేత్రయ్య పదసాహిత్యం 1963. పు.61.

"కన్నతల్లి కరుణించి బ్రోవుమిక" — (201)

- ఈరెండు పదాల్లోను అనేకరాగాలపేర్లు పేర్కొన్నాడు సారంగపాణి. మోహన, కళ్యాణి, కన్నడ, దరబారు, తోడి, గుజ్జరి, సారంగ, గౌరి, వరాళి, శ్రీ, అసావేరి, భైరవి, పంతువరాళి, ఆనందభైరవి, సురటి, బిలహరి, శంకరాభరణం, మాధ్యమావతి, - అనేరాగాల్ని పేర్కొన్నాడు. ఇంతేగాక - "దానిప్రాయము పదారేండ్లు నీదానినేలుకోరా" (2) - ఈపదంలో స్వరస్థానాల్ని వివరించాడు. సారంగపాణి తనపదాలకు వాడిన రాగాలుమొత్తం 42. అన్నిటికంటె అధికంగా వాడబడిన రాగం పంతువరాళి. ఆవెనుక గౌళిపంతు, భైరవి, ఆనందభైరవి, ముఖారి, మోహన, శంకరాభరణం, మధ్యమావతి, రాగాలు వాడబడ్డాయి. కొంతతక్కువగా కళ్యాణి, సావేరి, అసావేరి, సౌరాష్ట్రి, కాపి. తోడి, బిలహరి, ఆరభి, సారంగ, నాదనామక్రియ, పున్నాగవరాళి, బేగడ, హుసేని, కన్నడ, పరజు, నవరోజు, సురటి, కేదారగౌళ, యదుకులకాంభోజీ అనే అపురూపరాగాలు ప్రయుక్తమయ్యాయి. ఒక్కసారి మాత్రం శుద్ధసావేరి, ఘంటారాగం,నాటకురంజి, గౌరి, అఠాణా, రేగుప్తి, శ్రీ, అహిరి, నీలాంబరి, శహన, ధ్వజావంతి, కర్ణాటసారంగ-రాగాలు వాడబడ్డాయి. అపురూపరాగమైన "అపరూప" అనే రాగాన్ని వాడడం సారంగపాణి విశిష్టత. క్షేత్రయ్య 380పదాల్లో 49రాగాలువాడగా, సారంగపాణి 201పదాల్లో మొత్తం 42 రాగాలు ప్రయోగించాడు.

ఇక సారంగపాణివాడిన తాళాలు తెలుసుకొందాం. సారంగపాణి పదాల్ని సగానికిసగం ఆదితాళంలోనూ, నాల్గోవంతు చాపుతాళంలోనూ, ఆరోవంతు త్రిపుట తాళంలోనూ, ఒక్కొక్కటి ఆట, ఏక, ద్విజాతి లఘువు తాళాల్లోనూ రచించాడు. ఇలాగా సారంగపాణి తనపదాల్లో రాగతాళ ప్రయోగంచేశాడు.

సారంగపాణి పదాల్లో ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగాల్లోనివి పదాలు, చతుర్థభాగంలోనివి కీర్తనలు. నాలుగోభాగం చివర రెండుహెచ్చరికలు,

"హెచ్చరికె పరా - కిందిరా రమణా" - (197)

"శ్రీలలనామణిరమణా ! శ్రితపోషణ సుగుణా" (198)

ఒక లాలిపాట –

"లాలెనుచు పూచేరు లలనలింపునను" – (199)

ఒక మంగళం –

"జయమంగళము నిత్య శుభమంగళము" – (200)

సారంగపాణి రచించాడు.

ఈసారంగపాణి పదాలకు క్షేత్రయ్యపదాల్లాగా ఈనాడుఅంతగా ప్రచారంలేదనే చెప్పాలి. చాలాకాలంక్రితం బొబ్బిలిప్రాంతంలో కీర్తనలు పాడబడుతూండేవని మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు తెలిపారు.[2]

శాస్త్రిగారి నాయనమ్మగారు –

"హరినారాయణ గోవిందాయని
స్మరణసేయవే వో మనసా" [175]

"ఎంతపేదవాడే వేణుగోపాలు
డెంతపేదవాడే" (172)

"హరినామ స్మరణే సేయకుంటే
అవతల గతియేమి" (168)

– అనేకీర్తనలు పాడేవారట. ఇలాగే సాతానిజియ్యర్లు –

"అక్షయపాత్రకుపోతే కలదని ఒక
భిక్షవేయరయ్యా !" (194)

2. సమీక్ష. సారంగపాణి పదాలు పు-5-7,9,10.

"కడుపా నీవింతఘనమైతివా - యే
కడగురుతులేదాయే కలకాలమునందు" (192)

"భక్తిలేనివ్రతము లెన్నిజేసిన
ఫలములేదు సుమ్మీ" (184)

– అనేకీర్తన ఆలాపన చేసేవారట. ఇంకా బొబ్బిలికోవెలలో వృద్ధ భాగవతుడు -

"లాలెనుచు వూచేరు అలనలింపునను
శ్రీల చెన్నలరు నుయ్యాలపాన్పునను - (199)

అనే లాలిపాట పాడుతుండేవాడట. అంటే ఒకనాడు సారంగపాణి కీర్తనలకు అధికప్రచారమే ఉండేదని స్పష్టమవుతుంది. "సారంగపాణి ధాతుకల్పన క్షేత్రయ్య పదాలకు రమారమి తుల్యంగానేసాగుతూ, శబ్దాలంకారాలు వచ్చినచోట్ల స్వతంత్రమైన క్రొత్తపుంతలు తొక్కుతూ ఉంటుంది.

"కొందరు ఈనాటి పెద్ద విద్వాంసులు అప్పుడప్పుడూ తమ కచ్చేరీలలో కొన్ని సారంగపాణి పదాలను పాడుతూవుంటారు. కానీ క్షేత్రయ్య పదాలను నేర్చుకొని పరంపరాగతంగా పాడుకొంటు నేటికీ కొందరు మిగిలినట్లుగా సారంగపాణి పదాలకు అంత ప్రచారం కలిగినట్లులేదు."[3]

## 5.2 అభినయం :

పదం అనగానే క్షేత్రయ్య గుర్తుకువస్తాడు. పదాభినయం క్షేత్రయ్య సొత్తు. దానికి వివరణలు వ్రాసినవారున్నారు. కూచిపూడి వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి గారు, దేవులపల్లి వీరరాఘవ మూర్తిగారు, వేదాల తిరువేంగళాచార్యులుగారు, నటరాజ రామకృష్ణగారు; పదాభినయాన్ని గూర్చి రచించిన వారిలో కొందరు. వేదాంతం

---

3. బాలాంత్రపు రజనీకాంతరావుగారు : ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము- పు 126-137,

లక్ష్మీనారాయణగారు, తాండవ కృష్ణగారు, నటరాజ రామకృష్ణగారు ప్రభృతులు పదాభినయ వేత్తలున్నారు.

కానీ సారంగపాణి పదాభినయం ఈనాడుచేసేవారు లేరనే చెప్పవచ్చు. ఈ పదాలు అభినయం పట్టిన వారు కూడా వుండే వుంటారనవలసి వుంది. ఇందుకు నిదర్శనాలున్నాయి. పదమనగానే అభినయోద్దిష్ట మన్న విషయం మనం మరవరాదు. కాబట్టి సంగీత సాహిత్యాలతోపాటు అభినయానికి ప్రాధాన్యం ఇవ్వబడడం మూలాన్నే పదరచన చేయడం జరిగింది. లేకపోతే పదరచన చేయవలసిన పనిలేదని అర్థం. ఈ విషయంలో బాలాంత్రపు రజనీకాంతరావు గారి మాటల్ని ఉల్లేఖించడం తప్ప మార్గాంతరం లేదు. సారంగపాణి సమకాలికులు కార్వేటి నగర ఆస్థానంలో ఉండిన వాగ్గేయకారులు ఇంకా ఇద్దరు గోవిందసామయ్య, అతని తమ్ముడు కూవన సామయ్య. "కార్వేటినగరాన్ని అప్పుడు ఏలుతూండిన మాకరాజు వేంకట పెరుమాళ్రాజు ఇతనిని (గోవింద సామయ్యను) బహూకరించి సన్మానించాడు. ఒకసారి రాజు వేంకటగిరి వారి కుమార్తె అయిన తన రాణిపైన కోపించి ఆమెను కాపురానికి తెచ్చుకోక బాధ పెట్టినట్లు గోవిందసామికి తెలిసిందట. బహూశా గోవిందసామి స్వస్థలం వెంకటగిరియే యేమో గోవిందసామి రాజుకు తెలియకుండా వెంకటగిరికి వెళ్ళి ఆమెకు సంగీతమూ నాట్యము నేర్పి పురుషవేషం వేయించి రాజుగారి ఎదుట ఆమె సంగీతనాట్యములను ప్రదర్శింపజేసి, రాజు మెప్పుపొంది తిరిగి ఆమెను స్వీకరించుకొనేటట్లు చేసినాడట. మోహనరాగంలో "సరిగా దాని .. ...." అని స్వరసాహిత్యం వచ్చునట్లు రచించిన పదవర్ణం ఈ సందర్భంలో పాడినదే కావచ్చును. ఇంకా అతడు కేదారగౌళ నవరోజు ముఖారి రాగాలలో పదవర్ణాలు రచించాడు. ఇవన్నీ నృత్యాభినయానికి ఎంతో అనుకూలమైన జాతి భేదాలను కలిగివుంటాయి" "సారంగపాణి క్షేత్రయ్యవలే భరతశాస్త్ర లక్షణానికి ఉదాహృతులుగా పదాలు రచించడమే కాకుండా గోవింద సామయ్యవలే ఇతరులకు వేషాలు వేసి నాట్యాభినయాలలో శిక్షణ ఇచ్చి పదాలను నాట్యాభినయ యుక్తంగా ప్రదర్శింప జేసారట అంతేకాదు తానుకూడా ఒకసారి స్త్రీ వేషంవేసి సభాధ్యక్షుడైన రాజునే గాక సభాసదులయిన తన మిత్రు

లను కూడా నిజమైన స్త్రీ మూర్తిగా నమ్మించినాడట."[4] కాబట్టి క్షేత్రయ్య పదాల లాగానే సారంగపాణి పదాలు గూడా అభినయానుకూల్యమై ఉన్నాయని, ఈనాడు విరివిగా అభినయం పట్టకపోయినా, ఒకనాడు సారంగపాణి పదాలు అభినయం పట్టే వారని స్పష్టమౌతుంది.

5.3 అశ్లీలతా నిరాసం :

ఇక చివరగా ఈ పదకవితలు ముఖ్యంగా క్షేత్రయ్య, సారంగపాణి, పదకవితలు, అశ్లీలమూ, అసభ్యమూనని కొందరు తలంచుతున్నారు. దీనికి సమాధానంగా క్షేత్రయ్య పదసాహిత్యంలో [పు 189-194] విపులంగా చర్చించి ఖండించాను అనేకోప పత్తులతో. క్షేత్రయ్య పదాలతోపాటు సారంగపాణి పదాల్ని అశ్లీలమూ, అసభ్యమూనని అసహ్యించు కొన్నవారు సీరపాణి గారు[5]. వారు జుగుప్సాకరాలైన వంటూ ఈ కింది సారంగపాణి పదాల్ని పేర్కొన్నారు.

"వారివలే చక్కనివాడైతే చేరనిత్తువు నిజమే" (138)

"నిష్కర్షగా రాత్రి కొచ్చేవాడివైతే" (88)

"వక్కకైన నాసలేదుగదవే" (58)

"అంతమాత్రము నేనీయనచె" (94)

"పదిమంది కొడుకులుగన్న దానిచేతికి (95)

వీటిలో ఏమిజుగుప్స కనిపించిందో అర్థంకావడంలేదు. వాస్తవానికి సీరపాణి గారు తలంచిన జుగుప్సలాంటిది .

"సీసపురూకలు కొంగునకట్టితే
దోసకారి చూడరాదచే" (99)

---

4. పైదే పు. 316, 327.
5. ఆంధ్రపత్రిక (1953-54) పు.156-163.

"మద్దిస్వరూపమా ! ఇట్లాడ తగునటే
మరియాద తెలియకనూ" (97)

నీవురాకుంటేనే నిన్నుమించిన దొకతే (103)

– వీటిలో కనిపిస్తుంది. అయినా ఈపదాలన్నీ సారంగపాణి పదాల్లోని ద్వితీయభాగంలోని దేశీయ పదాల్లోనివే. కాబట్టి బహుజాగరుకుడై సారంగపాణి తన పదాల్ని విభజిస్తూ వీటిని దేశీయమైనవిగా పేర్కొన్నాడు.

ఆనాటి లోకసహజరీతిని చక్కగా అభివర్ణించాడన్న విషయం పూర్వోక్తం. కాబట్టి మనంవీటిని జుగుప్సాకరమైన పదాలని తలంచడం సముచితంగాదు. అలా అనుకొంటే మనసాహిత్యంలోనేగాదు ప్రపంచ సాహిత్యమంతటా ఇలాంటిరచన కనిపిస్తూనేఉంటుంది. సంస్కృత సాహిత్యంలోనూ, మన ప్రబంధాల్లోనూ శృంగార రసభరితమైన వర్ణనలు అనంతంగా గోచరిస్తూనేఉంటాయి కాబట్టి ప్రత్యేకించి, పృధక్కరించి ఎక్కడోఒకటో, అరో అలాంటిపదాలు దొరలినంతమాత్రాన సాహిత్యమంతా తీసివేయాలనడం సమంజసంకాదు. అలాఅంటే మనం సాహిత్య మంతటినీ నిషేధించవలసి వుంటుందన్నసంగతి మనం మరువరాదు ఇంకోవిషయం మనం ఇక్కడ గమనించవలసివుంది. క్షేత్రయ్యకేవలం శృంగారపదాలు రచించాడు. కానీ అన్నమయ్య తరువాత సారంగపాణి శృంగారపదాలతోపాటు నీతి, వైరాగ్య భక్తి ప్రబోధాత్మకంగా కీర్తనలుసైతం రచించాడు పైగా శృంగారపదాల్లో గ్రామ్యోక్తులుండ వచ్చునని సంకీర్తన లక్షణగ్రంధం చెబుతూందన్న సంగతి పూర్వోక్తం. తదుచిత రీతినే పదాలు, కీర్తనలు రచించాడు సారంగపాణి. ఇక ఇదంతా పచ్చి శృంగారం అన్నదానికి సమాధానం చెప్పవలసివుంది. "నిజంగా ఈ పచ్చి మనము భయపడవలసినదే. దీనినే 'మహాశనో మహాపాప్మా' అనియు, జ్ఞానికి నిత్యవైరి అనియూ, గీతవాకొన్నది. ఈ వైరి నేమిచేయవలయును ? మూల ముట్టుగా చంపుట యొక మార్గము. మనము తల తప్పించుకొని తిరుగుట రెండవది. ఈ రెంటికన్నా ఉత్తమమైనది 'పొసగ మేలుచేసి పొమ్మనుట మేలు' అని వేమనచెప్పినట్లు ఆశత్రువును మిత్రునిగా జేసికొనుట అనగా పచ్చిని పండుగా

జేసికొనుట; ఉత్తమ సంస్కార లక్షణమది .. ఇది పచ్చియనుకొనువారి అనుభవ వివేకములు పచ్చివి. అంతేమరి"[6]

సుదీర్ఘమైన ఈ పరిశీలన వల్ల ఉత్తమ వాగ్గేయకారుడుగా, పదకవితా శిల్ప నైపుణ్యంతో, మనోజ్ఞమై, రసభావ వ్యక్తీకరణ కుపకరించే రాగ భావసంపూర్ణమైన ధాతు మాతు రచయితగా, చక్కటి లోకజ్ఞత కలవాడుగా, కేవలం శృంగారమేగాక నీతి వైరాగ్య భక్తి ప్రబోధాత్మకమైన కీర్తనకారుడుగా అనేక ముఖాలతో దర్శనమిచ్చి తెలుగు సాహిత్యంలో ప్రజాకవిగా తన స్థానాన్ని నిలబెట్టుకొన్నవాడు సారంగపాణి. అతని భాష సజీవం. అతడు అమరుడు !

---

6. శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ - ఆంధ్రపత్రిక (1940-65)-పు 24.